మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి రాఘవయ్య

సంస్థాపకులు
కీ॥ శే॥ వి.వి. రాఘవయ్య



జనవరి 1979

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 16 సంచిక 12

## విషయసూచిక



ముఖచిత్రం: 'అతని కంటె ఘనుడు'లో జయప్రద

జ్యోతి, 17-B రాజారాం కాలనీ, P. B. నెం. 2650, మద్రాసు-600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో రు. 42/)

# మీ యింట ఒక గ్రంథాలయం నెలకొలుపు!
# మానసిక వికాసానికది మేలుకొలుపు!!

## అందుకే మీకో స్వంత గ్రంథాలయ పథకం

మొదటి నెలలో సభ్యత్వ రుసుము రూ. 4 లతోబాటు ప్రతినెలా రూ. 10 ల చొ॥న 12 నెలలు చెల్లించండి!
మొదటి 3 నెలలు మీరు పొందబోయే నవలలు......

మొదటి నెల:
- డా॥ కొర్రపాటి గంగాధరరావుగారి అమృత మథనం
- డా॥ సి. ఆనందారామం గారి పాంచజన్యం
- శ్రీమతి కురుమద్దాలి విజయలక్ష్మిగారి ఒక జంట కలసిన తరుణాన
- బహుమతి కాపి: శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి శరద్రాత్రులు

రెండవ నెల:
- కళాప్రపూర్ణ లతగారి ఇది ఉదయం
- శ్రీమతి గోవిందరాజు సీతాదేవిగారి మిసెస్. మధుమతి
- డా॥ కె. వి. కృష్ణకుమారిగారి పథవిహీనులు ఎవరు?
- బహుమతి కాపి: కీ॥ శే॥ భమిడిపాటి కామేశ్వరరావుగారి కాలక్షేపం

మూడవ నెల:
- ఎమ్మెస్. ఎ. అయూబ్ గారి (ఎవ్వియల్) పలమావి తోట
- శ్రీమతి ప్రమీలా జనార్ధన్ గారి మనోమందిరం
- శ్రీధరగారి సారికలు
- బహుమతి కాపి: భమిడిపాటి రాధాకృష్ణగారి నీ కోసం

రాబోవు నెలలలో:
- శ్రీ రావు గోపాలరావుగారి నాకు పోటీ చెయ్యాలనుంది
- శ్రీ అల్లు రామలింగయ్యగారి ?
- శ్రీమతి చావలి మణిశాస్త్రిగారి ?

ఆంధ్రప్రదేశ్ అంతటా ఏజెంట్లు కావలెను!



వివరాలకు:
**లతా ఎంటర్‌ప్రైజెస్**
బుక్ పబ్లిషర్స్ & డిస్ట్రిబ్యూటర్స్
మెయిన్ రోడ్, రాజమండ్రి
బ్రాంచి: హైదరాబాదు

DIMPLE DESIGNERS



# మయసభ

విశ్వేశ్వరయ్యగారిది కళకళలాడే సంసారం.

పెద్దబ్బాయి రామం ఒక గవర్నమెంటు కంపెనీలో ఆఫీసరు. ఇద్దరమ్మాయిలకూ పెళ్ళిళ్ళయ్యాయి. పెద్దల్లుడు రైల్వేలో సూపరింటెండెంటు. చిన్నల్లుడు స్టీల్‌ప్లాంట్‌లో ఇంజనీరు. చిన్నకొడుకు లక్ష్మణ్ కాలేజిలో చదువుతున్నాడు. ఆఖరిది లలిత ఆయిదో తరగతిలో వుంది. కూతుళ్ళు అల్లుళ్ళు దీపావళికని వచ్చారు. విశ్వేశ్వరయ్య, దుర్గాంబా చాలా ఆనందపడిపోయారు. కొత్తబట్టలు, పిండివంటలు, హాస్యాలు, విందులు, వినోదయాత్రలు, విసుర్లతో వారంరోజులు చాల సరదాగా గడిచాయి.

'ఇంక తిరుగు ప్రయాణం అవుతామండీ!' అన్నారు వచ్చినవాళ్ళు.

అయిష్టంగా ఒప్పుకున్నారు ఇంటివాళ్ళు.

మామూలుగా ఏడాదికొకసారి ఇచ్చే బోనసు చాలదు ఏడాదికి రెండుసార్లు బోనసు ఇవ్వాలి అంటూ రామం వాళ్ళ కంపెనీలో అందరూ సమ్మె చేస్తుండడం వల్ల అతగానికి రెండువారాలయి ఆఫీసు లేదు. అంచేత అతడున్నూ, ఇద్దరు బావలున్నూ కలిసి రిజర్వేషన్ చేయించుకొద్దామని ఇంటినుండి బయలుదేరారు.

మామూలుగా నయితే వాళ్ళ వీధిచివర ఆటోరిక్షాలుండేవి. కాని అవాళ కనపడలేదు.

"రైళ్ళొచ్చే వేళ కదా, అంతా ఆ స్టేషన్‌వైపు వెళ్ళివుంటారు-" అన్నాడు పెద్దల్లుడు.

"పోనెండి, బస్సులో వెళ్దాము" అని చిన్నల్లుడు సూచించాడు

రామం నవ్వాడు.

అల్లుళ్ళిద్దరూ ప్రశ్నార్థకంగా చూచారు.

'గొర్రెల గోత్రాలు గొల్లల కెరుక'- అన్నట్లుగా 'సిటీబస్సుల గోత్రాలు సిటీ జనుల కెరుక' కదా అంచేత రామం సూత మహాముని పోజులో వివరణ మొదలుపెట్టాడు.

"బావలారా! మా వూళ్ళో తిరిగే నాలుగు చక్రాల బళ్ళ పేర్లయితే సిటీ బస్సులు కాని మాదిమాత్రం 'సిటీ' కాదు. నిజానికిది అనారోగ్యంతో వాపు పెరిగిన

ఏ. రామసంజీవి

కుగ్రామం. అంచేత ఇక్కడ పల్లెల్లోని సుఖాలు అంటే మంచిగాలి, చిక్కటి పాలు, తాజాకూరలు లాటివి వుండవు అలాగని పట్నాల్లోలా మంచి రోడ్లు, రవాణాసౌకర్యాలు, ఆస్పత్రి, విద్యా వసతులు వుంటాయా అంటే అవీ వుండవు! వెరసి, అటు పల్లెల్లోనివి, ఇటు పట్నాల్లోనివి అసౌకర్యాలన్నీ కలబోసి వుంటాయి ఉభయభ్రష్టత్వం చెందిన ఈ వూరిలో—"

"తెలుగుదేశం పట్నాలన్నీ అంతే కదా ." అన్నాడు చిన్నల్లుడు.

"అవుననుకోండి అలనాటి శివ ధనుస్సునెత్తడానికి ఈనాటి రాజబాబు ప్రయత్నించినట్లు, ఎదిగీ ఎదగని ఈ వూరు ఏడెనిమిది లక్షల జనాభాను మోయ బూనడంవల్ల—బస్సులు చాలవు; రోడ్లు చాలవు. రోజుకోచోట బస్సువారికి వూరి వారికి ఘర్షణ; వారానికోసారి బస్సువారికీ బస్సువారికీ పోరాటం. నెలకోసారి ఒక బస్సు ప్రమాదం! అందులో కనీసం సగటున ఇద్దరయినా చావడం; సిటీ బస్సులవారి ఈ "జనాభా పెరుగుదల నిరోధక కార్యక్రమం" నచ్చక విద్యార్థులు బస్సుల్ని తగలబెట్టడం. ఈవిధంగా మా నగరం విరాజిల్లుతుంటే. .."

"అలాగయితే బస్సులు జాతీయం చేయకూడదా-" పెద్దల్లుడి ప్రశ్న.

లేటు ఎస్వీ రంగారావులా గంభీరంగా నవ్వాడు రామం. "సిటీ బస్సు రూట్లు జాతీయం అనేది ఓ గొప్ప కామెడీ ..." అంటూ అచ్చువేయడానికి వీలుకాని నిజాలను వివరించాడు.

బావలిద్దరూ "ఆహా! ఏమి ఇతగాడి లోకజ్ఞానము. ఎందుకితడు హస్తమార్కుడయి రాజయిపోకుండెను?" అని ఆశ్చర్య పడ్డారు.

ఇంతచేసీ వాళ్ళు మెయిన్‌రోడ్ కొస్తే రోడ్ చాల విశాలంగా కనిపించింది. కారణమడిగితే సిటీబస్సులు సమ్మెటండీ అన్చెప్పారు. ఎందుకయ్యా అంటే ఆ బస్సుల్లో పనిచేసే డ్రైవర్లు, కండక్టర్లు, క్లీనర్లు—వీళ్ళంతా "తమ కిప్పుడున్న ఓనర్లు మంచివాళ్ళు కారనీ, అంచేత ఓనర్లు మారి వేరే ఓనర్లు—కావాలనీ" సమ్మె మొదలుపెట్టారట.

"ఇదేం విడ్డూరమండీ బస్సెవడి దయితే వాడు ఓనరవుతాడు కాని బస్సూ, అందులో పనిచేసే వాళ్ళు అలాగే వుండి ఓనర్‌ను మానమనడమేమిటి—" అని పెద్దల్లుడడిగితే బస్టాపులో ఒకాయన సమాధానం చెప్పాడు. "దానేముందండి. కన్‌స్టిట్యూషన్ మారిస్తే సరిపోతుంది" అన్నాడు ఆ చేతిలోని సిగరెట్టును ఈ చేతికి మార్చుకుంటూ.

ముగ్గురు వీరులూ కలిసి కాస్త దూరం నడిచి రిక్షాలు మాట్లాడుకున్నారు. మామూలుగా అక్కడినుండి స్టేషనుకు రూపాయి పుచ్చుకునే రిక్షావాడు నాలుగురూపాయ లడిగాడు. వాడిని వద్దని ఇంకొకడిని కేకేస్తే అయిదడిగాడు. దిమ్మ తిరిగి పోయింది ముగ్గురికీ.

"దళితవర్గం తిరగబడిందన్నమాట!" అన్నాడు పెద్దల్లుడు.

"పీడితులు పీడకులుగా మారే సంధియుగం ఇది"—అన్నాడు చిన్నల్లుడు.

"అయ్యో! కైతకాలు మాని రిక్షా లెక్కండి—" అని రెండున్నర రూపా

యిలకో రిక్షా చొప్పున రెండు రిక్షాలు తెచ్చాడు రామం.

ముగ్గురు రిక్షా రథులు రైల్వేస్టేషన్ చేరారు. అక్కడ చైనా జనాభా అంత జనం వున్నారు. కొన్నేసి వూళ్ళకు వెళ్ళేవారికి ఒకటిచొప్పున అనేక కౌంటర్లు ఆవికాక మొదటి తరగతివి కొన్ని. ప్లాట్‌ఫారం టిక్కెట్లకు ఒకటి, ఇలాగ ఎన్నో కౌంటర్లున్నాయి. మామూలు నాటోటి సీటోటిగాడెవడయినా వెళ్ళి వున్న 13 కౌంటర్లలో దేని యెదుట నించోవాలో తెలియక, తికమక పడిపోకుండా, కౌంటర్ల వివరాలుచెప్పే, 'విచారణ' కౌంటరొకటి ఏర్పాటుచేశారు రైల్వేవారు! (మరి వారు "సదా మీ సేవలో" వుంటారు కదా.) 'విచారణ' క్యూలో అరగంట నిల్చున్నాక—

"మీకు రాయపూర్ టిక్కెట్టు కావాలన్నారు కదూ 'తిరుపతి వైపు' అని రాసివున్న ఆరో నెంబరు కౌంటర్‌కు వెళ్లండి" అని ఆ రహస్యాన్ని వివరించాడు క్లర్కు.

ఇంక పడ్డానికి ఒంట్లో ఆశ్చర్యం మిగలని చిన్నల్లుడు ఆరో నెంబర్ క్యూలో అతుక్కుని, తీరా బుకింగ్ విండో దగ్గర కెడితే-అక్కడి గుమస్తా- "ఆ డివిజన్‌లో రైళ్ళరాకపోకలన్నీ అస్తవ్యస్తంగా వున్నాయి. కనుక తీరాచేసి రిజర్వేషన్ చేసుకుని స్టేషన్ కొచ్చాక రైలు రాలేదేమని అడగకండి—" అని తథాగతోది తాతలాగున రైలు వైరాగ్యం బోధిస్తున్నాడు.

"అదెందుకలాగ?"

"అటువెళ్ళే రైళ్ళన్ని మేము నడపాలని ఈ డివిజన్ సిబ్బంది, కాదు కాదు మేము నడపాలని ఆ సిబ్బంది వాదించుకుని ప్రస్తుతానికి అదేదో తేలేదాక ఎవరూ నడపకూడదని ఒప్పందం కుదుర్చుకున్నారు. ఒప్పందంమీద ఇరుపక్షాల వారు సంతకాలు నిన్ననే పెట్టారు ."

ఇది విన్న ఒక సర్పంచ్‌గారు . "అదేటండీ రైలుబళ్ళు నడపాలనీ ఆళ్ళూ ఈళ్లూ ఓదించుకుంటున్నారు గదా చెరో అయిదుబళ్ళు ఇచ్చేస్తే పోలా—"

నీరసంగా నవ్వారు జనం. అందులో ఒక ముసలాయన—"మా చిన్నప్పుడు ఆరున్నరకు మెయిలంటే ఆరున్నర మెయిలే! ఇప్పుడంతా మారిపోయింది. ఆరోతారీకు రావాల్సిన మెయిలు ఎనిమిదో తారీకున వస్తే ఏడుకొండలవాడికి జుత్తు ఇస్తామని మొక్కుకుంటున్నారు" అని వాపోయాడు.

రాయపూర్ వెళ్ళాల్సిన చిన్నల్లుడి పరిస్థితి ఇలాగయితే, బెంగళూరు వెళ్ళాల్సిన పెద్దల్లుడికి ఇంకో సమస్య ఎదురయింది. అటువైపు మీటర్‌గేజిని బ్రాడ్‌గేజ్ చేయాలని పట్టుపట్టిన ప్రతిపక్షం వాళ్లు రైలుపట్టాలమీద పడుకుంటున్నారట. అందుకని ఈవిధంగా నిరసన తెలిపే జనం పడుకోవడానికి వేరుగా ఒక రైలుమార్గం కావాలంటూ అఖిల పక్ష కార్యాచరణ సంఘం అలజడి చేస్తూందట. అంచేత అదేదో తేలేదాక అటువైపుకు రైళ్లు లేవుట.

ముగ్గురూ ఒకరిమొహం ఒకరు చూచుకున్నారు. నవ్వునామని ప్రయత్నించారు. నవ్వారు. రైల్వేస్టేషన్ బయటికొచ్చారు. ఆ గంటలో బయటస్థితిలో 'విప్లవాత్మక

మైన' మార్పు వచ్చింది. పక్క పక్క థియేటర్లలో ఇద్దరు కథానాయకుల చిత్రాలు విడుదలయిన సందర్భంగా రెండు అభిమాన సంఘాలవాళ్ళు కొట్టుకున్నందున ముగ్గురు చనిపోయారట! అరవై ఏడుమంది గాయపడ్డారుట. అంచేత "నగరంలో 144 వ సెక్షన్ విధించబడింది" అంటూ పోలీసువాన్ హెచ్చరిస్తూ తిరుగుతూ వుంది.

సాయంత్రంఏడుంబావయింది; వార్తలు వింటే బాగుండునని రామం ఆ ప్రక్కనే చేతిలో మీడియం వేవ్‌బాండ్ ట్రాన్సిస్టర్ సెట్ వున్న యువకుడిని సమీపించాడు. అడిగాడు. అందుకా యువకుడు- "మేష్టారూ! విద్యుత్‌శాఖా సిబ్బంది వారివాళ "కోర్కెలదినం" పాటిస్తున్నారట. అంచేత విద్యుత్ సరఫరా ఆగిపోగా మన ఆకాశవాణి ట్రాన్స్‌మిషన్‌కు అంతరాయం వచ్చింది! కావాలంటే 'స్పేస్' నుండి వచ్చే సిగ్నల్స్ వినవచ్చు—" అని నవ్వాడు.

లాగి లెంపకాయ కొట్టాలనిపించింది రామానికి. కాని ఎవరినికొట్టాలో మాత్రం తెలియలేదు.

ఈసారి రిక్షాలు కూడా లేకపోవడంతో ముగ్గురూ నడిచి ఇల్లు చేరారు.

"అన్నయ్యా! రేపటినుంచి కాలేజి లేదు" అని సంతోషంగా ప్రకటించాడు లక్ష్మణ్.

"మా ప్రిన్సిపాల్‌గారు ధోవతి మానేసి బెల్‌బాటమ్స్ వేసుకోమంటే వేసుకోవడం లేదు. అందుకు నిరసనగా ఈవూరి కాలేజి విద్యార్థి సంఘాల వాళ్లంతా సమ్మె చేస్తున్నారు-" అని వివరించాడు.

"అయితే మాకూ బడి వుండదు-" అంది లలిత గెంతుతూ.

"ఎందుకే?" అని అడిగింది దుర్గాంబ.

"మరి మేముకూడా స్టూడెంట్సేకదా, అన్నయ్యవాళ్ళను సపోర్టు చెయ్యొద్దా?" అంది ఆ అయిదోతరగతి విద్యార్థిని.

"మా ఇందిరమ్మే! మాముద్దుగుమ్మే!" అని దాన్నెత్తి ముద్దు పెట్టుకున్నాడు రాజు

తొమ్మిది గంటల వార్తను విన్న చిన్నల్లుడు గబగబ అటొచ్చాడు "ఓయ్ రామం! మా ఉక్కుమిల్లు వాళ్లు మిల్లు లోపల ఏర్‌కండిషనింగ్ కావాలని సమ్మె నోటీసిచ్చారుట ప్రభుత్వంవారేమో మా నాయకుల్ని సంప్రతింపులకు పిలిచారుట" అంటూ.

ఆ గదిలో చాలాసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

పెద్ద నిట్టూర్పు విడిచి, పలికారు విశ్వేశ్వర్రావు. "ఒరేయ్! అందరూ కలిసి మనం కూచున్న కొమ్మను నరుక్కుంటున్నామేమిట్రా? బాతునే చంపేస్తే బంగారుగుడ్లు ఎలా వస్తాయిరా? ఏ గుంపుకాగుంపు తమ జీతాలు, తమ బోనసులు, తమ హక్కులు అని పోట్లాడితే ఈ దేశం ఏమవుతోందిరా?"

నాన్న బాగా పెద్దవారయిపోయారు అనుకున్నారు కొడుకులిద్దరు.

ఆయన అడిగిన ప్రశ్నలు సబబయినవే; కాని వాటిని వీధిలో అడిగితే మాత్రం నాయకులందరూ కలిసి పీకనొక్కెయగలరు-అనుకున్నారు వాళ్ళిద్దరు.

ఆ మార్గం చివర వున్నది అధోగతి అని అందరికీ తెలుసు; కాని ఆ మార్గానే వెళ్తున్నాం అందరమూ కలిసి.

ఇదొక సరికొత్త గ్రీకుట్రాజెడీ!

కాకపోతే జరుగుతోందిఇండియాలో!!



# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | 5 | | 6 |
| | ■ | 7 | | | | | ■ | |
| 8 | 9 | ■ | | ■ | | ■ | 10 | |
| 11 | | | ■ | 12 | ■ | 13 | | |
| ■ | | ■ | 14 | | | ■ | | ■ |
| 15 | | | ■ | | ■ | 16 | | 17 |
| 18 | | ■ | 19 | ■ | 20 | ■ | 21 | |
| | ■ | 22 | | | | 23 | ■ | |
| 24 | | | | ■ | 25 | | | |

ఆధారాలు

జనవరి '79

నిలువు

1. నమస్కారం।
2. జలాశయం
3. వాడు చెప్పేది నమ్మకు.
4. వృక్ష విశేషం
5. తలకొట్టి తలకిందులుచేసి దీవిస్తా
6. రెమ్మలు
9. శూద్రకుని సృష్టి
10. తేనెటీగ
12. శృంఖలాలు
15. ఛత్రాజుల ప్రత్యేకత
17. తరంగిణి కలగలవు
19. స్నిగ్ధత
20. శిరోభాగం
22. ఒక్కొక్కరికి
23. నడుం జారిన ముగ్గురు।

అడ్డం

1. సేద్యానికి నాంది
4. అష్టావధానికి పరీక్ష
7. వాద్యం (కృష్ణ కర్ణామృతానికి)
8. వంశానుక్రమం
10. ఒక దిక్కులో సగం
11. 12 నిలువు కలగలుపు
13. శత్రువులు రోదించితే నియమాలు
14. పూలచెట్టు
15. అలంకరణ
16. ఇదో విద్య
18. వర్షం వత్సరం కాదు
21. శరీరభాగం
22. కవచము
24. మాజీ మంత్రిగారి ఇంటిపేరు
25. ఇదిప్పుడు కాదు.

## డిసెంబర్ పదబంధ ప్రహేళికకు సమాధానం·

అడ్డం: 1 ఇదికాదు, 4 యాగరక్ష, 7 పుష్కలావర్తం, 8 తిమి, 10 మేము, 11 గణుతి, 13 గాలులు, 14 పెక్కుంద్రు, 15 మేరువు, 16 వలున, 18 నల్ల, 21 పుల్ల, 22 హస్తినాపురి, 24 వచ్చితిరి, 25 నత్తగుల్ల.

నిలువు: 1 ఇకతిగ, 2 కాపు, 3 దుష్కర్మ, 4 యావత్తు, 5 గర్తం, 6 క్షత్రియులు, 9 మిణుగురులు, 10 మేలుగొలుపు, 12 ముక్కంటి, 15 మేనబావ, 17 నల్లపిల్ల, 19 వస్తిరి, 20 దాపున, 22 హతి, 23 రిత్త.

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి డిశంబరు 27 వ తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళుగీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారిపూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీలు వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

### డిశంబర్ ప్రహేళిక విజేతలు

1. టి. సుధాదేవి, హైద్రాబాద్. 2. కె.జె.ఎమ్. కృష్ణారావు, ఏలూరు. 3. కె. రాజశేఖర్, హైద్రాబాద్. 4. పి. వెంకటరత్నం, గుంటూరు. 5. టి. ఉమాదేవి, హైద్రాబాద్.

---

ఈ నెల శ్రీశ్రీ ప్రహేళికలో ఒకే క్లూకు రెండు, మూడు సమాధానాలు వచ్చే అవకాశాలున్నాయి. అటువంటి క్లూలు (నేను గమనించినవి).

24 అడ్డం: 19 నిలువుకు గ్రాంధికరూపం: దీనికి వచ్చితిమి, వచ్చితిరి, వచ్చితివి మొదలైన సమాధానాలన్నీ సరిపోతాయి. 19 నిలువుకు దీని ననుసరించి వస్తిమి, వస్తిరి, వస్తివి మొ॥ సమాధానాలు రావచ్చు. అదేవిధంగా: 'దగ్గర చుట్టం' క్లూకు మేనమావ, మేనబావ సరిపోతాయి. ఏది రాసినా కరక్టే.

సీల్డ్ సొల్యూషన్‌తో సరిపోయిన వాటినే మీరు ఆమోదిస్తే ఈ ఉన్నతమైన సాహిత్య ప్రక్రియ లాటరీ స్థాయికి దిగిందని పాఠకులు, పోటీదార్లు నిరాశ చెందవచ్చు.

(ఈ విమర్శకు మా సమాధానం తొలిమాటలో—ఎడిటర్)

—ఎవిజికుమార్

# వైద్యాసుర ఆపద్విభాగ యోగం

‘ఎప్పుడో చేసుకుని ఉంటావు పాపం
అందుకే అనుభవిస్తున్నావు రోగం
అంటే ఆ జన్మనుంచీ పడాలి ఔషధం
ఆదొక్కటే నీ బాధ తగ్గించే సాధనం
రాయవెల్లూర్లో లేదు పాపానికి వైద్యం
శరణిగంతో వెళ్ళు శబరిమలై తీర్థం
ఆపరేషనువల్ల ఆత్మకేం లాభం?
ఆపకుండా చెయ్యి రుద్రాభిషేకం’
ఇంత చక్కగా వుంటే జనంలో చైతన్యం
నాటువైద్యం చెయ్యదా నగరంలో నాట్యం!



భోగ భాగ్య నగరి చూడు బోలెడంత పులుముడు
కోరీ పక్కసందుకి నడు గొప్పగోల వినపడు
మైలు పొడవు క్యూ తరగదు, ఏమిటంత జరుగుడు?
బాణావతి చేతబడికి అచట దొరుకు విరుగుడు!



మన తెనాలి చని కనాలి కపట వైద్య గ్లామరు
వైద్య విద్య ఓనమాలు రావుగాని, డాక్టరు!
సెక్సు సైన్సు స్పెషలిస్టని స్వయం ఉపాధి పథకము
లేని జబ్బు ఖాయము, ఉన్న డబ్బు మాయము!



నిషా విశా పట్నంలో లేని వింత ఏదనీ!
కింగు జార్జి ఆసుపత్రి సాగరాన దూకనీ
మెయిను రోడ్డు నడినెత్తినె భూతవైద్య కార్ఖానా
నూలుపోగు తావేజుకి ఖండాంతర ఘరానా!



ఎంతగా జరగనీ వైద్యశాస్త్ర ప్రగతి, ఇదే మన బాణీ!
అక్కడ కళ్ళు తెరుస్తూంటే రోజుకో టెస్ట్ ట్యూబ్ బేబీ,
ఇక్కడ పోటీపడి చూసుకుంటున్నాం, వారఫలం పేజీ!
నా లాటి వాడు ఎత్తి చూపిస్తే రాదా మరి పేచీ?

సీరియల్




## 4

ఆ యింటి అలంకరణ చాలా అట్టహాసంగా వుంది! ఆ యిల్లు కట్టినతీరు, అందులో అమర్చిన సామాను చూస్తే, ఆ యింటి యజమానికి, డాబు, దర్జా ఎక్కువ అని తెలుస్తోంది!

లోపలికి వెళ్ళగానే, కనిపించే, విశాలమైన ఆ హాలునిండా, బిలబిలలాడుతూ ఆడపిల్లలు గుమిగూడి వున్నారు! వారిమధ్య విమల, చుక్కలమధ్య చంద్రుడిలా, వెలిగిపోతోంది! విమలని చూస్తే, ఎరువుపోసి పెంచిన గులాబీపువ్వు గుర్తుకు వస్తుంది! వస్తుతఃవున్న అందానికి, అలంకరణలు మరింత వన్నె తెచ్చినాయి! వేసుకున్న బట్టలు పెట్టుకున్న నగలు అపురూపత్వాన్ని ఆపాదించినాయి! పుట్టినరోజు కానుకగా తండ్రి యిచ్చిన నెక్లెస్, చెవుల జూకాలు, మెరిసిపోతున్నాయి!

విమల ఎదురుగా వున్న కేక్‌మీద వెలిగించిన దీపాలు వరసగా వూదింది! అందరూ చప్పట్లుకొట్టి హాపీ బర్త్‌డే టూ యూ పాడారు!

"ఏమిటో! శుభమా అని పుట్టినరోజు జరుపుకుంటూ యీ దీపాలు ఆర్పడం ఏమిటో! హాయిగా లక్షణంగా, నలుగురి ముత్తయిదుల్ని పిలిచి, పళ్లు, తాంబూలాలు యివ్వకుండా!" విమల తల్లి అనంతలక్ష్మి సణిగింది.

"నీకు తెలియదు వదినా! యిప్పటికాలం యింతే! అవన్నీ పాత పద్ధతులు" అంది అహల్యమ్మగారు.

"ఏం పాతపద్ధతులో ఏమిటో! ఇప్పటికీ మీ అన్నయ్య కొరివి కారం, గోంగూరపచ్చడి లేందే ముద్ద ఎత్తరు మరి."

"అది ఎవరికీ కనిపించదుగా! ఇది నలుగురికీ తెలిసేదయ్యె!"

"నాకు తెలియక అడుగుతాను. నలుగురికోసం ఒకరకంగా. మనకోసం యింకోరకంగా వుండాలంటావా?" అంది అనంతలక్ష్మి.

"ఏ యెండకి ఆ గొడుగు అనుకో!" అంది అహల్యమ్మగారు.

ఈ యిల్లు పదేళ్ళక్రితం చాలా పాతపద్ధతులతో, చాదస్తపు అలవాట్లతో వుండేది! అహల్యమ్మగారి అన్నయ్యగారయిన ధనుంజయరావుగారు, వ్యాపారంలో డబ్బు గడించినకొద్దీ యింట్లో వేగంగా కొత్తపద్ధతులు రాసాగినాయి! వాటిల్లో విమల పుట్టినరోజు వేడుక ఒకటి! ఇదివరకు అనంతలక్ష్మి ఇరుగు, పొరుగూని పిలిచి, పళ్ళు, తాంబూలాలు యిచ్చి, అక్షింతలు యిచ్చి, కూతురుకి ఆశీర్వచనాలు అందజేయమనేది!

కూతురు పెద్దయినకొద్దీ, కాన్వెంట్‌లో చదువు మొదలయినప్పట్నించీ ఆ పద్ధతి పోయింది.

విమల కేక్ ముక్కలుకోసి, తీసుకువచ్చింది మొదట తల్లికివ్వబోయింది. ఆవిడ ముఖం అసహ్యంగా పెట్టి, 'నాకువద్దు' అనటంతో, 'నువ్వుతీసుకో అత్తయ్యా' అంటూ మేనత్తకి యిచ్చింది.

ఇంతలో వాకిట్లో కారు ఆగింది! ఆ డోర్ వేసిన చప్పుడు వినగానే విమల ముఖం మతాబులా వెలిగింది. "అడుగో బావ వచ్చాడు" అంటూ గుమ్మం వైపు పరుగెత్తింది.

అప్పటికే కారు దిగి సుధీర్ లోపలికి వస్తున్నాడు! అతని వెనకే, డ్రైవర్, రెండు చేతులతో, పెద్ద ప్రెజెంటేషన్ పాకెట్ తీసుకువస్తున్నాడు! చాలా పెద్దగావున్న ఆ పాకెట్ చూడగానే, విమల ముఖం చాటంత అయింది.

"ఓహోహో! బావగారా! రండి. రండి. దయచేయండి! ఇప్పటికి తీరుబడి అయిందన్నమాట! తమరు వస్తున్నారని తెలిస్తే, హారతిపళ్ళెంతో ఎదురువచ్చేదాన్నే! బాకాలు వూదేవారిని పిలిచేదాన్నే!" ఆడంబరంగా అంది.

సుధీర్ చిరునవ్వు నవ్వాడు. "తమరు అలిసిపోతారని అంతపని చేయలేదు లెండి" అన్నాడు. విమలని చూసినప్పుడల్లా, అతని మనసులో తెలియని జంతి

జరిగిన కథ :

తనని బలవంతం చేసిన పొరుగింటి మోహన్‌ను ఆత్మరక్షణార్థం చేతికందిన వస్తువుతో కొట్టింది స్వప్న. మోహన్ మరణించాడు. స్వప్నపై హత్యానేరం మోపబడింది. ఆ షాక్‌తో స్వప్న తల్లి చనిపోయింది. స్వప్న మేనమామ లక్ష్మీరంజనం స్వప్నను కాపాడమని తన శిష్యుడు సుధీర్‌ను కోరాడు. సుధీర్ తన ప్రతిభతో స్వప్నకు శిక్షపడకుండా చేశాడు. స్వప్నగురించి ఆలోచనలలో ఉండగానే మరదలు విమల బర్త్‌డే పార్టీకి పిలిచింది సుధీర్‌ను.

చురుక్కుమంటూ వుంటుంది! ఈ అమ్మాయి నాకు కాబోయే భార్య సుమా అనే భావం ఆనందంగా కాకుండా, అదేదో హెచ్చరికలా, గంటకొట్టినట్లుగా విన్పిస్తుంది! విమల మాట్లాడే ప్రతి మాటలో అతనిమీద అధికారం, ప్రతిధ్వనిస్తూ వుంటుంది.

"ఏరా! భోజనానికి రమ్మంటే, నీకు యిప్పటికి తీరుబడి అయిందన్నమాట! నువ్వు వస్తావని ఎంతసేపు ఎదురుచూసామో తెలుసా?" అన్నారు ధనుంజయరావుగారు.

"ఎదురుచూసి, చూసి, నా ఆకలంతా చచ్చిపోయింది" అంది విమల.

"మీ తండ్రీ కూతుళ్ళిద్దరూ, అతన్ని లోపలికి రానిస్తారా లేదా?" అంది అనంతలక్ష్మమ్మగారు.

డ్రైవరు బహుమతి పాకెట్ తీసుకువెళ్ళి టేబిల్‌మీద పెట్టాడు! పిల్లలందరూ దానిచుట్టూ గుమిగూడారు!

"ఏమై వుంటుంది?" అంది ఒక అమ్మాయి.

"ఏదో పెద్ద బహుమతి తెచ్చాడు" అంది యింకో అమ్మాయి.

"కేక్ అనుకుంటా" ఒక అమ్మాయి వూహాగానంచేసింది.

"కేక్ అయితే అలా వుండదుగా పాకెట్!" యింకో అమ్మాయి అంది.

"కాబోయే భార్యగా! ఏదో అపరూపమైనదే తెచ్చివుంటాడు!"

విమల పాకెట్ పట్టుకుని ఎత్తిచూసి, మళ్ళీ టేబిల్‌మీద పెట్టింది.

"బావా! ఏమిటో చెప్పవూ?" అంది.

"విప్పి చూడబోతున్నావుగా! యింకా అడగడందేనికి?"

"చెబితే ఏమౌతుంది!" గారంగా అంది.

"సస్పెన్స్ పోతుంది!" చిలిపిగా అన్నాడు.

"వీడికి బహుమతి తేవాలని గుర్తుండటం చాలా ఆశ్చర్యమే" అంది అహల్యమ్మగారు.

సుధీర్ తెచ్చిన బహుమతి చూడటానికి టేబుల్ చుట్టూ అందరూ కుతూహలంగా గుమికూడారు.

విమల యెంతో కష్టంమీద విప్పింది. పొరలు విడివడుతున్నాయేకాని బహుమతి కన్పించటంలేదు.

''పాకెట్ చూస్తే పెద్దది. వస్తువుచూస్తే చిన్నది'' ఒకమ్మాయి అనేసింది.

విమల విప్పి, విప్పి ఆఖరునవున్న చిన్న పొట్లాం తీసింది. అందులో, టూత్ పేస్ట్‌లోవచ్చే ఖడ్గమృగం చిన్నబొమ్మవుంది. దాన్నిచూడగానే అందరూ విరగబడి గొల్లున నవ్వారు! ఆ నవ్వులు వినగానే, విమల ముఖం వెలవెలా పోయింది.

''నువ్వు—పుట్టినరోజున నాడు, యింత ఆశపెట్టి మోసం చేస్తావా?'' అంటూ సుధీర్ మీదపడి రెండు చేతులతో కొట్టబోయింది. సుధీర్‌కూడా నవ్వుతూ, ఎలాగో విమల చేతులుపట్టి ఆపి, జేబులోనుంచి వుంగరంతీసి విమల అరచేతిలోపెట్టాడు.

విమల చూసింది! అది డైమండ్ రింగ్! అందరూ విమల చేతుల్లోంచి దాన్ని తీసుకుని, 'ఏది ఏది!' అంటూ ఒకళ్ళ చేతుల్లోంచి ఒకరు లాక్కుని చూసారు.

''యీ సర్‌ప్రైజ్ చాలా బాగుంది!'' అన్నారు ధనుంజయరావుగారు.

''నిజంగా నాకేం తీసుకురాలేదనుకున్నాను సుమా!'' అంది విమల.

అహల్యమ్మగారు ముసిముసి నవ్వులు నవ్వింది.

''వుంగరం వేలికి పెట్టమను!'' అంది ఒక అమ్మాయి.

''పెట్టు.'' విమల అందించింది.

ఇంతలో ఫోన్ గణగణా మోగింది. ధనుంజయరావుగారు వెళ్ళి ఏసి 'హలో' అన్నారు.

''ఊ! పెట్టు. ఏమిటి నీ ఆలోచన?'' తటపటాయిస్తున్న సుధీర్‌ని చూసి దబాయిస్తూ అంది విమల.

''నువ్వు పెట్టుకో!''

''ఉహూ! నేను పెట్టుకోను!''

''పెట్టుకోకపోతే మానెయ్యి!''

''సరే! అయితే పారేస్తాను!''

''పారేసుకో! బహుమతి యివ్వడంతో నా పని అయిపోయింది! అది వుంచుకోవటమో, పారేసుకోవటమో, అది నీ యిష్టం!''

''చూడు ఆంటీ!'' విమల ఫిర్యాదుగా చూసింది.

''అబ్బా! అది అడిగినట్టుగా యివ్వరాదుట్రా! ఎందుకలా ఏడిపిస్తావు?'' అంది అహల్యమ్మగారు. అవతల ధనుంజయరావు, ఫోన్‌లో ''హలో-ఎవరు?''అంటున్నారు.

సుధీర్ వుంగరం పట్టుకుని, విమలకి చూపిస్తూ, "ఇదుగో! ఇది నువ్వు అడిగితేనే, నేను వేలికి పెడ్తున్నాను!" అన్నాడు.

"సరే! గుర్తుంచుకుంటాలే!" అంది విమల.

సుధీర్ విమల చేతికి వుంగరం పెట్టబోతున్నాడు.

ఇంతలో, ధనుంజయరావుగారు, కేకపెట్టి పిలుస్తూ, "సుధీర్! నీకు ఫోన్ వచ్చింది! ఎవరో లక్ష్మీరంజనంగారుట! చాలా అర్జెంట్‌ట!" అన్నారు.

"మాస్టరుగారా!" విమల చేయి పట్టుకుని వుంగరం పెట్టబోతున్న అతను ఆగాడు. "వన్‌మినిట్! ఇప్పుడే వస్తాను," వుంగరం, విమలచేతిలో పెట్టి ఫోన్‌వైపు వచ్చాడు.

అక్కడున్న అందరూ, అతను ఫోన్ తీసుకుని మాట్లాడటం వింటునే వున్నారు.

"హలో! మాస్టరుగారా! అవును. నేనే సుధీర్‌ని మాట్లాడుతున్నాను. ఏమిటి?"

అవతలనుంచి అతనికి ఏం వినిపించిందో ఏమోగానీ, "మైగాడ్! నిజంగానా!" అంటూ నిర్ఘాంతపోయాడు.

"మీరు యిప్పుడెక్కడున్నారు?" అని అడిగాడు.

"మీరేం ఖంగారు పడకండి. నే నిప్పుడే వస్తాను? నేను డాక్టర్‌ని తీసుకు వస్తున్నాను."

"నేను వస్తున్నానుగా. సరిగ్గా పదినిముషాల్లో అక్కడ వుంటాను. మీరు అక్కడే వుండండి." అని ఫోన్ పెట్టేసాడు.

అంతవరకూ, నవ్వులతో, మాటలతో, గలగలలాడుతున్న ఆ హాలంత ఒక్కసారి నిశబ్దంగా అయిపోయింది. అందరూ ఆదుర్దాగా చూస్తున్నారు.

"ఏమిట్రా ఏమయింది?" అంది అహల్యమ్మగారు.

"అమ్మా! మాస్టరుగారు ఫోన్ చేసారు. ఆయన మేనకోడలు స్వప్నలేదూ! నిద్రమాత్రలు మింగేసిందిట. ఆయన ఖంగారుపడిపోతున్నాడు. నేనిప్పుడే వస్తానమ్మా! హాస్పిటల్‌లో చేర్పించటానికి టైమ్ వుందో లేదో. ఎప్పుడు మింగిందో ఏమిటో." అంటూనే అతను, అక్కడ సందడి సర్వం మర్చిపోయినవాడిలా, కనీసం, విమలతో గాని, ధనుంజయరావుగారితోగాని, వెళ్తున్నానని కూడా అనకుండా చకచకా వెళ్ళిపోయాడు.

నిశ్చేష్టురాలిలా నిలబడిన విమల తిరిగి తేరుకుని అతనివెనకే వెళ్ళింది. కానీ. విమల గుమ్మం దగ్గరికి వెళ్ళేసరికే, అతను ఎక్కిన కారు కదిలి వెళ్ళిపోయింది.

విమల లోపలికి తిరిగి వచ్చింది. ఆ ముఖంలో వుత్సాహం వూదేసినట్టయింది. సరాసరి మేనత్త దగ్గరకి వచ్చి అడిగింది.

"స్వప్న ఎవరు అత్తయ్యా!"

"స్వప్న—అంటే-" అహల్యమ్మగారు క్లుప్తంగా, స్వప్న గురించి అంతా చెప్పింది.

కొద్దిసేపయింది. విమల స్నేహితురాళ్ళంతా వెళ్ళిపోయారు. విమల బట్టలు మార్చుకుని గదిలో కూర్చుంది. మాటి మాటికీ టేబిల్‌దగ్గరకి వెళ్ళి, ఎఱ్ఱటి కాగితంలో మిలమిలా మెరుస్తున్న ఆ వజ్రపుటుంగరాన్ని చూస్తోంది. "ఒక్క నిముషం వుంటే బావ నా చేతికి పెట్టేవాడు. ఆ క్షణం ఎంత బాగుండేది." అనుకుంది విమల. చేతిని చూసుకుంది. ఉంగరం తీసి పెట్టుకోబోయింది. అంతలోనే ఆగి మళ్ళీ కాగితంలో పెట్టేసింది. దాన్ని తీసుకెళ్ళి భద్రంగా, బీరువాలో పెట్టి దాచింది.

బావకి గుర్తుంటుందా!

కనీసం ఫోన్ అయినా చేస్తాడా!

విమల మేలుకుని వేచి చూడసాగింది.

* * *

సుధీర్‌కి ఆ యిల్లు వెతికి పట్టుకోవటమే చాలా కష్టం అయింది. ఒక్కొక్క నిముషం ఆలస్యం అవుతుంటే, అతనికి ఆందోళనగా అనిపించసాగింది. చివరికి ఎలాగయితేనేం సందుల్లో నున్న ఆ యిల్లు పట్టుకోగలిగాడు.

లక్ష్మీరంజనంగారు వాకిట్లోనే ఎదురుచూస్తున్నారు. అతన్ని చూడగానే ఎదురు




వచ్చారు! సుధీర్‌ని చూడగానే ఆయన వుత్తరీయంలో ముఖం దాచుకుని బావురు మన్నారు.

“ఎక్కడుంది స్వప్న?” సుధీర్ అడిగాడు.

ఆయన లోపల గదిలో వున్న మంచంవైపు, వేలుపెట్టి చూపించారు!

సుధీర్ లోపలకి వచ్చాడు. స్వప్న మంచంమీద పడుకునివుంది! రెండుచేతుల్లో తల్లీ, తండ్రి, తను తీసుకున్న ఫోటో వుంది.

ప్రశాంతంగా, నిద్రపోతున్నట్టుగా వుంది! సుధీర్ నుదుటమీద చేయి వేసి చూసాడు. నుదురు చల్లగా, మృత్యువు స్పర్శలా వుంది! చేయి కదిపి చూసాడు! అది ఎటుకదిపితే, అటు, అచేతనంగా నిర్జీవంగా వుండిపోయింది.

“యింత అఘాయిత్యం చేస్తుందని అనుకోలేదు బాబూ!” ఆయన ఒకటే ఏడుస్తున్నాడు.

సుధీర్‌కి ఆయనని అనునయించాలని కూడా అనిపించలేదు! అతను ఒక్క సెకనుకూడా వృధా మాటలతో, వేస్ట్ చేయటానికి యిష్టపడనివాడిలా, ''యిలా పట్టండి మాస్టారూ.'' అంటూ స్వప్నని భుజాలు పట్టి లేవదీసాడు. లక్ష్మీరంజనంగారు స్వప్నకి సాయం పట్టారు. ఇద్దరూ తీసుకువచ్చి కారులో పడుకోపెట్టారు. “మీరు చప్పున ఆ లుపు వేసి రండి” కారు అద్దాలు దించుతూ అన్నాడు! ఆయన పరుగెత్తి తలుపులు మూసి వచ్చాడు.

ఆయన స్వప్నని పట్టుకుని వెనక కూర్చున్నాడు. సుధీర్ డ్రైవ్ చేయసాగాడు. అతని నుదుటన చిరుచెమటలు అలుముకున్నాయి! తను తీసుకువెళ్తున్న స్వప్న తిరిగి యింటికి మళ్ళీ వస్తుందా! లేక యిదే ఆఖరి ప్రయాణమా! అతనికి అర్థంకాలేదు.

(సశేషం)

# రాబందుల రెక్కల చప్పుడు

## యం. రత్నమాల

"నువ్వార్జించ చాతకాని వాడివి.

పెళ్లాన్ని కనీసం పోషించలేని అసమర్థుడివి.

కనీసం యింత విషం యిచ్చి అయినా చంపెయ్యటం చాతకాని మగాడివి. మొగుడివి. ఛీ"

ఈ మాటలేవీ జానకి పైకి అనలేదు.

బొత్తిగా రెండురోజుల నుంచీ ఏమీలేక పేగులు చుట్టుకుపోతూంటే, ఆ రోజు కూడా మొండిచేతులతో వచ్చిన మొగుడ్ని అలా అనాలని మాత్రం అనుకుంది.

అలా అనినా అది ఆమె తప్పేం కాదు.

ఎందుకంటే, సుమారు

సంవత్సరం నుండి దరిద్రంతో కటకటలాడటం ఆమెకు అలవాటయింది.

రమణ ఒకప్పుడు బాగా బ్రతికి చితికిపోయిన వాడేమీ కాదు. అతని బ్రతుకెప్పుడూ చిల్లుల విస్తరే.

ఎలాగో జానకితో ముడిపడింది.

జానకి, మొగుడి మంచితనం, ముఖ్యంగా అతని మెత్తని కళ్లు చూసి మొదట్లో మహ ముచ్చట పడిపోయింది.

అపర శ్రీరామచంద్రుడే అనుకుంది. అప్పట్లో రమణ కళ్ళు గుళ్ళో దేవుడి మెరుగు పెట్టని వెండికళ్ళలా, కాంతిహీనంగా వెలుగుతుండేవి.

అవి, ధూప, దీప, నైవేద్యాలు సక్రమంగా సాగుతున్న డబ్బున్న గొప్పదేవుడి బంగారు కళ్ళలా ఎన్నడూ మెరవలేదు.

అందుకు జానకి ఆశపడలేదు కూడా.

పైగా, అవి అతనిలోని పవిత్రత తాలుకు చిహ్నాలనుకుని మురిసిపోయింది.

కానీ,

ఇప్పుడవి, ఎవరో దొంగాడు కక్కుర్తిపడి వెండికళ్ళు పీకేస్తే, మిగిలిపోయిన రాతిలో గోతుల్లా వున్నాయి. అతను రికహస్తాలతో ఒక్కక్షణం మొండిగా, మరీ మొండి జగన్నాదుడిలా కనబడ్డాడు.

లోపలకి వెళ్లి గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. అతను నీరసంగా మంచంమీద వాలాడు.

మొదలు నరికిన వృక్షంలా కాకుండా, గాలికి వాలిపోయిన సర్వే మొక్కలా.

కనీసం కాఫీకూడా లేదు!

నోట్లో నీళ్ళూరాయి.

కాఫీ కప్పులో,

నీళ్లుపోసి, కాళ్ళు చాపుకుని, నెమ్మదిగా వూదుకుంటూ తాగినంతలో—

# అ ల జ డి

మల్లాది వెంకటకృష్ణమూర్తి

గబగబా ఆఫీస్‌కి వెళ్ళాలనే తొందరలో నడుస్తూంటే అరి పాదాలకి గట్టిగా ఏదో గుచ్చుకుంటోంది జానకిరాంకి.

ఆగి, రెండు బూటులేసులు వదులుచేసి రోడ్డుకి ప్రక్కనే బూట్లనువిప్పాడు.

లోపల ఇసకవుంది.

బూట్లలోని ఇసకను పారబోసి, సాక్స్ కూడా విప్పాడు. వాటిలో చేరుకొన్న ఇసకను దులిపి మళ్ళీ బూట్లని తొడుక్కున్నాడు.

దాదాపు గుప్పెడు ఇసకదాకావుంది రెండు బూట్లలో కలిపి. ఆఫీస్‌కి టైమయిందన్న హడావిడిలో అడుగులు వేగంగా వేశాడు.

సాయంత్రం ఇంటికి వచ్చేసరికి విలాసిని ఒక్కతేవుంది.

"మీ అక్క, బావ లేరా?" అడిగాడు కుర్చీలో కూర్చుంటూ.

"బట్టలు విప్పకండి. వాళ్ళు పాటకచేరీకి వెళ్ళారు. డాక్టర్ దగ్గరకు వెళ్ళాలి. ఇవాళేగా ఆవిడ రమ్మని చెప్పింది."

"ఎలావుంది ఒంట్లో?"

భార్యను ప్రేమగా దగ్గరకు తీసుకొంటూ అడిగాడు జానకిరాం.

"బాగానేవుంది."

"ఇంకో అయిదున్నర నెలల్లో బాబునిస్తావన్నమాట." నవ్వుతూ అడిగాడు, భార్య జుట్టుని కుడిచేత్తో మృదువుగా రాస్తూ.

"పాప, బాబుకాదు."

"అదేం?"

"ఆడపిల్లలే బాగుంటారు. మా అక్కయ్యని చూశారుగా. అలాంటి అమ్మాయిని కంటాను"

"నాకు బాబు కావాలనిపిస్తోంది. మొదటి సంవత్సరం కొడుకయితే నేను వుద్యోగంలోంచి రిటయిరయే సమయానికి ఎదిగివచ్చి "

"అబ్బో! చాలావుందే ఆశమీకు" నవ్వింది విలాసిని.

వంటగదిలోకి వెళ్ళి అయిదు నిమిషాలలో కాఫీ కప్పుతో వచ్చింది.

ఇంటికి తాళంవేసి ఇద్దరూ డాక్టర్ దగ్గరకు బయలుదేరారు.

విలాసిని రెండు నిమిషాలు మౌనంగావుండి తర్వాత భర్తతో చెప్పింది.

"మీకు తెలుసుగా. నా చిన్నప్పుడే నాన్న గారు పోయారు. మా అమ్మ వుండీలేనట్లే. ఆ గదిదాటి బయటకురాదు ఎప్పుడోకాని. ఏం పట్టించుకోదు. తనలోకంలో తనుంటుంది. నా కావిడనిచూస్తే ఒకోసారి అనిపిస్తుంది, చూసే వాళ్లు, చేసేవాళ్లువుంటే పిచ్చివాళ్లుగా మారటం వుత్తమం అని. చీకూ చింతా లేకుండా జరిగి పోతుంది జీవితం "

"ఏమిటా మాటలు నేనుండగా?" జానకిరాం భార్యచేతిని మృదువుగా నొక్కి నవ్వుతూ అన్నాడు చిరుకోపంగా.

"మీరు చూడరానన్ను ఒకవేళ అలా "

"ష్, ఏమిటా వెధవ ఆలోచనలు?"

రిక్షా మాటాడాడు జానకిరాం డిస్పెన్సరీకి.

"మీ అక్కయ్య అంటే అందుకే నాకు ఎంతో గౌరవం. మనిద్దరినీ యెంతో ప్రేమగా చూస్తుంది. అందుకే వేరు కాపురం పెట్టడం నా కిష్టంలేదు మా చుట్టాలు ఎన్నిసార్లు చెప్పినా."

"నిజానికి మా అక్కయ్య చిన్నప్పుడు మమ్మల్ని చూడకపోతే ఎలా పెరిగేదాన్నో, ఏమయివుండే దాన్నో. పద్దెనిమిదేళ్ళకే, పెళ్ళ యిన నెల రోజులకే మా అందరికీ అండగా నిలిచింది. పేరుకి అక్కయినా, చిన్నప్పట్నించి అమ్మలా పెంచింది నన్ను. నన్నేకాదు. మా అమ్మను కూడా కన్నకూతురులా చూసు కొన్తోంది ఎంతమాత్రం విసుక్కోకుండా."

"ముఖ్యంగా మెచ్చుకోవాల్సింది మీ బావ గార్ని. చాలా చాలా చాలా మంచివారాయన. 'ఎందుకు వీళ్ళకోసం శ్రమపడాలి' అన్నభావన ఆయనలో కలిగివుంటే పరిస్థితులు యింకో మాదిరిగా వుండివుండేవి బహుశా."

"అది నా అదృష్టం. మా అమ్మఅదృష్టం"

"మీ అక్కయ్యకి పిల్లలు పుట్టివుంటే మీరంటేవుండే ఆప్యాయత యింత వుండి వుండేదికాదు."

చిన్నగా నవ్వి చెప్పింది విలాసిని.

"కావచ్చు. కాని నన్ను కన్నకూతురుకన్నా ఎక్కువగా చూసుకునేది చిన్నప్పుడు. నీళ్ళు పోసేది, వళ్ళుతుడిచి బట్టలుతొడిగి జడవేసేది. అన్నం కలిపి ముద్దలు నోట్లో పెట్టినరోజులు కూడా గుర్తున్నాయి నాకింకా."

రిక్షా ఆస్పత్రి ముందు ఆగింది.

డాక్టర్ విలాసినిని పరీక్షచేసి ప్రిస్క్రిప్షన్ వ్రాసిచ్చింది. వాటిని కొనుక్కుని, ఓ పావు గంటసేపు ఇంటికి వచ్చేదారిలో వున్న పార్కులో కూర్చున్నారు.

పుట్టబోయే బిడ్డగురించి మాటాడుకున్నారు ఇద్దరూ ఎలా పెంచాలి, ఏంపేరు పెట్టాలి మొదలయిన విషయాలు.

బాగా చీకటిపడ్డాక ఇంటికి చేరుకున్నారు. విలాసిని అక్కయ్యదగ్గర ఇంటితాళం డూప్లి కేట్ తాళంచెవి వుండటంవల్ల, కచేరీనుంచి తిరిగివచ్చి వంట ప్రయత్నంలోవుంది.

"డాక్టర్ ఏమన్నారు?" అడిగాడు విలాసినిని ఆదిలక్ష్మి భర్త.

"మందులు రాసిచ్చింది."

ఆదిలక్ష్మి చెప్పింది చెల్లెలితో—

"కంచాలుపెట్టు. వంట అయింది."

ఆదిలక్ష్మి ఓ కంచంచిండా అన్నం, కూర మొదలయినవి సర్ది తనతల్లి ముందు వుంచింది. ఆవిడకి ఆకలి వేసినప్పుడు అర్థరాత్రెప్పుడో తింటుంది. తర్వాత స్నానాల గదిలోకి వెళ్ళి, స్నానంచేసి పడుకుంటుంది. ఇంట్లో యెంత మంది వున్నా ఆవిడ ఎవరితో మాటాడదు. ఎవ రయినా పలకరించినా సమాధానం చెప్పదు.

"నా కిష్టమయిన పచ్చడిచేసారే" అన్నాడు, జానకిరాం కొత్తిమేర పచ్చడిని కలుపుకుంటూ.

"పాట కచేరీనుంచి తిరిగివస్తూంటే కన బడింది. లేతగా నవనవలాడుతూంటే పావ లాది కొనుక్కొచ్చాను" చెప్పింది ఆదిలక్ష్మి మరిదికి.

మొదటిముద్ద నోట్లో పెట్టుకుని నములగానే నాలిక చురుక్కుమంది. నోరు మండిపో సాగింది. ఎలాగో ఆ ముద్ద మింగి "అబ్బా! మంట" అని గబగబా గ్లాసెడు నీళ్లు తాగాడు జానకిరాం.

"కారం ఎక్కువయిందా మీకు?" అడిగింది

మనమిలాగే ఇంకొన్నాళ్ళు ప్రేమించుకుందాం డార్లింగ్!
ప్రేమించుకోడం విసుగెత్తించునుకో...అప్పుడు పెళ్ళిచేసేసుకుందాం.



విలాసిని భర్తని, ఎర్రబడ్డ అతని మొహాన్ని, కళ్ళలోంచి కారే నీళ్ళని చూసి.

"అవును, చాలా."

"అట్టే కారంలేదే" అన్నాడు ఆదిలక్ష్మి భర్త పచ్చడి వేలితో రుచిచూసి.

"లైట్‌గా కలుపుకోండి."

విలాసిని భర్తకంచంలోని పచ్చడి అన్నం ప్రక్కకి తోసేసి తనే కలిపింది మళ్ళీ.

"డాక్టరేమంది?" అడిగింది ఆదిలక్ష్మి చెల్లెలిని.

"బలాని కనుకుంటాను టానిక్‌లు రాసి యిచ్చింది."

ఆరాత్రి చెప్పాడు జానకిరాం విలాసినితో.

"రేపు తెలుస్తుంది ఆఫీస్‌లో నా బదిలీ గురించి."

విలాసిని మాటాడలేదు. ఆమె మౌనంలోని అర్థం గ్రహించి, దగ్గిరికి తీసుకుని చెప్పాడు.

"ఆపుకోడానికే ప్రయత్నిస్తున్నాను. వాళ్ళంతటా వాళ్ళే బదిలీచేస్తే యేం చేయగలను చెప్పు."

"ఎలాగయినా మీ ఆఫీసర్‌తో చెప్పి బదిలీ అవకుండా చూడండి. ఆమాత్రం చేయలేరా?"

"అన్నివిధాలా ప్రయత్నిస్తున్నాను."

"ప్రయత్నించడంకాదు. వెళ్ళనని మొండికేయండి."

నవ్వాడు జానకిరాం.

"నీ సలహా పాటిస్తే ఇంక ఆఫీస్ కెళ్ళాల్సిన అవసరం వుండదు. ఇంటిదగ్గిరే కూర్చోవాలి."

ప్రక్కగదిలో ఆదిలక్ష్మి ఉతికిన బట్టలు మడతపెట్టి వచ్చి భర్తపక్కన పడుకుంది. ఆదిలక్ష్మి భర్త భార్యచేతిని మృదువుగా పట్టుకొని సుతారంగా మీదకి లాక్కున్నాడు.

ఆదిలక్ష్మి బలమంతా ఉపయోగించిపక్కకి తిరిగి పడుకుంది భర్తను దూరంగాతోసి.

కొన్నిక్షణాలు నిర్ఘాంతపోయా డాయన భార్య ప్రవర్తనకి.

"ఎందుకా కోపం?" అడిగాడు లాలనగా.

ఆదిలక్ష్మి జవాబు చెప్పలేదు.

భార్య చీర కొనమని ఈ మధ్యకాలంలో ఎప్పుడయినా అడిగితే తను మర్చిపోయాడా, లేక ఆరోజు భార్య పుట్టినరోజయితే ఆ సంగతి తను గుర్తుపెట్టుకోలేదా అని ఆలోచించ సాగా డాయన.

ఆ ప్రక్కగదిలో ఆదిలక్ష్మి తల్లి దొండకాయ కూరలోంచి, చక్రాలుగా తరిగిన ముక్క

# నవశకోదయ ప్రాంగణంలో...

మన ఆంధ్రప్రదేశ్ లో సుదీర్ఘమైన తీరప్రాంతం ప్రకృతి సౌందర్యంతో విలసిల్లుతూ ఎంతోమంది మత్స్య పారిశ్రామికులకు జీవనోపాధి కల్పిస్తున్నది. ప్రపంచ బ్యాంకు సహాయంతో రూ. 31 కోట్ల ఖర్చుతో విశాఖపట్నం, కాకినాడ, నిజాంపట్నం రేవుల్లో మత్స్య పారిశ్రామికులకు అదనపు సౌకర్యాలు కల్పించాలని ఉద్దేశిస్తున్నారు.

అనేక శీతలీకరణ కేంద్రాలు, గిడ్డంగుల సౌకర్యాలు కల్పించాలని ప్రతిపాదించారు. 1978-79 లో మచిలీపట్నంలో మత్స్య పారిశ్రామిక శిక్షణ కేంద్రాన్ని ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు.

ఆంధ్రప్రదేశ్ లో గంగపుత్రులు నవశకోదయ ప్రాంగణంలో అడుగుపెట్టారు.

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

25/78-79



(వి)చిత్ర విజ్ఞానం



కరాటే కళ 5000 సంవత్సరాలకు పూర్వమే మన భారతదేశంలో పుట్టింది. శుక్రనీతి, అగ్నిపురాణాల్లోని కొన్ని శ్లోకాల్లో కరాటేకు సంబంధించిన అనేక నియమాలూ, పద్ధతులూ, రీతులూ పేర్కొనబడి వున్నాయి కేరళ రాష్ట్రంలో "కలారిప్పాయట్" అనబడే కళకీ, కరాటేకీ చాలా పోలికలున్నాయి. ఐతే కలారిప్పాయట్ కళలో కొన్ని ఆయుధాలు ఉపయోగిస్తారు.

లను జాగ్రత్తగా ఏరితీసి పక్కపిన్నీసుకి శ్రద్ధగా గుచ్చసాగింది.

పూర్తిగా గుచ్చాక ముక్కలన్నిటినీ ఒక్కసారిగా నోట్లోవుంచుకొంది పక్క పిన్నీసుతోనే.

తర్వాత పగలబడి నవ్వసాగింది.

* * *

"ఆబిడ్స్"

కండక్టర్ దగ్గరకి రాగానే చెప్పాడు జానకిరాం, కండక్టర్‌కి నలభై పైసలివ్వడానికి చొక్కాజేబులో చెయ్యిపెట్టాడు జానకిరాం.

ఖాళీగావుంది జేబు. చిల్లర జేబురుమాలు లేదు.

పాంట్ జేబులో చేతినుంచాడు.

పర్స్‌లేదు.

బేక్ పాకెట్‌లో చిల్లర వుందేమోనని తడిమి చూశాడు.

చిల్లర జేబులో ఏమీ లేదు.

పర్స్ ఎవరయినా కొట్టేసారా?

కండక్టర్ టికెట్ చింపకుండా తనచేత్తో అతని చేతిని ఆపి చెప్పాడు.

"సారీ బ్రదర్, డబ్బు ఇంటిదగ్గిర మరచి వచ్చాను. దిగిపోతాను."

తర్వాతి స్టాప్‌లో బస్‌దిగి పదినిముషాల్లో ఇంటికి చేరుకున్నాడు.

"వచ్చేసారే? ఆఫీస్‌కి వెళ్ళలేదా?" అడిగింది విలాసిని ఆశ్చర్యంగా.

"నా జేబులో చిల్లర, పర్స్, రుమాల, దువ్వెన ఏమీలేవు. ఇంకో పేంట్ జేబులోకి మార్చావా?" చిరాకుగా అడిగాడు భార్యని.

"లేదే."

"మరయితే ఏమయినట్లు?"

విలాసిని తన గదిలోని టేబిల్ మీద, టేబిల్ కుండే డ్రాయర్ సొరుగులో వాటికోసం చూసింది.

లేవు.

"చిత్రం. ఏమయినట్లు? ఎవరో కొట్టేసి వుంటారు" అన్నది.

భార్యదగ్గర ఓ అయిదురూపాయలు అడిగి తీసుకున్నాడు ఆటోలో ఆఫీసుకెళ్ళడానికి.

"ఆయన ఎందుకుమళ్ళీవచ్చారు" ఆదిలక్ష్మి అడిగింది చెల్లెలిని జానికిరాం వెళ్ళాక.

"పర్స్ పోయిందట."

సాయంత్రం ఆఫీసునుంచి తిరిగివచ్చాక విలాసిని భర్తకి పోయిన వస్తువులన్నీ అందించింది.

"ఎక్కడున్నాయ్?" అడిగాడు.

"మరీ అంత నిర్లక్ష్యం అయితే ఎలాగండీ? చాకలి వాడికి వేయాల్సిన బట్టల బుట్టలో అడుగున వున్నాయి.

"నాజేబులోంచి అక్కడి కెలా వెళ్ళాయి?" విస్మయంగా అడిగాడు జానకిరాం.

"మీకే తెలియాలి."

"నాకు నిజంగా తెలీదు."

"ఏమో! కాని వాటికి కాళ్ళయితే మొలవ లేదు" నవ్వింది విలాసిని.

* * *

"ఈ బట్టలన్నీ ఎవరు ఇలాపాడు చేసింది?"

# దేశానికి వెన్నెముక గ్రామం...

నేటికీ, ఎన్నటికీ, దేశానికి గ్రామమే వెన్నెముక. గ్రామ సౌభాగ్యమే దేశ సౌభాగ్యం. త్వరలోనే ఆంధ్రప్రదేశ్ లోని పల్లెప్రాంతాలకు విరివిగా రహదారి సౌకర్యాలు కల్పించి వాటిని మిగతా ప్రపంచానికి సమీపంగా తీసుకురావలసివుంది.

అందుకే రాష్ట్రంలోని మారుమూల గ్రామాలను కలుపుతూ రోడ్లు వేసేందుకు 1978-79 బడ్జెట్ లో రు. 11 కోట్ల నిధులను కేటాయించడం జరిగింది.

అంతేకాదు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ పల్లె పల్లెకు బస్సులు నడిపేందుకు శాయశక్తులా కృషి చేస్తుంది. ప్రైవేటు బస్సు యజమానులకు కూడా ఈ కార్యక్రమంలో ఇతోధిక ప్రోత్సాహం లభిస్తూంది. ఆంధ్రప్రదేశ్ లోని మారుమూల గ్రామాలు సైతం నాగరికతా ప్రపంచానికి త్వరగా దగ్గర వాలనేదే ప్రభుత్వ లక్ష్యం.

---

అసహనంగా అడిగాడు జానకిరాం భార్యని.

నిర్ఘాంతపోయి చూసింది విలాసిని తెరచి వున్న సూట్‌కేస్‌లోని భర్త బట్టల వంక. ఇస్త్రీ మడతలుపెట్టి వున్నాయి బట్టలు దొంతరలుగా.

వాటిమీద మెత్తగా నూరిన నల్లటి బొగ్గు పొడి చల్లివుంది. ఆ పొడి చల్లి, తర్వాత మళ్ళీ నీళ్ళు చల్లిన గుర్తుగా అక్కడక్కడా బట్టలకి మరకలు అంటుకొని వున్నాయి అసహ్యంగా.

ఆ దొంతరలోవున్న అన్ని జతలనిండా బొగ్గు పొడి, నీళ్ళు చల్లబడివున్నాయి.

"ఇదెవరి పని?" అడిగాడు మళ్ళీ.

"నేనంటారా? నాకేమయినా పిచ్చిపట్టిందా మీ బట్టలు పాడుచేయడానికి? నేనే చేసివుంటే మళ్ళీ వుతకాల్సింది నేనేగా?"

"ఛ, నీవు చేసావని అనటంలేదు నేను." ఆలోచనగా అన్నాడు జానకిరాం.

"ఒకవేళ మా అమ్మ పనేమో ఇది?"

"ఆవిడా? ఆ గదిదాటి బయటికిరాదుగా ఎప్పుడో కాని. సీలింగ్ ఫేన్‌వున్న గదిలోకి రావాలంటే ఆవిడకి భయం గదా. అసలు నీకు పెళ్ళయిందనీ, నేను నీ భర్తననీ కూడా తెలియదు ఆవిడకి. ఆవిడది మన లోకంకాదు."

"నిజమే కానీ "

"నీ బట్టలు చూడు. వాటికేం కాలేదు. కేవలం నా బట్టలమీదే బొగ్గు పొడి చల్లి పాడు చేసారు. వాళ్ళెవరో కానీ, నేనంటే ఇష్టం లేదను కుంటాను."

"ఈ ఇంట్లో మీరంటే అందరికీ గౌరవం వుంది. మీరంటే ద్వేషం ఎవరికీలేదు."

జానకిరాం కొన్ని క్షణాలు మాట్లాడలేదు. తర్వాత అన్నాడు నిస్పృహగా.

"ఇప్పుడెలా ఆఫీస్‌కి వెళ్ళడం?"

"నిన్న విడిచినవే వేసుకెళ్ళండి ఇవాల్టికి. సాయంత్రానికల్లా వుతికి ఇస్త్రీ చేయిస్తాను వాటిని."

విలాసిని బట్టల స్టాండ్‌కి వేలాడుతున్న విడిచిన పేంట్, షర్టులని అందించింది భర్తకి.

చొక్కా తొడుక్కుని అన్నాడు.

"గుండీలేవి?"

"ఏం గుండీలు?"

"చొక్కాకి గుండీలు లేవు. ఎవరో కోసేసారు" అన్నాడు జానకిరాం చొక్కాని తేరిపారచూసి.

గబగబా పేంట్‌ని కూడా తిరగేసి చూసి, చిన్నగా నిట్టూర్చి చెప్పాడు.

"పేంట్‌కి కూడా గుండీలులేవు. నే నివాళ ఆఫీస్‌కి వెళ్ళటం ఇష్టంలేక నీవే చేసివుంటావ్ ఈ పని."

"నేను కాదు."

విలాసిని కొద్దిగా భయంగా, విస్మయంగా చెప్పింది.

"వాటికి గుండీలు త్వరగా కుట్టు. వెళ్ళాలి."

అరగంటలో విలాసిని భర్త దుస్తులకి బటన్స్ కుట్టింది. ఇద్దరు తమ తమ ఆలోచనలతో మౌనంగా వుండి పోయేరు.

బూట్లు తొడుక్కొంటూంటే లోపల ఏదో మెత్తగా తగిలితే, కాలు బయటికితీసి బూటుని గట్టిగా దులిపాడు జానకిరాం.

కుడికాలి బూట్లోంచి గుప్పెడు ఇసక నేల మీద రాలింది. అనుమానంవచ్చి ఎడంకాలి బూటు కూడా దులిపాడు. సూదుల్లా వుండే చిన్న చిన్న కంకర రాళ్లు బయటపడ్డాయి, గుండు సూదులతోపాటుగా.

వాటిని చూసి విలాసిని భయంగా భర్త చేతిని పట్టుకుంది వెంటనే. ఇద్దరూ కొన్ని క్షణాలు మాట్లాడలేదు.

"చేతబడేమో?" అన్నది వణికే కంఠంతో.

"చేతబడా?"

భార్య మొహంలోకి చూసాడు జానకిరాం. అతని మొహంలోకూడా కొద్ది క్షణాలు భయం చోటు చేసుకుంది.

"నా మీద ఎవరికి వుంటుంది అంతద్వేషం? కాకపోవచ్చు." అన్నాడు.

"మరయితే ఇవి "

"మనుషులపనే అయివుండాలి."

"కొత్త వాళ్ళెవరూ రాలేదుగా ఇవాళ?"

జానకిరాంకి కూడా బోధపడలేదు అవి తన బూట్లలోకి ఎలా వచ్చాయో!

భర్త ఆఫీస్‌కి వెళ్ళేటప్పుడు చెప్పింది విలాసిని నాలుగు నిముషాల తర్వాత.

"జాగ్రత్తండి."

"నువ్వేం కంగారు పడకు."

భార్యకి ధైర్యం ఇవ్వడానికి నవ్వాడు జానకిరాం ప్రయత్నపూర్వకంగా.

విలాసిని జరిగింది ఆదిలక్ష్మికి చెప్పింది.

"విచిత్రం, ఎవరు చేసి వుంటారు? అన్నది ఆశ్చర్యంగా ఆదిలక్ష్మి.

* * *

విలాసిని బాయిలర్‌లోంచి వేణ్ణీళ్ళని బక్కెట్లోకి తోడింది భర్త స్నానం చేయడానికి. టవల్ బాత్‌రూం తలుపు మీదవేసి భర్తని కేకేసింది.

రెండు చెంబుల నీళ్ళు నెత్తిమీద పోసుకున్నాక ఆ నీళ్ళు అదో మాదిరిగా వున్నట్లనిపించింది జానకిరాంకి. ఇంకో రెండు చెంబులు పోసుకున్నాక, అనుమానం తీర్చుకోడానికి కుడిచేతి చూపుడు వేలుని నోట్లో పెట్టుకుని నాకి చూసాడు. తర్వాత గుప్పెడు నీళ్ళని నోట్లో పోసుకుని రుచి చూసాడు.

"విలాసినీ."

భార్యని గట్టిగా పిలిచాడు బాత్‌రూం తలుపు తెరచి.

"ఏమిటీ?"

పరిగెత్తు కొచ్చింది విలాసిని. కిటికీలోంచి బాత్‌రూం వంక చూసింది ఆదిలక్ష్మి.

"ఈ నీళ్ళలో వుప్పు ఎవరు వేసారు?" అడిగాడు.

"ఉప్పా?"

"అవును, సముద్రం నీళ్ళలా వుప్పగా వున్నాయి ఇవి."

విలాసిని కూడా ఆ నీళ్ళని రుచిచూసి అన్నది ఏదో గుర్తువచ్చిన దానిలా.

"అక్కయ్య వేసిందేమో?

"మీ అక్కా! ఆవిడకేం పని?"

"ఇందాక మా అందరి స్నానాలు అయాక రెండు గుప్పెళ్ళనిండా వుప్పు తీసుకువస్తూంటే చూసాను. కొబ్బరి మొక్క మొదట్లో వేయడాని కనుకున్నాను."

జానకిరాం దూరంగా వున్న కొబ్బరి మొక్క దగ్గరకివెళ్ళి చూసాడు.

ఉప్పు లేదక్కడ. కనీసం నీళ్లుకూడా పోసిన సూచనలేదు.

"మీ అక్కయ్యే వేసివుంటుంది" అన్నాడు పెళ్లాం దగ్గరకివచ్చి.

అర్థం కానట్టుగా చూసింది విలాసిని భర్త మొహంలోకి!

"తప్పకుండా ఇది ఆవిడ పనే అయి వుండాలి."

విలాసిని పెదవి విప్పలేదు. ఆలోచిస్తోంది. నిజంగా ఇది అక్కయ్య పనేనా? అయితే, ఎందుకు?

"నిన్న నా బట్టలమీద బొగ్గుపొడి చల్లిందీ, నా బూట్లులో ఇసక పోస్తున్నదీ కూడా ఆవిడే అయివుండాలి."

"ఆవిడకేం లాభం?"

జానకిరాం వెంటనే మాట్లాడలేదు. ఆలోచిస్తూండి పోయాడు చాలా సేపు. తర్వాత అన్నాడు

"తొట్లో నీళ్ళు ఓ బక్కెట్ తెచ్చి పెట్టు వేరే బకెట్లో. ఇవాళ చన్నీళ్ళే స్నానం చేస్తాను."

"అక్కయ్యని అడుగుతా నుండండి. ఎందు ."

"వద్దు. అప్పుడే అడగక."

"ఏం?"

"వద్దన్నానంతే. అడగక."

జానకిరాంకి వడ్డించిన కూరలో విసరంత కూడా వుప్పులేదు. చప్పగావుంది. ఎవరూ చూడకుండా రహస్యంగా భార్యకి కొద్దిగా రుచి చూపించాడు సౌజ్ఞ చేసి.

భోజనం అయి తమ గదిలోకి వెళ్ళాక అడిగింది విలాసిని కంగారుగా.

"ఎందుకిలా ప్రవర్తిస్తోంది ఆదిలక్ష్మి?"

"మీ అక్కయ్యని ఏం అడగక అప్పుడే."




సాయంత్రం త్వరగా వచ్చాడు జానకిరాం ఆఫీస్ నుంచి. బయటకితీసుకెళ్ళాడు విలాసినిని.

"ఎందుకు మా అక్కయ్యని అడగ వద్దన్నారు? ఆవిడలో ఏమిటీ వింత ధోరణి కొత్తగా?" అడిగింది విలాసిని.

భార్య మొహంచూస్తే ఆలోచనలతో సతమతమవుతున్నట్టుగా అనిపించింది జానకిరాంకి.

"ఆలోచించాను అదే విషయం. నాకు అట్టే బోధపడలేదు."

"అడుగుదాం. తప్పేముంది?"

"నాకు కారణం బోధపడింది."

"ఏమిటి?" ఆత్రంగా అడిగింది.

"తన కళ్ళముందే పెరిగి గౌనుల్లోంచి, ఓణీల్లోంచి, చీరల్లోకి వచ్చిన నీకు పెళ్ళయి నెల తప్పింది. త్వరలో బిడ్డ పుట్టబోతున్నాడు. ఆవిడ కా అదృష్టం కలగలేదు - ఇంతదాక, ఇన్ని సంవత్సరాలయినా. తనకి ఎన్నటికీ పిల్లలు కలగరనే నిజం ఆవిడని చాలాకాలంగా బాధిస్తూండాలి. బహుశ ఆ బాధని తనలో తాను అణచుకుంటూండాలి ఇంతకాలం. కాని నీవు గర్భవతివని తెలిసిన క్షణంనుంచి అణచి పెట్టిన ఆవిడ బాధ తిరిగి రగులుకొనివుండాలి."

"అయితే?"

"ఆవిడలోని ఫ్రస్ట్రేషన్ బయటపడింది, అసూయ రూపంలో. నా వూహ మాత్రమే ఇది."

"అసూయా? ఎవరిమీద? నామీద అసూయ వుంటే మిమ్మల్ని దేనికి హింసించటం?"

"నీ మీద కాదు. నామీదే."

"మీ మీదా? బిడ్డని కనేది నేనుగా? మీరు గర్భవతి కాదుగా?"

"చిన్నప్పటినుంచీ నిన్నెంతో ప్రేమగా పెంచింది. నిన్నే ద్వేషిద్దామన్నా ఆవిడకి అది సాధ్యపడక పోవచ్చు. నేను పరాయి వాడిని."

"అందుకని మిమ్మల్ని ద్వేషిస్తోందా?"

"అవును. నీ మీద వుండాల్సిన అసూయ లోంచి పుట్టే ద్వేషం నా మీదకి మరల్చుకుంది. నీకు నెల తప్పడానికి కారణం నేనేగా. బహుశ ఇంకెప్పటికీ పిల్లలు తనకి పుట్టరనే బాధని కంట్రోల్ చేసుకోగలిగినట్లుగా నామీది ద్వేషాన్ని అణచుకోలేక ఇలా చేస్తోంది అనుకొంటాను"

"మా అక్కయ్య అలాంటిది కాదు. నేనంటే. .."

"కావచ్చు.కాని ఇదో మానసిక దౌర్బల్యం."

"అయితే?"

"ఆవిడ ద్వేషం అదే.. దౌర్బల్యం ఇంకా ప్రారంభ దశలోనేవుంది. నీకు నెలలు నిండిన కొద్దీ ఎక్కువ అవచ్చు"

విలాసిని కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"నామీద ద్వేషం తక్కువస్థాయిలో వుండటంవల్ల రహస్యంగా చిన్నచిన్న పన్లతో సరి పెట్టుకుంటోంది. అదే ఎక్కువయితే ఆవిడ ఏమయినా చేయచ్చు చంపచ్చు కూడా."

"అమ్మో!"

తన గుండెలమీద చేతిని వుంచింది విలాసిని భయంగా.

జానకిరాం మాట్లాడలేదు.

"అయితే అక్కయ్య మా అమ్మలా.. "

"అందుకే బదిలీ చేయించుకున్నాను. కొద్ది కాలం దూరంగావుందాం. మానసికంగా ఆవిడకి కావలసినంత విశ్రాంతి కావాలి. మనం కళ్ళ ఎదుట తిరుగుతుంటే అది కరువవుతుంది. పైగా పగ, ద్వేషం ఎక్కువయి అది ఎవరి మీదనయినా మళ్ళచ్చు నామీదనుంచి. లేదా వున్మాదంలోకి దింపచ్చు."

విలాసిని ఏడుస్తోంది నిశ్శబ్దంగా.

"సారీ, నీకు బాధవేస్తుందని తెలిసినా చెప్పక తప్పలేదు."

కొన్ని నిముషాల తర్వాత కళ్లు తుడుచుకుని చెప్పింది విలాసిని.

"అక్కమనసు కుదుట పడటం కావాలి. నాకు అది ముఖ్యం."

* * *

పదిహేను రోజులతర్వాత విలాసిని తన భర్తవెంట విశాఖపట్నం వెళ్ళిపోతూంటే ఆది లక్ష్మి చెల్లెలిని కౌగలించుకుని గట్టిగా ఏడ్చింది.

"చిన్నప్పట్నించి పెంచాను. వెళ్ళిపోతున్నావ్. ఇంతదాకా నిన్ను వదలి వుండలేదు."

విలాసినికూడాఏడుపు ఆపుకోలేకపోయింది. జానకిరాం కళ్ళలోకూడా నీళ్లు తిరిగాయ్.

రైల్వేస్టేషన్‌కివచ్చారు విలాసిని అక్కయ్య, బావ వీడ్కోలు ఇవ్వడానికి.

రాత్రి ఎనిమిదిన్నరకి అక్కయ్య చేసిచ్చిన అరిసెలు బయటకు తీసింది విలాసిని రైల్లో.

ఒకటి తుంపినోట్లోవేసుకుని నమలసాగింది.

"నీకు అరిసెలు సయించవుగా?" అన్నాడు జానికిరాం ఆశ్చర్యంగా భార్య అరిసె తినడం చూసి.

అరిసెలన్నిటినీ కిటికీలోంచి బయటకు విసిరేసింది విలాసిని కొద్దిగా కోపంగా.

"మీకోసం చేసింది. ఇనక" అన్నది.

భార్య కళ్ళలో నీళ్లు తిరగడంచూసి లాలనగా అన్నాడు జానకిరాం.

"మీ అక్కయ్యే కొన్ని సంవత్సరాల తరువాత మళ్ళీ మనల్ని హైదరాబాద్ బదిలీ చేయించుకోమని అడగవచ్చు. ఆ అవసరం కలగచేయడానికే, ఆవిడమనసు కుదుటపడటానికే మనం దూరం అవుతున్నాం. ఇది తాత్కాలికమే."

"మీకా నమ్మకముందా?"

బదులుగా జానికిరాం కిటికీలోంచి బయటకు చూడసాగాడు. బయటంతా చిమ్మచీకటి.

దూరంగా మిణుకు మిణుకుమంటూ ఎగురుతున్నాయి మిణుగురు పురుగులు.



# పిచ్చిదాని గీత

## సి. శైలకుమార్

భోజనంచేసి చెయ్యికడుక్కుంటూ కిటికీగుండా చూశాను. వర్షం యింకా కురుస్తూనే వుంది. సాయంత్రం ఆరునుంచి తనకిక పనిలేనట్లుగా పడుతూ అంతకంతకూ పెరిగిపోతోంది.

సిగరెట్ వెలిగించి గదంతా పరిశీలించాను. వస్తువులు చిందరవందరగా పడి బ్రహ్మచారి గదికి సాక్ష్యంలావుంది.

చినుకుల శబ్దంతప్ప మరింకేం వినిపించడం లేదు. భయంకరమైన మౌనం మస్తిష్కాన్ని పట్టి పీడిస్తోంది. ఏకాంతిక మౌనం ప్రేమికుడికి కలల కౌగిలి ప్రసాదిస్తుందేమోగాని, నాకు మాత్రం నరకంలావుంది. ఏం రాద్దామన్నా ఐడియా రావడంలేదు. ఏం చెయ్యడానికి తోచడంలేదు.

“వర్షంలో తడుస్తూ తిరిగితే ” హఠాత్తుగా అనిపించింది. ఇళ్ళల్లో వెచ్చగా దుప్పట్లు కప్పుకొని పడుకున్నవాళ్ళు కిటికీలగుండా చూసి పిచ్చివాడనుకుంటారేమో? అనుకోనీ నాకేం? జ్వరం మొస్తే? రానీ ఆ అనుభవమూ చూద్దాం.

వెళ్ళాలనే నిశ్చయంతో తలుపులు తెరిచి అటూయిటూ చూశాను. అంతా అంధకారం. అరుగుపయిన ఏదో ఆకారం కూర్చున్నట్లు అనిపించి “ఎవరది” అంటూ ప్రశ్నించాను. జవాబులేదు. దగ్గరగా వెళ్ళిచూశాను. పిచ్చిది. సగం తడిసి ముడుచుకుని కూర్చునివుంది.

ఈ పిచ్చిది ఈవూరువచ్చి దాదాపు నాలుగు నెలలవుతుంది. మాసి చినిగిపోయిన బట్టలూ, తైలసంస్కారం లేక పేలు నిండినతల, ఎముకలగూడు శరీరం.

అందర్నీ ప్రేమగా చూస్తుంది. ఎవర్నీ ఏమీ అనదు. ఏమీ అడగదు. ఎవరయినా దయ తలచి అన్నం పెడితే తింటుంది, రాత్రిపూట ఏదో ఒక అరుగుమీద నిర్భయంగా, స్వేచ్ఛగా పడుకుంటుంది.

నాకు ఎన్నాళ్ళనుంచో ఈమెపై కథరాయాలని కోరిక. జీవితంనుంచి ఏరుకున్న వాటిని తప్ప, చెత్తకథలు నేను రాయను. నిజానికి అసలు నేను రచయితనుకాను, కవినిమాత్రమే.

“లోపలకు రా” పిలిచాను. కళ్ళెత్తి నా వేపుచూసి భయంలేకుండా గదిలోకి ప్రవేశించింది. తలుపులు దగ్గరగావేసి దీపకాంతిలో ఆ ముఖాన్నిచూశాను. శిథిలమైన సౌందర్యపు ఛాయలు, కొండంత గర్వాన్ని కోల్పోయినట్లు కనిపిస్తున్న కళ్ళు, రసహీనమైన చెరకుపిప్పి లాంటి పెదాలు. ఇంత దగ్గరగా యీమెను చూడటం యిదే మొదటిసారి.

“అన్నం తిన్నావా?”

లేదన్నట్లు తల ఆడించింది. నా కారియర్లో మిగిలిన అన్నాన్ని ఆమె ముందుంచి తినమన్నాను. మెల్లగా తినసాగింది.

ఈమె జీవితంగూర్చి ఈమెను ఎలాప్రశ్నించి తెలుసుకోవాలో ఆలోచించసాగేను.

నేను ఆమెవేపు చూసేసరికి ఆమె తన చిరిగిన చీర కొంగుతో పెదాలు తుడుచుకుంటూ లేచి నిలబడింది.

"పర్వాలేదు కూర్చో'' అన్నాను. గోడ నానుకుని కూర్చుంది.

"నిన్నో విషయం అడగనా" సందేహంగా అడిగేను.

కళ్ళు పెద్దవిచేసి "అడిగేముందు, కలువల లోన విచ్చినకత్తుల రేకులు చూశావా? మంటల లోన మాడక నిలిచిన మల్లెలుచూశావా?" అంది.

ఏమనాలో అర్థంకాలేదు నాకు. అయినా అడిగేను. "నీ పేరేమిటి?''

"పేరెందుకు వూరెందుకు?

మనసు మమత తెలిపేందుకు" అందిమళ్ళీ.

ఏమిటీ మనిషి, ఏమిటీ సమాధానాలు, అంతా చిత్రంగావుంది. ఖచ్చితంగా ఈమెకథ రాయాల్సిందే. నాలో పట్టుదల పట్టుబట్టింది.

''ఇంతకూ ఎవరు నువ్వు?''

"నీకెందుకు?"

"నీపై ఓకథ రాద్దామని" కథంటే చెబుతుం దని నా భావన.

"కథరాస్తావా. రచయితవా?" అంది తల గీరుకుంటూ.

"ఔను"

"ఏంపనిచేస్తున్నావ్?" అంది వెక్కిరింపుగా.

"ఏ పనయితేనేం,నాకు ప్రాణం సాహిత్యం" అన్నాను.

"అఁ పప్పులో కాలేశావు. చూడు సాహిత్యము ప్రాణంకంటే యెక్కువే, ఎందుకంటే ప్రాణం పోయినా సాహిత్యం పోదుకాబట్టి తెలుసా'' అంది.

నాకెంత ఆశ్చర్యంవేసిందో నాకే తెలియదు. ఒక పిచ్చిదానిలో యింత ఆలోచనా? యింత జ్ఞానమా? యీమె నిజంగా పిచ్చిదేనా? లేక నటిస్తోందా? సందేహాల సాలెగూట్లో చిక్కు కున్నట్లనిపించింది. మరో సిగరెట్ వెలిగించి.

"పిచ్చిదానిలా కనిపిస్తున్న ఓ అనామికా, నీ కథ తెలుపవా?" అన్నాను దీనంగా యిలా గైనా చెబుతుందేమోనని.

"కథ కథలోనూ ఏదో ఒక వ్యథ.

మది మదిలోనూ ఏదో ఒకరొద తెలుసా" అంది!

ఆమె మాటలాడుతున్న ప్రతిమాటపై ఒక కావ్యం రాయవచ్చు. గత జీవితంలో బాగా చదువు కొన్నదై వుండాలి. కానీ యిలా మార డానికి కారణం ఏమిటో? అడిగిన ప్రతి ప్రశ్నకు ఓ చిక్కు ముందుపెట్టి విప్పుకోమంటోంది ఎలా? ఆలోచనలో పడ్డాను.

నా మౌనం ఆమెకు బాధ కలిగించినట్లుంది. "మౌనం దాల్చావెందుకు కోపమా?" అంది.

లేదన్నాను తల ఊపుతూ.

"మరి" అంది.

"సాటి మానవుడుగా అడుగుతున్నాను. యింతకూ నువ్వెవరు? చెప్పు" అన్నాను దీనంగా మరెలా అడిగినా ఆమె చెప్పదేమోనని.

"నేనా నేను చలాన్ని, శ్రీశ్రీని, ఊర్వ శిని, షెల్లీని."

నాకేమీ అర్థంకాక అలాగే చూస్తూవున్నాను. నవ్వుతూ "చెబుతా విను'' అంది.

## 1

నేను ఓ సంపన్న కుటుంబంలో పుట్టిన సంపంగిని. నిత్య నూతనత్వాన్ని వలచే దాన్ని. బి.ఏ. లో చేరే సరికే నా మనస్సు ఈ సమాజపు ఆలోచనల స్థాయిని దాటిపోయింది.

నేనెంత అందగత్తె నంటే నా కాలికి ముల్లు గుచ్చుకుంటే కాలేజీ అంతా ఏడ్చేది. ఒక్క రోజు కాలేజీ మానేస్తే అప్పటి యువకవులంతా విరహ గీతాలు రాసుకొనేవారు.

నీలాగే నేనూ సాహిత్యం ప్రాణంగా, జీవి తంగా ఎంచుకొన్నాను. ప్రేమించాను. సత్ సాహిత్యానికి కదలి కదలి, కన్నీరు చిలికించి, కడలిలా పొంగి, కలల్లో తేలి, ఊహల వలల్లో చిక్కి, ఉర్విని దాటి ఊర్ధ్వలోకాలి కెక్కడికో వెళ్ళిపోయేదాన్ని.

ఆ స్థితిలో నన్ను ప్రభావితంచేసి, అణు వణువూ, ఆవహించినవాడు "గుడిపాటి వెంకట

చలం." ఆయన సాహిత్యం చదివి, స్త్రీలలైంగిక స్వేచ్ఛకై ఆయన పడుతున్న ఆరాటం గ్రహించి, పురుషుడి అహం కారాన్నీ, అహంభావాన్నీ వెక్కిరించాలనీ ఎదిరించాలనీ ఆయన చెప్పినట్లు జీవించడం ప్రారంభించాను.

ఫలితంగా నేను మెచ్చిన వాడితో, నాకు నచ్చిన విధంగా తిరిగేదాన్ని. కాలేజీ అంతా కాముకురాల్నని ముద్ర వేసింది.

ఒకరోజు నాకు నచ్చని లెక్చరర్ నన్ను కోరాడు. ససేమిరా వీలు కాదన్నాను నేను. ఆయన కోపంతో నిజాలకు కథలు జోడించి మా యింట్లో వాళ్ళ చెవికి తగిలించాడు.

అప్పటికే నా గురించి చూచాయగా తెలిసిన వాళ్ళు మరీ కోపంతో నన్ను బెదిరించారు. నేను ఎదిరించాను. కాలేజీ మానెయ్యమన్నారు. వీలు కాదన్నాను. నాన్న కొట్టాడు. నేను తిట్టాను.



నా తిరుగుళ్ళ ఫలితంగా నాకు గర్భం వచ్చింది. ఇంట్లోనూ, బయటా అందరూ అసహ్యించుకొంటూ అనాదరించారు. ఏమీ చేయలేని తండ్రి యిల్లు వదలి పొమ్మన్నాడు. నాకూ స్వేచ్ఛకావాలనిపించి, ఒకరాజు అర్ధరాత్రి యిల్లనే బంధిఖానా వదిలేశాను.

నాతో తిరిగిన అందరూ నన్ను దూరంగా చూస్తూవచ్చారు. దేవులపల్లి ఊర్వశిలా నన్నెవ్వరూ ఆరాధించలేదు. చలం శశిరేఖలా నన్నెవ్వరూ దగ్గరికి తీసుకోలేదు. "పిచ్చిముండ"నైన నన్ను ఏ "మీరా" కూడా లాలించలేదు.

అప్పుడే గ్రహించుకో గలిగాను అందరూ అందుబాటులోవున్న నా అందాన్ని మాత్రమే అందుకున్నారనీ, నా మనసు నాకే వదిలేశారనీ.

జీవితంలో ఆకలికి ఎంత ప్రభావం వుందో

యిల్లు వరకేకాక కానీ నాకు అర్థం కాలేదు.

నేను చేరుకున్న పట్నంలోని పంపు నీళ్ళు నా ఆకలి తీర్చడంలేదు. అర్ధాంతరంగా ఆగిపోయిన చదువు ఏ ఉద్యోగాన్నీ ప్రసాదించలేదు. ఏ ఆలంబనా దొరకని అస్తవ్యస్త శారీరక, మానసిక స్థితి.

ఆలోచనల్లో తెలిసింది, అమ్ముకోడానికి అందంతప్ప మరేం మిగల్లేదని. దాంతో జీవితం మారింది. డబ్బిచ్చిన ప్రతివాడికీ అందాన్ని అందించాను. శారీరక యంత్రానికి కూడా అరుగుదల వుంటుందని అప్పుడేగ్రహించుకోగల్గాను. పుట్టినబిడ్డ చనిపోవడంతో పెద్ద బరువు తొలగినట్లు ఫీలయ్యాను.

అంత దీనస్థితిలోవున్నా సాహిత్యం చదవటం, కవిత్వం రాయటం మాత్రం మానలేదు. సోమర్‌సెట్‌మామ్, షెల్లీ, కీట్స్ కదిలిస్తూ వచ్చారు నన్ను. కలలు కనడము కన్నీళ్ళువదలడం మానలేకపోయాను.

## 2

ఆ వలయంలోంచి మరో చైతన్యనిలయంలోకి నన్ను లాగినవాడు క్రాంతి. క్రాంతిలో శ్రీశ్రీని చూశాను. కాదు శ్రీశ్రీని కాంతిలో చూశాను. ఆ కాంతిలో లోకాన్ని చూశాను. దృక్పథం మళ్ళీ మారింది.

నిజానికి క్రాంతి అందానికి నేనే అతన్ని నా యింటికి వచ్చేలా వలవేసి వలపించుకున్నాను. నా జీవితంవిని నిజంగా నన్ను ప్రేమించి నాకై విలపించిన వాడతడు.

"నీబాట యిదికాదు, నీచోటు యిదికాదు" అంటూ లోకంలో పెరుగుతున్న ఆకలినీ, తరుగుతున్న జీవనప్రమాణాల్నీ, అనాధల్నీ. అభాగ్యుల్నీ, దోపిడీనీ, దోపిడీచేస్తున్నవాళ్ళనీ చూపించాడు. శ్రీశ్రీ అన్నట్లు "పతితులార, భ్రష్టులార, బాధాసర్పదష్టులార, పనికిమాలి, బ్రతుకుకాలి, ఏడవకండేడవకండి వస్తున్నా, వస్తున్నా" అంటూ నన్నూ రమ్మన్నాడు. "ఎక్కడికన్నాను?" "సమస్యలులేని సమాజాన్ని నిర్మించుకోవడానికి" అన్నాడు.

జగాన వెలుగు పండించడంకన్నా గొప్పదేముంది అనుకొని క్రాంతితో కాంతిబాటలో అడవుల్లోకి నడిచాను.

పువ్వులు పట్టుకున్న చేతుల్లో తుపాకి నిలిచింది. తుపాకి తూటాల సువాసనే నాసికనాశ్రయించి మత్తుగొల్పింది.

అప్పుడు కామంతో ఎర్రబడ్డకళ్ళు. ఇప్పుడు కోపంతో యెర్రబడ్డకళ్ళు. అంతే తేడా.

ఉద్యమం ఉప్పెనలా సాగుతోంది. ఐదేళ్ళలోగానే దేశపు మౌలికస్వరూపాన్నే మార్చేస్తామనే శాస్త్రీయమైన కలలు మాలో. పోరాటపు పాటల్నిరాస్తూ అందర్నీ ఉత్తేజపరచి, ఉత్సాహమిచ్చేదాన్ని నేను.

తిరగబడుతున్న ప్రజల్నీ, కదులుతున్న పునాదుల్నిచూసి ప్రభుత్వం గంగవెర్రులెత్తింది. దాని ఫలితంగా మా ప్రాంతాలనిండా సైన్యం దిగింది.

జీతాలకోసం ప్రాణాలు కొదువపెట్టుకొన్న వాళ్ళకూ, జీవితాలకోసం ప్రాణాల్ని పణంగా ఒడ్డగల మాకూ రణం ప్రారంభమయింది.

కొండ బలానికి గుండెబలం ఓడిపోతుందని మేమనుకోలేదు. మాచుట్టూ, మా ఆశయాల చుట్టూ తుపాకుల సముద్రం, తూటాల అలలు.

వందల్లోవున్న మేము ఒక్కొక్కరే రాలిపోసాగేము.

## 3

ఒకరాత్రి భయంకరమైన చీకటి ఆవరించుకొన్న రాత్రి, ఓ పొదలో ఎదపై తుపాకుల్తో అప్రమత్తతతో కూర్చుని వున్నాం, నేనూ క్రాంతి, మరికొందరూ.

హఠాత్తుగా గుళ్ళవర్షం ప్రారంభమయింది. ఎదిరించే శక్తిలేని మేమందరం పారిపోను ప్రారంభించాం. కాని క్రాంతి వాలిపోయాడు. తుపాకుల శబ్దమూ ఆగిపోయింది. అసలేవేపు నుంచి తుపాకులు పేలాయో యెవరికీ అర్థం కాలేదు.

పరిగెత్తుకుంటూవెళ్ళి, క్రాంతిని నా ఒళ్ళోకి లాక్కున్నాను. ఎదపైనుంచి ఏకధారగా స్రవిస్తోన్న రక్తం. మృత్యువులేని, సమాజం సృష్టించాలని శ్రమించిన క్రాంతి మృత్యువుతో

ఆఖరిపోరాటం చేస్తూకూడా "వెళ్ళు. శత్రువులు చుట్టుముట్టుతున్నారు. ప్రమాదం దండెత్తుతోంది. నాకోసం దిగులుపడకు. నేను ఇంక యెంతో సేపు జీ విం చ ను" అంటూ నాకళ్ళ లోకి సూటిగాచూస్తూ కళ్ళుదించేశాడు.

గాలి, నేల, చీకటి, పొదలూ అన్నీ ఏడ్చాయి. ఆఖరిసారిగా క్రాంతి పెదవుల్ని ముద్దుపెట్టుకొని, నిర్జీవశరీరాన్ని నిర్జీవ పరి సరాలకు వదలి చేసేదిలేక పారిపోయాను.

క్రాంతిపోయిన విషాదమేఘచ్ఛాయ నన్ను వీడి పోకముందే,ఒకరోజు ఒక వాగుచెంత నీళ్ళు తాగుతూ పోలీసులకు పట్టుబడ్డాను.

రహస్యాలేవీ చెప్పలేదనే కోపంతో "నర కం" ఎలా వుంటుందో చూపించారు నాకు. పన్నెండుమంది నాలోని రహస్యాలన్నీ గాలించి నాలోమిగిలివున్న సౌందర్యాన్నిచూసి ఆకలితో నాపైబడ్డారు. ప్రతిఘటించాను. కానీ ఫలితం శూన్యం.

ఏ కొద్దిగానో నాలో మిగిలివున్న సౌందర్యం దానితో పూర్తిగా శిథిలమైంది.

ఏవేవో అభియోగాలతో నాపై కేసులు బనా యించారు. నాలుగు సంవత్సరాల కఠిన కారా గార శిక్ష విధించింది న్యాయస్థానం.

జెయిల్లో, ఆ వాతావరణం, ఆ ఆహారం స్వేచ్ఛ లేకపోవడం, అక్కడ ఖైదీలపై సాగు తున్న దౌర్జన్యంచూసి, అనుభవించి ఆశయాలు బలపడ్డాయేగానీ, శారీరకారోగ్యం పూర్తిగా దెబ్బతింది.

జెయిలునుంచి విడుదలయాక ఎక్కడికి వెళ్ళాలో, ఏం చెయ్యాలో యేమీ అర్థం కాలేదు. చేతిలో జీవమున్న కాగితాలేమీ లేవు.

మహోధృతంగా సాగిన మహోద్యమం, తెలియకచేసిన కొన్నితప్పులవల్ల, ఆవేశంవల్ల, నీరుగారి నిర్వీర్యమై పోయింది. ఎవరు ఎక్క డున్నారో ఎవరికీ తెలీదు.

ఆ స్థితిలో ఈ ఊరువచ్చాను. ఇక్కడ నా మిత్రుడు ఒకడు వుండాలి. కానీ అతనూ ఎక్కడికో వెళ్ళిపోయాడు. ఊర్లో తిరుగు తున్న నన్నూ, నా ఆకారాన్నిచూసి అందరూ పిచ్చిదనుకొన్నారు. జాలి చూపించారు.

నాకూ కొంతకాలం యిలా గడపాలని అని పించింది. ఇదీ నా సంక్షిప్త కథ.

* * *

"ఎందు కేడుస్తున్నావ్?" అంది నా దగ్గరగా వచ్చి కళ్ళనీళ్ళు తుడుస్తూ.

"నీ జీవితం పాడవడానికి కారణం సాహి త్యమా" ప్రశ్నించాను.

"కాదు, ఎన్నటికీ కాదు. సాహిత్యాన్ని అన్వయించుకోవడంలో నేను పొరబడ్డాను. తప్పటడుగు వేశాను. కానీ నా జీవితం ఏమీ పాడుకాలేదు. ప్రజలకై మరణించడం హిమా లయంకన్నా గొప్పదన్నాడో మహానాయకుడు. నేను ఆ దారిలో వెళ్ళాను. నేను కాకున్నా, నేడు కాకున్నా రేపు మరెవరో ఈ విశ్వాన్ని తప్పక ఆ గమ్యం చేరుస్తారు" అంది.

ఆమె ముఖంలోకి చూశాను. లాలనగా నన్ను చూస్తూ నవ్వుతూ నా కన్నీళ్ళు తుడిచి "నీవు చేయవలసింది. సానుభూతి చూపడం. కన్నీళ్ళు కార్చడం కాదు. ఒక్కో అశ్రు కణాన్ని ఒక్కో అగ్నిబాణంచేసి చీకటిపై యుద్ధం ప్రకటించు. చలించే గుండె కరగని ఆయుధాలగని. అదిగో సమర రంగంలో విజయ సవనానికి ఆయత్తపడాలని ఎదురు చూస్తున్నా రందరూ. కవితా గాండీవంతో చైతన్య బాణవర్షాన్ని, ఈ సమాజపు పుళ్ళపై ప్రయోగించు. చావు బతుకుల్లోవున్న సింహాన్ని కాపాడుకోవలసిన బాధ్యతమీదే" అందామె ఆవేశంతో ఊగిపోతూ గీత బోధిస్తున్నదానిలా.

ఆ క్షణంలో ఆమె నాకు తల్లిగా, చెల్లిగా, ప్రేయసిగా, దేవతగా అనిపించి కౌగిలించు కొన్నాను.

బిడ్డను లాలించే తల్లిలా ఆమె నా వీపు నిమురుతూ "మానవతా విలువలేని ఈ డబ్బు వ్యవస్థలో నిజాలు గుర్తించు. మరో ప్రపంచపు మహాప్రస్థానానికి సిద్ధంకా" అంటూ నన్ను వదలి సుడిగాలిలా వీధిలోకి వెళ్ళి చీకట్లో మాయమైంది.

ఆ అనుభూతినుంచి, ఆ అనుభవంనుంచి తేరుకున్నాక కానీ నాకు అర్థంకాలేదు

"మంటల్లో మాడక నిలిచిన మల్లెలు ఆశయాలనీ. కలువలలోన విచ్చిన కత్తుల రేకులు అద్దంకులనీ." ☐

# అడ్డుగోడలు అంతరించాలి

మనిషికీ మనిషికీ మధ్య కులం, వర్గం అనే అడ్డుగోడలు ఉన్నంతకాలం సమసమాజాన్ని నిర్మించడం సాధ్యం కాదు.

ఈ విషయాన్ని గుర్తించిన మన ప్రణాళికావేత్తలు, పరిపాలకులు మన రాష్ట్రంలో హరిజన సంక్షేమానికి ఎల్లప్పుడూ అత్యధిక ప్రాధాన్యం ఇస్తూ వచ్చారు. 1978-79 సంవత్సరపు బడ్జెటులో ఈ రంగానికి ఇతోధిక నిధులు రూ. 690 లక్షలు కేటాయించారు.

ఇందులో రూ. 60/-లక్షలు ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు కులాల సహకార ఆర్థిక కార్పొరేషన్‌కు యిస్తారు. ఆర్థిక కార్యక్రమాల అమలుకు బ్యాంకులనుంచి రుణాలుపొందడానికి వీలుగా తమ సభ్యులకు ఈ మొత్తాలను పెట్టుబడిగా ఈ కార్పొరేషన్ అందజేస్తుంది.

1, 2 తరగతులలో ప్రవేశం లభించిన షెడ్యూలు కులాలకు చెందిన బాలలకు స్కాలర్‌షిప్పులు మంజూరు చేయడానికి రూ. 75 లక్షలు కేటాయించారు.

గాంధీజీ హరిజనుల విషయంలో కన్నకలలు ఈ విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఫలించనున్నాయి.

ఈ సంక్షేమ కార్యక్రమాలను చురుకుగా అమలు పర్చడం ద్వారా అడ్డుగోడలను అంతరింపజేద్దాం.

---

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.
24/78-79






ఇంటి గుమ్మాన్ని చూస్తే ఇల్లాల్ని చూడ నక్కర్లేదనడంలో ఎంత సబువుందో తెలియదు కాని, పేరునిబట్టి మనిషి ఆకారాన్ని చూసి గుణగణాల్ని అంచనా వెయ్యడంలాంటి ఒద్ది పొరబాటు మరోహటుండబోదు

రామచంద్రం సరిగ్గా ఇటువంటి కోవకే చెందినవాడు

తండ్రిపోగానే, రాసిన విల్లుని మాయచేసి దొంగ విల్లుని సృష్టించాడు తమ్ముళ్ళూ, తల్లీ నెత్తీ నోరూ బాదుకున్నారు. "ఎందుకలా గొంతు చించుకోడం? ఇది మీ కెంత వింతగా వుందో, బాధగావుందో నాకూ అలానేవుంది. నా తమ్ముళ్ళ నెత్తిమీద శరగోపం పెట్టి, వాళ్ళకీ, నీకూ, కడుపుకోత కలిగించే దుర్మార్గుణ్ణికాను!" అంటూ విల్లుని చింపి పారేయించి, నలుగురి ఎదుటా పిత్రార్జితాన్ని సమానంగా వాటావేయించాడు. ఆ దెబ్బతో ఇంటా బయటా రామచంద్రం రామచంద్రమూర్తే అయిపోయాడు. అసలు తండ్రి రాసిన విల్లులో తనకి ఎగనామం పెట్టబడిన సంగతి ఎవరికీ తెలుసుకనక! రామచంద్రం తండ్రి అలాటి విల్లు రాయడం వెనక ఓ చిదంబర రహస్యం ఉంది. రామచంద్రం తండ్రి, సానివాడ సరసుల్లో ముఖ్యుడు. తండ్రి గుణాలు అబ్బిన రామచంద్రం సానివాడ గాలి సోకడంతో అటువైపు అడుగు వేశాడు. చాలా కాలంవరకూ ఇద్దరూ ఒకే [illegible]టి చిలకతో కులుకుతున్న సంగతి ఇద్దరికీ తెలియ లేదు. ముసురుపట్టిన ఓరోజు ఆసుర సంధ్య వేళ ఒకే గుమ్మంలో ఒకరి కొకరు ఎదురు పడ్డంతో, ఆ ఇంటి గువ్వకి వీళ్ళిద్దర్నుంచీ రాబడీ, రామచంద్రానికి తండ్రి విల్లులో స్థానమూ పోయాయి!

పొలం పన్ల కొచ్చే మాలపడుచు మాణిక్యాన్ని మాయమాటలుచెప్పి మనసు దోచు కొన్నాడు రామచంద్రం వయసులో ఉన్న పిల్ల మనసొక్కటే యిచ్చి కూర్చోకుండా, మరో అడుగు ముందుకు వెయ్యడంతో కాలు జారడం, కడుపు నిండడం జరిగాయి మాణిక్యం తండ్రి వ్యవహారాన్ని రచ్చకీడ్చకుండా, నేరేడు




చెట్టు మాటున రామచంద్రాన్ని నిలదీసి బెదిరించాడు. రామచంద్రం మాణిక్యం మెళ్ళో తాళికట్టించే బాధ్యతీసుకొన్నాడు కాని, తాళి కట్టడానికి మట్టుకు ఒప్పుకోలేదు. అయిదొందలు పుచ్చుకొని,, పదిరూపాయల నాటు మందులో కూతుర్ని మంచి దారిలోపెట్టి, మిగిలిందాంతో తప్ప తాగేశాడు మాణిక్యం తండ్రి. శివాలయం జంక్షన్లో కార్తీక పౌర్ణమినాడు జరిగే బాణా సంచా పందేల్లో జట్కాబండి స్టాండ్ వాళ్ళనీ, సైకిల్ రిక్షా స్టాండ్ వాళ్ళనీ, ఒకళ్ళకి తెలియకుండా మరొకళ్ళని రామచంద్రం ఉసిగొల్పడంతో, వాళ్ళు తారాజువ్వల్నీ వెలక్కాయల్నీ వెలిగించడం మాని కర్రలతో కలియబడ్డారు. ఉప్పు పొట్లాం తిప్పడంలో ఉద్దండుడైన నాగరాజు కర్రసాము చెయ్యడంతో, అవతలి వాళ్ళకి దెబ్బలు బాగానే తగిలాయి. పోలీసులొచ్చి అందర్నీ కటకటాల వెనక్కితోసి పారేశారు. మర్నాటి సాయంత్రానికల్లా అందరూ బయటకొచ్చేసినా, నాగరాజు మట్టుకు రాలేకపోయాడు. ధైర్యం చెదిరి, నాగరాజు ఆశ వదులుకొని కూర్చున్నప్పుడు, రామచంద్రం రంగంలో ప్రవేశించి, నాలుగో రోజుకల్లా నాగరాజుని విడుదల చేయించి, రెండు పార్టీలకీ సంధిచేసి, కేసుని కొట్టించేశాడు. మాణిక్యం మెళ్ళో తాళి కట్టి నాగరాజు రామచంద్రం ఋణం తీర్చుకొన్నాడు.

కొండకాపు నాగరాజుకీ, మూలపడుచు మాణిక్యానికీ దగ్గరుండి పెళ్ళి చేయించిన రామచంద్రం రామచంద్రమూర్తే అయ్యాడు.

వరదల్లో కొట్టుకొచ్చే చెట్లపాట రామచంద్రం ఎప్పుడూ చెయ్యిజారి పోనివ్వలేదు. బలగాన్ని చదివించప్పుడు లేకుండా అడవుల్లోకి పంపించి, నీళ్ళు చొచ్చుకొచ్చిన మేరకు మంచి గంధం చెట్లని కూకటి వేళ్ళతోసహా పెళ్ళగించి నదిలో తోసిపారేయించి, పదిమైళ్ళు దిగువగా నలుగురెదుగురిగుండా పాట హక్కుదారుడిగా చెట్లని ఒడ్డు కీడ్పించేవాడు. వంట చెరుకుకి పనికొచ్చే చెట్లని పనివాళ్ళకి దానంచేసి, అసలు సరుకుని అమ్మి పాటకు వందరెట్లులాభాలు చేసుకొని, విస్తారంగా మూలధనం పెంచేసుకొన్నాడు.

దొంగ రవాణా విదేశీ వస్తువుల వ్యాపా

రాన్నీ ఎల్లమందు వ్యాపారాన్నీ హస్తగతం చేసుకొని, రెండు మూడు జిల్లాల్లో వీటి సర్క్యులేషన్ పెంచేసి విపరీతంగా నల్లధనాన్ని కూడబెట్టాడు

పేపికి లోన్‌తీసుకొని, పొలంలో చాలా లోతైన రెండు బోరింగుల్ని దింపించాడు చుట్టుపక్కల పొలాల వాళ్ళ దగ్గర్నుంచి పండిన పంటలో, ఇరవైశాతం ధాన్యంరెట్టింపు ధరయిచ్చి కొని, తన కళ్ళంలో పోయించు కొని, మంచిపంట దిగుబడి చూపించేవాడు ధాన్య సేకరణకొచ్చే ప్రభుత్వాంగం, రూల్సు ప్రకారం సేకరించవలసినంత ధాన్యంకొని, గవర్నమెంటు రేటుప్రకారం డబ్బిచ్చిపోయేది మిగిలిన ధాన్యాన్ని మార్కెట్ రేట్లకమ్మి, ఇటు ప్రజలకీ, అటు ప్రభుత్వానికీ మంచివాడై పోయాడు కొంత నల్లధనం తెల్లగా మారి పోయేదిలా

ఎలమానిన బంధువుల్లో ఒకరికి రెండు లక్షలు లాటరీలోవస్తే ఆ టిక్కెట్టుని మూడు లక్షలిచ్చి కొనుక్కొని తను వెళ్ళి లాటరీ డబ్బుని అందుకొన్నాడు కట్టవలసిన పన్నులు కట్టి పారేసి మిగిలిన డబ్బు ధైర్యంగా బేంక్‌లో వేసుకొన్నాడు

ఎనభై వేలు ఖర్చు చూపించి కట్టించిన బంగాళాకో లక్ష ఎనభై వేలకు పైగా డబ్బు గుమ్మరించాడు.

మార్కుల వేటలో, ఉద్యోగాల వేటలో, లైసెన్సులు సంపాదించడంలో అసమర్థుల కండగా నిలిచి, ప్రజల్లో చాలా మంచి వాడై పోయాడు

కొడుకులూ, కూతుళ్ళూ అందరూ జీవితాల్లో సుఖంగా స్థిరపడ్డ తర్వాత, అనాధ శరణాలయానికి, హైస్కూలుకి ధారాళంగా విరాళాలిచ్చి, లోకానికి తెలుపుగా చూపించిన నల్లటి జీవితం నుంచి నిష్క్రమించి విశ్రాంతి తీసుకొన్నాడు

రామచంద్రాన్ని అంటిపెట్టుకొన్న ఒకే ఒక్క దుర్గుణం ఏమిటంటే, చచ్చేవరకూ నెరిసిన తలకీ, మీసాలకీ రంగు వేసుకోవడం. ఈ ఒక్క తెలుపునీ లోకానికి నలుపుగా చూపించాడు. ☐

# బలహీన వర్గాల్లో చిగురించిన కొత్త ఆశలు

ఆంధ్రప్రదేశ్ లో బలహీన వర్గాల ప్రజలలో కొత్త ఆశలు చిగురిస్తున్నాయి. బంగారు భవిష్యత్తుకు వారు బాటలు వేస్తున్నారు. రాష్ట్ర జనాభాలో దాదాపు 53 శాతం మంది ఈ వర్గాలవారే. అందువల్ల రాష్ట్ర అభివృద్ధిలో వారి సమగ్ర సంక్షేమం ఎంతో కీలకమైనది.

ప్రతిచోట నిరుపేదలు గొప్ప మార్పును, పురోభివృద్ధిని ఆశిస్తున్నారు. ఈ వాస్తవాన్ని గుర్తించి 1978-79 బడ్జెటులో బలహీన వర్గాల సంక్షేమానికి రూ. 35 - కోట్లు కేటాయించారు. అంతేగాక రూ. 23 కోట్ల మేరకు ఆర్థిక సహాయ సంస్థల తోడ్పాటు పొందుతున్నారు.

ఈనాడు, అతి ముఖ్యమైన ఈ రంగులో ఎదురవుతున్న ఈ సవాలును సమర్థవంతంగా ఎదుర్కోడానికి పరిపాలనా యంత్రాంగం సమాయత్తం చేయబడింది. వారికి మన రాష్ట్రంలో ఉజ్వల భవిష్యత్తు వుందనడానికి ఎటువంటి సందేహమూ లేదు.

---

సమాచార, పౌరసంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

26/78-79

## సీరియల్




డాక్టర్ దగ్గరకి వెళ్ళాలనే ధ్యాసేలేదు. జ్వరం నాలుగు రోజుల్లో తగ్గింది కాని కొద్దిగా నీరసంగా అనిపించింది. ఆ రోజు, మర్నాడు పాలు ఎక్కువగా తాగాడు సత్యమూర్తి.

బెనారస్ హిందూ విశ్వవిద్యాలయానికి వెళ్ళే దారిలోవున్న దుర్గ ఆలయాలకి వెళ్ళాడు. కాశీలోని అనేక ఆలయానికి వెళ్ళాడు. అన్నిటిలోకి అదే విశాలంగా వుందనిపించింది సత్యమూర్తికి. ఎదురుగా పెద్ద టేంక్ వుంది. చాలా కోతులున్నాయి గుడి ఆవరణలో. వరసగా రెండు రోజులు వెళ్ళి, ఓ రోజు దుర్గ గుడిలో, మర్నాడు దగ్గరలోనేవున్న తులసి మానసమందిరంలోని చలువరాతి గోడలమీద వ్రాయబడ్డ రామాయణం చదువుతూ గడిపేసాడు.

భరతమాత ఆలయం, సంస్కృతం బోధించే విశ్వవిద్యాలయం అనేక జైన్ ఆలయాలు దర్శించాడు.

సారనాథ్‌లోని జింకపార్క్, తామర కొలను, బోధివృక్షం (బుద్ధుడు జ్ఞానం పొందిన బోధివృక్షం మొక్కని అశోకుని కూతురు సంఘమిత్ర సిలోన్ తీసుకువెళ్ళి పాతిపెట్టగా, పెరిగి పెద్దదయిన ఆ వృక్షం మొక్కలు మూడిటిని తిరిగి భారతదేశం తీసుకువచ్చి ధర్మపాల సారనాథ్‌లో నాటాడు.) ధమక్‌స్థూప, లైబ్రరీ,

మ్యూజియం, శిధిలాలు మొదలయినవి చూసాడు. మ్యూజియంలోని మూడుతలల సింహం చూసాడు. భారతప్రభుత్వం తన చిహ్నంగా స్వీకరించిన ఆ చెక్కడం అశోకుడి కాలంలోది.

కాశీలో సత్యమూర్తి గంగానదిలో ఆ రోజు స్నానంచేసి వినమ్రంగా పలికాడు రెండుచేతులూ జోడించి.

"తల్లీ నువ్వు జీవంలేని పెద్దనదివో లేక నిజంగా దేవతవో తెలియదు కాని నీ నదిలో ఇదే ఆఖరి స్నానం. ఈ జన్మలో మళ్ళీ నిన్ను చూడలేను బహుశ. మరు జన్మ అంటూ నిజంగా వుంటే మళ్ళీ జన్మలో నిన్ను చూసేభాగ్యం కలిగించకు. ఎందుకంటే మళ్ళీ జన్మవద్దు ఆ పర మాత్మలో ఐక్యం అయే వరం ప్రసా దించు."

సత్యమూర్తి గంగానది నుంచి సరాసరి కాశీలోని ప్రభుత్వ వైద్యశాలకి వెళ్ళాడు.

సరాసరి ఓ డాక్టర్ దగ్గరకి వెళ్ళాడు.

"ఏం కావాలి? చీటీలప్రకారం రావాలి నా దగ్గరకి" కసురుతూ హిందీలో చెప్పాడు డాక్టర్.

సత్యమూర్తి చెప్పాడు ఇంగ్లీషులో.

"రక్తదానం చేయడానికి వచ్చాను."

"అమ్ముతావా?"

"దానం అన్నాను."

డాక్టర్ సత్యమూర్తి వంక తేరిపార చూసి ఓ కాంపౌండర్‌ని పిలిచి చెప్పాడు.

"బ్లడ్‌బేంక్‌కి తీసుకెళ్ళు ఇతన్ని."

సత్యమూర్తి కుడిచేతి వేలిలోంచి కొన్ని రక్తపుబొట్లు తీసుకుని మైక్రో స్కోప్‌లో పరిశీలించాడు బ్లడ్‌బ్యాంక్ గదిలోని డాక్టర్. తర్వాత బ్లడ్‌గ్రూప్ పరీక్షించాడు. తర్వాత ఫారం యిచ్చి దాన్ని నింపమని కోరాడు.

గోడవారవున్న ఓ పరుపు పరచినబల్ల మీద పడుకోమని ప్రక్కనే ఖాళీ బ్లడ్ బాటిల్‌వున్న స్టాండ్ అమర్చాడు కాంపౌండర్. సత్యమూర్తి బ్లడ్‌ప్రెషర్ చెక్‌చేసాడు.

ముంజేతిమీది పైభాగాన్ని స్పిరిట్‌లో ముంచిన దూదితో శుభ్రపరచి, రబ్బరు గొట్టంతో చేతిని బిగించి, ఓ రక్తనాళంలో సూదిని గుచ్చి దానిమీద టేప్ అతికిం కించారు కదలకుండా.

పదినిముషాల్లో రక్తం సూదిద్వారా ఓ రబ్బరు ట్యూబ్‌లోంచి ఆ బాటిల్‌లోకి వెళ్ళి నిండింది అది.

"ఇంకా తీసుకోండి" చెప్పాడు సత్యమూర్తి ఇంగ్లీషులో.

డాక్టర్ తల అడ్డంగా వూపుతూ నవ్వాడు. కాంపౌండర్ చెప్పాడు.

"మూడువందల సి. సి. ని మించి తీసుకోము."

"ఫర్వాలేదు. ఇంకో వంద. నాకేం కాదు."

"ఊహు."

తర్వాత వేడిపాలు, బ్రెడ్‌ముక్కలు ఇచ్చారు.

"కాసేపు పడుకోండి కావాలంటే" చెప్పాడు డాక్టర్.

"నీరసంగా లేదు."

"ఓ పది నిముషాలు ఆగితే సూపరిం టెండెంట్ సంతకం తీసుకుని డొనేషన్ కార్డు ఇస్తాను. కనీసం అంత దాకానయినా విశ్రాంతి తీసుకోండి" కాంపౌండర్ చెప్పాడు.

"ఈలోపల మీకు చక్కటి వస్తువులు చూపిస్తాను రండి. ఎప్పుడో కాని రక్తం డొనేట్ చేయడానికిరారు. సాధారణంగా అమ్మడానికే వస్తారు ఎక్కువ మంది. రక్తదానం అంటే ఓ ప్రాణాన్ని కాపాడటమే. ప్రాణదానం అని చెప్పవచ్చుయిది "

తన గదిలోకి తీసుకెళ్ళాడు డాక్టర్.

"త్వరలో ఓ మెడికల్ ఎగ్జిబిషన్ కండక్ట్ చేయబోతున్నాం. దానికోసం ఇది తయారుచేసాను."

మూడు చెక్కబీరువాలవంక చూపించి చెప్పాడు.

"ఇందులో మీ జీవితంలోని మూడు దశలు, అంటే భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలు కనిపిస్తాయి. అది కాదని మీరు అంగీకరించలేరు కూడా."

సత్యమూర్తి మొహంలో ఎలాంటి ఆసక్తి లేదు.

డాక్టర్ మొదటి బీరువా దగ్గర ఆగి చెప్పాడు నవ్వుతూ.

"తలుపు తెరచి చూడండి. మీ జీవితంలో జరిగిన ఓ ముఖ్యసంఘటన, సన్నివేశం కనబడుతుంది. దాన్ని కాదనగలిగితే అయిదు రూపాయలు యిస్తాను."

సత్యమూర్తి ఆ బీరువా తలుపులు తెరిచాడు.

లోపల బీరువానించి కొక్కేనికి వేలాడుతోంది ఓ పెద్దపటం. దాంట్లో తొమ్మిది నెలను నిండిన పసిపాప ఫోటో వుంది. దానికింద 'ఇది మీ భూతకాలం' అని రాసివుంది.

డాక్టర్ సత్యమూర్తితో చెప్పాడు రెండో బీరువా తలుపుతెరిచి.

"ఇది మీ ఇప్పటి జాతకం."

ఆ బీరువాముందు ఆగిచూసాడు. లోపల వ్రేలాడుతున్న నిలువెత్తు అద్దంలో సత్యమూర్తికి తన ప్రతిబింబం కనబడింది. చాలా రోజుల తర్వాత సత్యమూర్తి తన ప్రతిబింబాన్ని అద్దంలో చూసుకున్నాడు. వెంటనే గుర్తుపట్టలేదు. పెరిగిన గడ్డం, గుంటలుపడ్డ కళ్ళు, లోతుకుపోయిన చెంపలు, పెరిగినజుట్టు. అద్దంక్రింద వ్రాసివుంది.

"ఇది మీ ఈ క్షణంతాలూకు నిజం."

"ఒప్పుకుంటారా?" నవ్వాడు.

సత్యమూర్తి మూడో బీరువా తలుపు తెరిచాడు.

లోపల ఓ వృద్ధుడి బొమ్మవుంది.

దాని క్రింద "ఇది మీ భవిష్యత్తు" అని వ్రాసివుంది.

"ఒప్పుకోను."

మనసులోనే అనుకున్నాడు సత్యమూర్తి.

"రండి. కూర్చుందాం" అన్నాడు డాక్టర్ తెలుగులో.

సత్యమూర్తి ఆశ్చర్యపడతాడనుకున్నాడు డాక్టర్ తను తెలుగులో మాట్లాడగానే.

సత్యమూర్తి మొహంలో ఎలాంటి భావంలేదు. మౌనంగా వెళ్ళి డాక్టర్ బల్లముందు కూర్చున్నాడు ఎదురుగా.

"మీది ఏ వూరు? మీరు తెలుగువాళ్ళని ఎలా కనుక్కున్నానో చెప్పమంటారా?"

తల అడ్డంగా వూపాడు సత్యమూర్తి డాక్టర్ వెనక గోడకి వ్రేలాడుతున్న మనిషి శరీరం తాలూకు ఛార్ట్‌ని చూస్తూ. చర్మం లేకుండా మనిషి శరీరం బొమ్మలో

అన్ని అవయవవాలు స్పష్టంగా కనబడు తున్నాయి అందులో.

"మాది రాజమండ్రి దగ్గర ఓ పల్లె టూరు. ఉద్యోగరీత్యా ఇంత దూరం వచ్చాను. నా తమ్ముడు హైద్రాబాద్‌లోనే వున్నాడు ..."

తెలుగువాళ్ళు కనబడితే తనివి తీరా తెలుగులో మాట్లాడతాడు ఆయన. కాశీకి వచ్చే తెలుగువాళ్ళలో ఆయనకి పరిచయం వున్నవాళ్లు అరుదుగా వస్తూంటారు చూడ టానికి. ఆ రోజు ఎంతో ఆనందంగా వుంటుంది ఆయనకి.

"వాడు అయిదునెలల క్రితం వచ్చి వెళ్ళాడు. ఇంజనీరింగ్ కోర్సు చదివాడు. నిజానికి నన్ను ఇంజనీర్, వాడిని డాక్టర్ చేద్దామనుకున్నాడు మా నాన్నగారు. కాని నాకు సైన్స్‌మీద, వాడికి లెక్కలమీద మొదటినుంచీ ఉత్సాహంగా ఉండేది. దాంతో వాడు ఎలక్ట్రికల్ ఇంజనీర్ అయాడు. నేను పేథాలజిస్టుని అయ్యాను. చాలా హుషారుగా వుంటాడు వాడు. మారేడ్‌పల్లిలో వుంటాడు సికింద్రా బాద్‌లో. నా పేరు ధనవంతరావు. మా తమ్ముడి పేరు సుగుణరావు. మా పేర్లు కొద్దిగా గమ్మత్తుగానే వుంటాయి. మా నాన్నగారి పేరు అహోబలరావుగారు. మీ పేరు?"

కాంపౌండర్ డొనేషన్ కార్డ్ తీసుకు వచ్చి ఇచ్చాడు సత్యమూర్తికి. దానివంక చూడకుండా అందుకుని డాక్టర్ టేబిల్ మీద పడేసి లేచాడు సత్యమూర్తి.

సత్యమూర్తివంక విచిత్రంగా చూసి అడిగాడు డాక్టర్ హఠాత్తుగా.

"కొంపతీసి, మీరు తెలుగువాళ్ళు కాదా? మీకు తెలుగురాదా? ఆర్ యు ఫ్రమ్ ఆంధ్రా? డు యూ స్పీక్ తెలుగు?"

సత్యమూర్తి వెనక్కి తిరిగి ఆ మూడో బీరువా వంక వేలితో చూపించి చెప్పాడు తన ఆలోచలలోంచి తేరు కుంటూ.

"దాంట్లోని బొమ్మ అందరికీ వర్తిం చదు. అందులో వుండాల్సిన సరయినది ఇంకోటి వుంది."

తెలుగులో చెప్పాడు.

"ఏమిటది?"

"అస్థిపంజరం .అది అది అందరి భవిష్యత్తుకూ వర్తిస్తుంది."

సత్యమూర్తి పెద్ద పెద్ద అంగలు వేసు కుంటూ బయటకి నడిచాడు. అతని వంక ఆశ్చర్యంగా చూస్తున్న డాక్టర్‌ని అడి గాడు కాంపౌండర్.

"బాత్ క్యా హై సాబ్?"

"అదే తెలియటం లేదు" హిందీలో చెప్పాడు.

వంగి టేబిల్‌మీద సత్యమూర్తి వది లిన డొనేషన్ కార్డ్‌లో టైప్ చేయబడ్డ పేరు, వయసు, నివసించే ప్రదేశం ఎదు రుగా వూరిపేరు చూసాడు డాక్టర్.

"సందేహం లేదు. ఆ మధ్య ఇతని ఫోటో తెలుగు పేపర్లో చూసాను కన బడుటలేదు అన్న శీర్షిక కింద" చెప్పాడు కాంపౌండర్‌కి.

ఇద్దరూ బయటకి వచ్చి చాలాసేపు వెదికారు. కాని సత్యమూర్తి అదృశ్య మయాడు అప్పటికే.

## 19

సత్యమూర్తి కాశీనుంచి బస్సులో పెద్ద రైల్వేజంక్షన్ మొగల్ సరాయ్‌కి,




అక్కడ నుంచి రైల్లో అలహాబాద్ చేరుకున్నాడు. సరాసరి త్రివేణీ సంగమం వెళ్ళి స్నానం చేశాడు. మళ్ళీ స్టేషన్‌కి వచ్చేసాడు. మధ్యాహ్నం మూడు అయిదుకి వచ్చింది కాశీనుంచి బొంబాయివెళ్ళే ఎక్స్‌ప్రెస్. దాంట్లో సత్యమూర్తి టిక్కెట్ కొనుక్కుని ఎక్కాడు. కిటికీలోంచి అస్తమిస్తున్న సూర్యుడిని, పల్లె వాళ్ళని చూస్తూ కూర్చున్నాడు. చీకటి పడ్డ తర్వాత కళ్ళు మూసుకుని సీటుకి ఆనుకున్నాడు.

సత్యమూర్తి 'రేపు ఏం చేయాలి?' అన్న విషయం గురించి ఆలోచించటం లేదు. 'రేపు ఎలా?' అన్న విషయంఅసలే ఆలోచించడంలేదు.

రాత్రి ఎనిమిదీ నలభైకి రైలు మధ్యప్రదేశ్‌లోని సత్నా జిల్లా హెడ్‌క్వార్టర్స్ అయిన సత్నా రైల్వేస్టేషన్‌లో ఆగింది.

సత్యమూర్తి కిందకి దిగాడు. 'ఖజురహో వెళ్ళడానికి ఇక్కడే దిగాలి' అనే సైన్‌బోర్డు ఇంగ్లీష్‌లో వ్రేలాడుతోంది ఓ చోట.

సత్యమూర్తి ఓ కప్పు పాలు తాగి స్టేషన్ బయట రిజర్వేషన్ కౌంటర్స్ ముందున్న ఓ ఖాళీబెంచి ప్రక్కన నేల మీద పడుకున్నాడు. రెండు అరచేతులూ తల కింద దిండులా పెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు.

రక్తదానం చేయటంవల్ల, సరయిన ఆహారం తీసుకోకపోవటంవల్ల ఎంతో అలసటగా వుంది. కాళ్ళు పీకుతున్నాయి. ఈ లోకంలో ఎలాంటి జంజాటాలు లేని, పెట్టుకోని సత్యమూర్తికి గంట తర్వాత నిద్ర పట్టింది.

రాత్రి చాలాసార్లు మెలకువ వచ్చింది వచ్చే పోయే రైల్లోంచి దిగివచ్చే జనం చేసే కోలాహలంవల్ల.

గంగానది.

ముక్కు మూసుకుని మునిగాడు. లోపల నుంచి వెంటనే లేవలేదు సత్య

మూర్తి. నీళ్ళల్లో ఎదురుగా చేతిలో త్రిశూలంతో, నుదుట ఎర్రటి బొట్టుతో, పసుపు పచ్చటి చీరలో; ధగధగా మెరిసే కిరీటంతో కనుల ముందు సాక్షాత్కారించింది గంగాభవాని.

"నీ కొడుకు ఇప్పుడు ఎక్కడ ఎలా అవస్థలు పడుతున్నాడో తెలుసా?" రౌద్రంగా అడిగింది శూలం వూపుతూ.

మౌనంగా రెండు చేతులూ జోడించాడు సత్యమూర్తి.

"మాట్లాడు."

సత్యమూర్తి పెదవి విప్పలేదు.

మరుక్షణం ఒడ్డున వున్నాడు. నీళ్ళ వంక చూసాడు. ప్రవహిస్తున్నాయి. ఒక్కసారిగా వెండి తగరంలా మెరుస్తున్న నీళ్ళపైభాగం నురగలు కక్కుతూ హోరు పెడుతూ అతి పెద్ద కౌగితంలా పైకి లేచాయి. మీదకి వచ్చేస్తోంది నీటి కెరటం. ఆకాశం కనబడనంత ఎత్తుగా వుంది గోడలా లేచిన ఆ కెరటం. వాటిలో సొర చేపలు, నీటి పాములు, మొసళ్ళు కనబడుతున్నాయి సత్యమూర్తిని మింగేసేలా చూస్తూ.

"అమ్మా!"

గట్టిగా అరుస్తూ లేచి కూర్చున్నాడు సత్యమూర్తి రెండు మోచేతులూ మొహానికి అడ్డంగా పెట్టుకుని.

అప్పుడే వచ్చి ఆగిన రైలింజన్ విడుస్తున్న ఆవిరి చప్పుడు హోరులా వినిపిస్తోంది సత్యమూర్తికి. దూరంగా పడుకున్న ఒకరిద్దరు సత్యమూర్తి వంక చూసారు. చేత్తో మొహానికి పట్టిన చెమటని తుడుచుకున్నాడు.

"ఏమైంది? కల వచ్చిందా?" అడిగాడు ముసలాయన హిందీలో.

గంగభవాని కలలో తనకి శ్రీవల్లి రూపంలో ప్రత్యక్షం అయింది. లేదా శ్రీవల్లి దేవతలకుండే ఆభరణాలతో కలలో కనబడి తను చేసిన పనికి ఆగ్రహం చూపించింది.

అంటే శ్రీవల్లి మరణించిందా? ఆమె ఆత్మ తనని అనుసరిస్తోందా?

"జవాబు చెప్పవే?" అడిగాడు మళ్ళీ ఆ ముసలాయన.

సత్యమూర్తికి చాలాసేపు నిద్ర పట్టలేదు మళ్ళీ. నిద్ర పట్టిన అయిదు నిముషాలకే ఎవరో డొక్కలో తన్నారు. బూటు దెబ్బ బలంగా తగిలింది. లేచి కూర్చున్నాడు నెమ్మదిగా, పళ్ళు బిగబట్టి బాధని ఓర్చుకుంటూ.

"ఇక్కడేం చేస్తున్నావ్?" హిందీలో అడిగాడు. అతను కర్కశంగా చేతిలోని లాఠీ తిప్పుతూ.

జవాబు చెప్పలేదు సత్యమూర్తి.

"ఏ వూరు?"

మౌనం.

లాఠీతో బలమంతా ఉపయోగించి కొట్టాడు సత్యమూర్తిని. నుదురు చిట్లి రక్తం కారసాగింది. సత్యమూర్తి బాధగా కళ్ళు మూసుకున్నాడు జవాబు చెప్పలేదు.

"లే. పేరు?"

"మూగవాడేమో?" ఖరీదయిన బట్టల్లో దూరంగా కూర్చున్న ఓ ప్రయాణీకుడు కొద్దిగా జాలిగా అన్నాడు ఇన్‌స్పెక్టర్‌తో.

ఓ సారి ఆ ప్రయాణీకుడి వంక తీవ్రంగా చూసి అడిగాడు.

"మీ పేరు? ఎక్కడికి?"

అతను బదులుచెప్పాడు.

"లే"

అన్నాడు లారీతో సత్యమూర్తి పాదం మీద కొట్టి.

హిందీ వచ్చు. సత్యమూర్తి లేచి నిలబడ్డాడు.

స్టేషన్ బయట ఆగివున్న పోలీస్ వేన్ లోకి ఎక్కించారు ఇద్దరు కాన్‌స్టబుల్స్ సత్యమూర్తిని. దూరంగా పడుకున్న వాళ్ళని మరో నలుగురయిదుగురు బిచ్చగాళ్ళు, పల్లెటూరి నుంచి వచ్చిన వాళ్ళనీ ఎక్కించారు వేన్‌లో.

తెల్లవారుఝామున వేన్ పోలీస్‌స్టేషన్ కాంపౌండ్‌లో ఆగింది. అందరినీ లోపలికి తీసుకెళ్ళారు.

సత్యమూర్తి జేబులు తణిఖీ చేసి అయిదు రూపాయల ఇరవై ఆరుపైసలు తీసుకున్నారు కాన్‌స్టబుల్స్. ఓ సెల్‌లో పడేసారు.

అరగంట తర్వాత దూరంగా ఓ సెల్‌లోంచి, 'నహీ, నహీ' అనే ఆడపిల్ల అరుపులు, ఇన్‌స్పెక్టర్ తాగిన కంఠం, ఏడుపు, పక్క సెల్‌లోంచి ఆ అమ్మాయి తాలూకు మొగవాళ్ళ ఆక్రందనలు, బూట్ల చప్పుడు, దెబ్బలచప్పుడు వినబడ్డాయి పావుగంటసేపు.

సత్యమూర్తి నిర్వికారంగా శూన్యంలోకి చూస్తూండిపోయాడు.

## 20

రెండురోజుల తర్వాత వదిలేసారు సత్యమూర్తిని నాలుగయిదు లారీదెబ్బలు కొట్టి మూగవాడనే వుద్దేశ్యంతో.

సత్యమూర్తి నుదుట గాయానికి పట్టీ వేసారు బయటకి పంపబోయే ముందు. గాయం లోతుగా అవకపోవడంవల్ల హాస్పిటల్‌కి పంపలేదు. అయినా బాధకి జివ్వుమంటోంది. నుదుట బలంగా తాడు బిగించి పట్టుకున్నట్లుగా వుంది.

సత్యమూర్తి తన చెప్పులని, చొక్కాని అమ్మేసాడు సత్నా మెయిన్ బజారులోని పాతవస్తువులు కొనే ఓ షాపులో. తొమ్మిది రూపాయల చిల్లర వచ్చింది.

పెన్ను అడిగి తీసుకుని, ఓ చిన్న కాగితం ముక్కమీద 'పన్నా' అనే పదం హిందీలో రాసి పేంట్ జేబులో వుంచుకున్నాడు దాన్ని. సరాసరి బస్ డిపోకి వచ్చాడు. ఓ బస్‌లో ఎక్కి కూర్చుని కండక్టర్‌కి ఆ కాగితంతోపాటు అయిదు రూపాయల కాగితం ఇచ్చాడు.

కండక్టర్ సత్యమూర్తి గడ్డం వంక చూసి టిక్కెట్ చింపి ఇచ్చి చిల్లర ఇచ్చాడు. వంద కిలోమీటర్లలోపు వుంది పన్నాగ్రామం. రెండున్నర గంటల్లో చేరుకుంది బస్, సాయంత్రం ఆరున్నరకి.

సత్యమూర్తి కొన్నిపదుల సంవత్సరాల క్రితం ఆ గ్రామం మహారాజు కట్టించిన గుడికి చేరుకున్నాడు గంట తర్వాత. చాలా పెద్ద గుడి అది. చలువరాతి పలకలు పొదిగిన గోడలు, అక్కడక్కడ పూర్వకాలపు తైలవర్ణచిత్ర పటాలు, వెండితో చేయబడ్డ తలుపులు, వజ్రాలతో పొదగబడ్డ ఈశ్వరుడి విగ్రహం. సత్యమూర్తి రాత్రి చాలాసేపు అయేదాకా ఆ గుడిలోనే గడిపాడు. తర్వాత బయటకి వెళ్ళి ఓ గ్లాసుడు పాలు తాగి మళ్ళీ వచ్చి గుడి ఆవరణలోని నూతిగట్టుమీద పేంట్ బనీను వుతికి ఓ బండరాయిమీద ఆరేసాడు. డ్రాయర్‌తోనే స్నానంచేసి తడి శరీరం గాలికి ఆరాక ఓ అరుగుమీద పడు

క్కున్నాడు. ఆయాసంతో రొప్పుతూండి పోయాడు చాలాసేపు. అలసటవల్ల, నీరసంవల్ల అర్ధరాత్రి దాటాకగాని నిద్ర పట్టలేదు.

సత్యమూర్తి అదృష్టవశాత్తు ఆలయం లోని పూజారి తలుపు తాళంవేసుకు వెళుతూ సత్యమూర్తిని చూడలేదు. చూస్తే బయటకి పంపించేసేవాడు.

సత్యమూర్తి మర్నాడు పుదయం పూజారి లేపేదాకా నిద్రలేవలేదు. నీరెండ మీదపడ్డా మెలకువ రాలేదు. హిందీలో గబగబా మాట్లాడాడు పూజారి.

సత్యమూర్తి లేచి నూతిదగ్గరకి వెళ్ళి మొహం కడుక్కున్నాడు చన్నీళ్ళు తోడు కుని. వెనకేవెళ్ళి పూజారి పోట్లాడ సాగాడు సత్యమూర్తి మీద, సత్యమూర్తి నిశ్శబ్దంగా ఎండిన పేంట్, బనీను తొడుక్కున్నాడు.

తర్వాత దేముడి మండపంలోకి వెళ్ళి మూడుసార్లు గంటకొట్టి, మూసివున్న గర్భగుడి తలుపులకి నమస్కారం చేసి బయటికి నడిచాడు.

పూజారి సత్యమూర్తి మౌనానికి గొణ గడం ఆపి తెల్లబోతూ చూసాడు. సత్య మూర్తి నెమ్మదిగా నడవసాగాడు.

పన్నాగ్రామంలోని దాదాపు అరడజను పెద్ద ఆలయాలన్నిటికీ వెళ్ళాడు. రైల్వే స్టేషన్ అయినా లేని అంత చిన్న గ్రామంలో ఖరీదయిన వజ్రాలు గల ఆభరణాలతో అంతపెద్ద ఆలయాలు వుంటాయన్న సంగతి సత్యమూర్తికి ఆశ్చర్యం కలిగించి వుండేది మామూలు పరిస్థితుల్లో అయితే. ప్రస్తుతం వున్న మానసిక స్థితిలో ఆ విషయాల గురించే ఆలోచించలేదు.

ఉదయం పన్నెండున్నరకి కృష్ణా లయంలోంచి బయటకి వచ్చాడు. బా వితంతువులు చాలామంది భజన చేస న్నారు.

లక్షాధికారులయిన అనేకమంది వజ్రా వ్యాపారస్థులుండే పన్నా గ్రామంను ట్రంక్ రోడ్ మీదకి వచ్చాడు. నెమ్మది నడవసాగాడు మండుటెండలో.

మూడు నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్న పన్నా డైమండ్ మైనింగ్ ప్రాజె కాలనీని దాటాడు. మరికొన్ని కిలోమీట నడిచాక వజ్రాలగనికి వెళ్ళే క్రాస్‌రో దాటాడు. మధ్యాహ్నం మూడున్న దాటింది అప్పటికే. రోడ్డుకి రెండువైపు చెట్లు వుండటంవల్ల చల్లగా వుంది.

రోడ్డుమీద అక్కడక్కడ రా వాహనాలకింద చచ్చిపడివున్న పాములు చెట్లమీదతిరిగే కొండముచ్చులు అరుదు కనబడే నెమళ్ళు కుందేళ్లు మొదలయి వాటివంక చూడటంలేదు సత్యమూ తల వంచుకుని నడవసాగాడు త గమ్యానికి.

మరికొన్ని కిలోమీటర్లు దాటాక ఘా రోడ్ వచ్చింది. ఎత్తయిన కొండచుట్ట వేయబడ్డ రోడ్డుమీద నడవసాగాడ రోడ్డుకి ఎడంవైపు చూస్తే లోతైన పె లోయ, ఆ లోయలో అరణ్యం, రోడ్డ రెండుప్రక్కలా టేకు ఇంకా ఇత వృక్షాలు, వాటిమీద పాకిన తీగల లతలు, దగ్గర దగ్గరగా పుట్టలు, పొదల

రోడ్డు పూర్తిగా కొండమీదకి చే కున్నాక ఒక్కసారి ఆగిచూసాడు. పచ్చ చెట్లతో ఎంతో ఆహ్లాదంగా కనిపించి

(ఏ)చిత్ర విజ్ఞానం



జపాన్‌లో ప్రతియింటా మడత విసనకర్ర ఒక ముఖ్యమైన వస్తువు. ప్రపంచంలో మరెక్కడా కనిపించని అందాల విసనకర్రలు జపాన్‌లో మనకు కన్నుల పండువు చేస్తాయి. జపాన్‌లోని ప్రతి స్త్రీ యీ విసనకర్రను తన అలంకరణ సాధనంగా వాడుకుంటుంది. హైయన్ కాలంలో (794-1185) యీ వస్తువు రూపొందించబడింది.

---

ప్రకృతి. ఆ ఘాట్ రోడ్ దాటాక, రెండో కొండమీద వెయబడ్డ మరో ఘాట్ రోడ్ వచ్చింది.

సత్యమూర్తి జాగ్రత్తగా చూస్తూ నడవసాగాడు. ఘాట్ రోడ్‌కి కుడివైపు ఎత్తయిన కొండ, ఎడమవైపు లోయ, అది దాటాక కుడివైపు కొద్దిదూరంలో కనబడ్డది విశాలమయినప్రదేశం. 'వే టూ పాండవా కేవ్స్' అని వ్రాసి వున్న బోర్డు. పక్కనే టాపుమీద పెట్టి బెడ్డింగు వున్న ఓ కారు ఆగివుంది. క్రిందకి మెట్లు కన బడ్డాయి. సత్యమూర్తి మొదటిమెట్టుమీద నుంచుని ఓసారి కిందకి చూసాడు ఎంతో కాలం తర్వాత మళ్ళీ.

అదో లోయ.

భారతదేశంలోని దాదాపు నడిబొడ్డులో వున్న మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని సత్నా జిల్లాలోని పన్నా తాలూకాకు పధ్నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్న ఓ లోయ అది. కొన్ని వందలమైళ్ళు విస్తరించుకుని వున్న వింధ్య పర్వతాల వరుసలో వున్న అనేక లోయల్లోని ఒక లోయ అది. పూర్వకాలంలో అనేకమంది యోగులకి ఆలవాలమైన ప్రదేశం.

పై మెట్టుమీద నుంచుని చూస్తే లోయ అడుగు భాగం కనపడదు వెంటనే. వంపులు తిరిగివున్న పురాతనమయిన కొండరాతి మెట్లమీదనుంచి కిందకి కొద్ది దూరం దిగితే కాని ఆ లోయ కనబడదు పూర్తిగా.

సత్యమూర్తి వెనక్కి తిరిగి ఓసారి కనుచూపుమేరలో కనబడినంత ప్రపంచాన్ని చూసేడు. యికమీదట తనకీ, ఆ ప్రపంచానికీ ఎట్టి బంధం సంబంధం వుండదు. ఆ ప్రపంచం దృష్టిలో తను బ్రతికేవుండడు అసలు.

జంతువులలాగా కాకుండా మానవుడికి మనస్సు భావనలు వుంటాయి. బాధ కలిగితే ఏడుస్తాడు. సంతోషం వస్తే నవ్వుతాడు. అది జంతువులకి సాధ్యంకాదు.

తలితండ్రులు లేని అనాథ.

అనారోగ్య పీడితుడయిన బాలుడు. ప్రేమంటే తెలియని జీవితంలోకి ఆశా జ్యోతిలా వచ్చి, తక్కువకాలమే అయినా ఎక్కువ వెలుగుని ప్రసాదించిన శ్రీవల్లి.

హఠాత్తుగా మాయమయి, మళ్ళీ తిరిగిరాని ఆమె మిగిల్చిన స్మృతులు.

తర్వాత ఎదుర్కొన్న కటిక చీకటి.

ఆ చీకటిలో ఎన్నటికీ ఆరని జ్యోతి లాంటి వైరాగ్యం వెలిగించిన మాణిక్య శాస్త్రిలు.

ఆ చీకటి తెరని అలాగే వుంచడానికి విఫల ప్రయత్నం చేసిన ప్రియంవద.

ఆ ఆరని జ్యోతి వెలుగులో, వైరాగ్యపు దృష్టితో ఎదుర్కొన్న ప్రాపంచిక సంఘటనలు.

క్షణంలో మాంసం ముద్దగా మారిన ముగ్ధ పద్మాలుగేళ్ళ ప్రవీణ. ఫలితంగా స్థిరంగా మనసులో నిలచిపోయిన స్మశాన వైరాగ్యం

ఈ లోకానికి తను భౌతికంగా చేయగలిగిన కొద్దిపాటి ఉపకారం-రక్తదానం.

మరోసారి స్మశాన వైరాగ్యాన్ని ఇంకా స్థిరం చేసిన, మనిషి భవిష్యత్తు చూపే మూడో బీరువాలోని అస్థిపంజరం తాలూకు జ్ఞాపకం.

స్వతంత్రం లేని యీ ప్రపంచంలో చేయని తప్పుకు విధించిన శిక్ష వెనుక అమానుషత్వం, పశుత్వముంది. అబల ఆక్రందన.

ఎక్కడుంది సుఖం?

ఎక్కడుంది శాంతి?

ఎక్కడుంది మానసికానందం?

సాఫీగా, ఒడిదుడుకులు లేకుండా జరిగే జీవన స్రవంతిలోనే వుంటుంది.

సత్యమూర్తి దీర్ఘంగా నిట్టూర్చాడు.

పడమటి దిక్కున అరుణ కాంతులు వెదజల్లుతూ సంధ్యారాగం ఆలపిస్తూ అస్తమిస్తున్న ఎర్రటి సూర్యబింబానికి రెండు చేతులూ జోడించి నమస్కారం పెట్టాడు.

తర్వాత నెమ్మదిగా ముందుకు కదిలి ఒక్కొక్క మెట్టే దిగసాగాడు కిందికి-ఆ లోయలోకి. కష్టాలనే జలపాతాల ధాటికి తగ్గి, వైరాగ్యమనే సాఫీగా ప్రవహించే నిండు నదిలా, తనకి జీవితంలో కావలసినది అక్కడ దొరుకుతుందనే నమ్మకంతో ఆ లోయలోకి ప్రవేశిస్తున్నాడు.

## 21

కొన్ని మెట్లు దిగాక ఎడంవైపు కనబడింది చిన్న జలపాతం. ఆ కొండల్లోని నీరు ధారగా కిందకి దూకి కింద లోయ అడుగు భాగంలోని పెద్ద సరస్సులోకి పడుతోంది. సత్యమూర్తి ఓ క్షణం ఆగి చూసాడు. లోయ ఇప్పుడు పూర్తిగా కనబడుతోంది.

లోయలో సగభాగంపైనే ఆక్రమించిన ఆ సరస్సు, మరోవైపు పెరిగిన మర్రిచెట్లు, వాటి ఊడలు, సరస్సులోకి లోయ రెండో భాగంలోంచి వర్షాకాలంలో వచ్చే నీటిదారి, ఆ దారి మధ్య అవతలి వైపుకు వెళ్ళడానికి పేర్చిన కొండరాళ్ళ వరస.

వాటిమీద నడిచి వస్తున్న రంగు రంగుల గౌనుల్లో వున్న ఇద్దరు సమవయస్కులయిన చిన్న పిల్లలు. పిల్లల వెనక ఓ దంపతుల జంట

సత్యమూర్తి కిందకి దాదాపు వంద అడుగులు దిగగానే ఎంతో చల్లగా వున్నట్లుగా అనిపించింది వాతావరణం.

పూర్తిగా కిందకి దిగాడు - కొండ అంచున లోయలోకి పేర్చబడ్డ కొండ రాళ్ళమీద.

సత్యమూర్తిని దూరంనుంచే చూసి భయంతో ఆగారు పిల్లలిద్దరూ. వెనక్కి తిరిగి తమ తల్లిదండ్రులు వస్తున్న




సంగతి రూఢి చేసుకుని అప్పుడు ధైర్యంగా చూసారు సత్యమూర్తి వంక.

సత్యమూర్తి వాళ్ళ ప్రక్కనుంచే వెళ్ళాడు. ఆ ఇద్దరూ ఆడపిల్లలు. కవల పిల్లలు. వాళ్ళ తండ్రి చేతిలో కెమేరా, తల్లి చేతిలో ఫ్లాస్క్, ప్లాస్టిక్ బుట్ట వున్నాయి.

సత్యమూర్తి లోయలో అవతలి వైపుకి వెళ్ళి ఆగి కుడివైపు చూసాడు. ఆ లోయ అక్కడ మధ్యకి చీలింది. రెండు పెద్ద కొండల మధ్యనుంచి దారి క్రమంగా సన్నగా చీలుతూ మాయమైంది. మిగతా మూడు ప్రక్కల దాదాపు వెయ్యి అడుగుల ఎత్తుగల వింధ్య పర్వతాలు గంభీరంగా నిల్చుని వున్నాయి.

సత్యమూర్తి లోయ ఎడంవైపు కొండకి ఆనుకుని వున్న గుహల వైపు కదిలాడు కొండ అంచు ప్రక్కనే. సన్నటి నీటిధార పడుతోంది కొండమీద నుంచి. ఆ నీరు సరస్సులో కలిసి పోతోంది. నిరంతరం ఆ నీటిధార పడుతున్న గుర్తుగా కొండమీద పైనుంచి కిందదాకా ఆకుపచ్చ రంగులో పేరుకుని వుంది మాలిన్యం.

అవే పాండవుల గుహలు.

పాండవా కేవ్స్.

కొన్ని వేల సంవత్సరాల పూర్వం పాండవులు అజ్ఞాతవాసం చేస్తున్న తరుణంలో కొంతకాలం రహస్యంగా వున్న ఈ లోయలోని గుహలలో నివసించారని ప్రతీతి.

సర్వసంగపరిత్యాగి అయిన ఓ సాధువు కొద్ది సంవత్సరాల క్రితం ఈ ప్రదేశానికే చేరుకున్నాడు. చాలా సంవత్సరాలు ఇక్కడే వుండిపోయాడు. ప్రాపంచిక ఇచ్ఛలని అంతం చేసుకుని

ఆత్మజ్ఞానం పొందిన ఆ సాధువు తనని తాను ఆ గుహకి బందీ చేసుకుని తిరిగి బయటకి రాలేదు.

ఎవరితో మాట్లాడే వాడుకాదు. ఓపలక బలపం దగ్గర వుంచుకుని వ్రాసి చూపించే వాడు. తరచు ఆ లోయలోకి పిక్నిక్ కోసం అనేకమంది వస్తూంటారు. వారి చ్చిన ఫలహారాలు స్వీకరించేవాడు. ఎవ రితో మాట్లాడకుండా మౌనం పాటించే వాడు.

ఆ సరస్సులోని చేపలు పట్టడానికి, గొడ్లు కాచుకునే పిల్లలు కొందరు రోజూ ఆ లోయలోకి వస్తారు. వాళ్ళచేత గ్రామం నించి రోజూ పళ్ళు పంపించేవారు ఆ సాధువుకోసం కొందరు.

పెరిగిన తెల్లటి గడ్డంతో, ఎర్ర రంగు పంచెలో, నుదుట వీబూధి బొట్టుతో ఎంతో ఆనందం ప్రతిఫలించేలా హాయిగా చిరునవ్వు నవ్వేవాడు.

సత్యమూర్తికి ఇంకా ఆ చిరునవ్వు గుర్తుంది.

ఏడెనిమిదేళ్ళ క్రితం కాలేజీనుంచి కొందరు తోటి విద్యార్థులతో ఆగ్రా, ఢిల్లీ, ఖజురహో చూడటానికి వచ్చాడు. విహారయాత్రలో అనేక శృంగార శిల్పాలు చెక్కిన ఆలయాలుగల ఖజురహో నుంచి టూరిస్ట్ బస్ పన్నా వచ్చింది, వజ్రాల గనులు చూసే నిమిత్తం. తిరుగు దారిలో పాండకేవ్స్‌కి వచ్చారు.

ఆ లోయ, ఆ సాధువు, ఆ వాతావరణం ఎంతగానో నచ్చాయి సత్యమూర్తికి. చాలాకాలం గుర్తుండిపోయింది. అనేకసార్లు శ్రీవల్లితో కూడా చెప్పాడు ఎప్పుడో ఓసారి ఆ లోయ దగ్గరకి తీసుకువెళ్తానని. తన జీవితం అక్కడే అంతం అవాలనే కోరిక సత్యమూర్తి మనసులో చూచాయగా అప్పుడే చోటు చేసుకుంది తీవ్రంగా. కాని అది క్రమంగా సమసిపోయింది.

సత్యమూర్తి ఆలోయ వుండే చోటు, అక్కడికి దారి మర్చిపోలేదు అన్ని సంవత్సరాలు గడిచినా. ఈ చివరి దశలో అది అయస్కాంతంలా ఆకర్షించింది.

సత్యమూర్తి ఆ సాధువు కోసం చూసాడు. లోయ ఖాళీగా వుంది. పక్షులు చేసే కిలకిలరావాలు మినహా నిశ్శబ్దంగా వుంది.

ఏమయాడు?

వెళ్ళిపోయాడా!

ఎక్కడికి?

బయట ప్రపంచంలోకా? విసుగెత్తిందా ఈ జీవితం?

దూరంగా కొద్ది దూరంలో కనబడింది సత్యమూర్తికి ఓ సమాధి. దానికున్ని ఓ చిన్న గూటిలో, ఎర్రటిమట్టి పిడత నల్లగా మసిబారివుంది అప్పుడప్పుడు ఎవరో వచ్చి దీపం వెలిగిస్తున్న గుర్తుగా.

పరమాత్మలో ఐక్యం అయాడు ఆ పుణ్యాత్ముడు.

## 22

రేపు ఉదయం చేపలు పట్టడానికి వస్తారు పిల్లవాళ్ళు. సత్యమూర్తిని చూపి పలకరిస్తారు. కాని సత్యమూర్తి మాట్లాడడు. వెళ్ళిపోతారు. మళ్ళీ మర్నాడు వస్తారు. సత్యమూర్తి యింకా అక్కడే వుండటం చూసి ఆశ్చర్యపోతారు. మళ్ళీ పలకరిస్తారు. సత్యమూర్తి పెదవి విప్పడు.

మూడోరోజు గ్రామం నుంచి పెద్ద



(వి) చిత్ర విజ్ఞానం

హార్బర్ జనరల్ హాస్పిటల్ (Torrance U.S.A) కు సంబంధించిన పంటి డాక్టరు రేస్టీవర్ట్ పిల్లల ఏడుపులు నాలుగు విధాలు అంటున్నారు. మొదటిది దొంగేడుపు: కంట నీళ్లు రావు. పిల్లవాడిని సముదాయించ నక్కరలేదు. ఈ ఏడుపేదో ఏడవనిస్తేనే మంచిది. రెండవది మొండి ఏడుపు: గొంతు చించుకుని అరవడం, కాళ్లు చేతులు తన్నుకోడం దీని లక్షణాలు. కళ్ళనీళ్లు తక్కువగా కారుతాయి. దీన్ని ఏదో విధంగా భరించాలి. మూడవది భయం ఏడుపు: కంటనీళ్ళు విపరీతంగా కారుతాయి. ఏడుపులో దైన్యం వుంటుంది. పిల్లవాడిని వెంటనే ప్రేమతో సముదాయించాలి. లేకపోతే మానసికంగా దెబ్బతింటాడు. ఆఖరిది బాధ ఏడుపు: అరుపు ఎక్కువగా వినబడదు. ముఖంలో బాధ వ్యక్తం ఔతుంది. కళ్ళ నీళ్ళు తక్కువగా కారుతాయి. వెంటనే పిల్లవాడిని డాక్టరుకు చూపించడం మంచిది.

---

వాళ్ళు ఒకరిద్దరు వస్తారు. సత్యమూర్తి వంచిన తల ఎత్తడు. ఆ మర్నాడు పలకబలపం తీసుకువస్తారు. ప్రశ్నలడుగుతారు. సత్యమూర్తి వాటిని తాకడు. బదులు చెప్పడు. ఎవరి వంకా చూడడు.

వారికి అర్థమవుతుంది సత్యమూర్తికి బాహ్యప్రపంచంతో ఎలాంటి సంబంధం పెట్టుకోవడం ఇష్టం లేదని.

వెళ్ళిపోతారు.

మర్నాడు పుల్కాలు, బంగాళా దుంపలకూర, అరటిపళ్ళు తీసుకువస్తారు పిల్లలు. వాటిని ముట్టడు. కేవలం అరటి పండ్లే తీసుకుంటాడు. వాళ్ళకి అర్థం అవుతుంది సత్యమూర్తి పళ్ళు తప్ప మరేం ముట్టడని.

రోజూ పళ్ళు తీసకు వచ్చి సత్యమూర్తి దగ్గర వుంచుతారు. ఒకో రోజు వాటిని తింటాడు. ఒకోసారి నాలుగయిదు రోజులదాకా వాటిని ముట్టడు. క్రమంగా సత్యమూర్తి ఆహారం తీసుకోకుండా ఆత్మాహుతి చేసుకోవడం ఇష్టంలేక బ్రతకడానికి తింటున్నాడని గ్రహిస్తారు. ఇది వరకటి సాధువులా సత్యమూర్తి బీడీ, గంజాయి ముట్టడు కొందరు యిచ్చినా.

అప్పుడప్పుడు దగ్గర గ్రామాలలోని వాళ్ళు వచ్చి సత్యమూర్తికి నమస్కరించి వెళ్తుంటారు. వాళ్ళలో ఎవరయినా తెచ్చిన పళ్ళు తీసుకుంటే వాళ్ళ కోరికలు సఫలం అవుతాయి అని ఆనందిస్తారు. అలాంటి నమ్మకాలు పెంచుకోవడంలో తృప్తి వుంటుంది వాళ్ళకి.

కాని సత్యమూర్తి ఎవరి 'వంకా కన్నెత్తి చూడడు. పలకరించడు. చిరునవ్వు అయినా నవ్వడు. ఎంతమంది వచ్చినా అసలు అక్కడ మనుషులు లేనట్లుగా వుంటాడు.

## అనుభవం

కొన్నాళ్ళు భగవంతుడు తోడు
అది బాల్యంగా ముగిసింది
ఆ పై ప్రేయసి నా తోడు
అది తొలి యౌవ్వనంలో ఉరకేసింది
భగవంతుడిని నేను వదిలేశాను
ప్రేయసి నన్నొదిలేసింది
ఇప్పుడు
నాకు నేనే మిగిలిన అంతరంగాన
వృద్ధాప్యమంతటి అనుభవం
జీవితాన్ని నడిపిస్తోంది.

—సుధామ

ఉదయం క్రమంగా చేపలు పట్టే పిల్లవాళ్ళు పళ్ళు తెచ్చి గట్టుమీదపెట్టి సాయింత్రం సత్యమూర్తి వాటిని తీసుకోకపోతే తిరిగి తీసుకువెళ్ళటం అలవాటు చేసుకుంటారు.

ఆదివారాలు తరచు పిక్నిక్కి వచ్చే వాళ్ల టూరిస్టుబస్‌లలో వజ్రాల గనులు చూడటానికి వచ్చి పాండవుల గుహ ఉండే లోయని చూడడానికి వచ్చే వాళ్ళు గడ్డాలు, మీసాలు, జుట్టు పెరిగిన సత్యమూర్తిని దూరం నుంచే చూసి వెళ్ళిపోతారు. ఎవరయినా తెలియని వాళ్లు దగ్గరకి వెళ్ళి పలకరించినా సమాధానం వుండదు.

ఆ లోయలో, ఆ కొండలమధ్య, ఆ చెట్లక్రింద, ఆ సరస్సు ప్రక్కన, ఆ గుహలో చలికాలంలో ఎముకలు కొరికే విపరీతమయిన చలిలో, వర్షాకాలంలో ఉరుములు మెరుపులతో వర్షం ఎక్కువగా కురిస్తే ఆ తడిలో, ఎండాకాలంలో హాయిగా, చల్లగా వుండే ఆ వాతావరణంలో గ్రామస్థులు ఇచ్చిన ఓ పాత రగ్గు కప్పుకుని ఈ లోకంలో ఎవరితో, ఏ వస్తువుతో ఏ ప్రదేశంతో ఎలాంటి సంబంధం పెట్టుకోని సత్యమూర్తి తన జీవితంలోని ఆఖరిక్షణం కోసం అమితమయిన ఆసక్తితో ఎదురు చూస్తూంటాడు- ఆ లోయలోని రాయిలో రాయిలా చెట్టులో చెట్టులా.

కొన్ని సంవత్సరాల తర్వాత ఓ సారి ఆచూకీ తెలిసిన సత్యమూర్తి బావగారు, ప్రియంవద బ్రతిమాలతారు. కాళ్లావేళ్లా పడతారు ఇంటికి రమ్మని. ఆశ్రమం కట్టించి ఇస్తాం రమ్మని ఏడుస్తారు.

సత్యమూర్తి అసలు వాళ్ళ వంకే చూడడు. సత్యమూర్తి ఆఖరిసారిగా చూసింది మొదటి రోజు లోయలోకి అడుగు పెట్టినప్పుడు ఎదురుపడ్డ దంపతులని, వారి కవల పిల్లల నిద్దరినీ.

అంతే....

ఇక రాడని విసిగి వెళ్ళిపోతారు, సత్యమూర్తికి అక్కయ్య అనారోగ్యం గురించి చెప్పినా చలనం లేకపోవడంతో.

అలా కొన్ని సంవత్సరాలు గడుస్తాయి.

ఆ తర్వాత... ?

నిరాశని మించిన తృప్తి లేనేలేదు.

—: సమాప్తం :—

దొప్ల నారాయణమూర్తి రాజు



ఆ ఉదయం ఐదుగంటలవేళ సుభద్రమ్మగారు కోపంతో వేడెక్కి పూగిపోతూ చిందులు తొక్కేరు. అప్పుడే చీకట్లు చీలుతున్న ఆ సమయంలోనే అయ్యగారు లేచారు. అలవాటుగా బెడ్ కాఫీ కోసం వేచిచూసారు. కానీ రాలేదు. ఏ మంత్ర సిద్ధులుగల మహానుభావుడైనా కాలాన్ని ఒక్కక్షణం ఆపుదాంవని సరదాపడ్డా ఆపగలడేమోగాని అమ్మగారి చేత అయ్యగారికి ఆ సమయంలో బెడ్ కాఫీ ఇప్పించటం మాత్రం ఆపలేడు.

కానీ ఇవాళ ఏ మాయల పకీరు ఆపగల్గేడు? ఏ మాయల పకీరూ ఆపలేదు. సుభద్రమ్మగారే ఇవ్వడం మానేసేరు. నలభై ఏళ్ళగా వస్తున్న అలవాటు ఆరోజెందుకు ఆగిపోయిందో కారణం తెలీదు.

"ఏమేవ్" మంచమ్మీంచి లేవకుండానే కేకపెట్టారు అయ్యగారు. ఆ కేకకు మరో రోజునైతే టక్కున జవాబొచ్చేదే కాని ఈ రోజు మాత్రం జవాబు రాలేదు. రెండోసారి కేక పెట్టేరు. ఈసారీ జవాబులేదు. కానీ స్వయంగా సుభద్రమ్మగారే ఏంవలా అరుస్తున్నారంటూ గదిలోకొచ్చారు. గదిలో కొచ్చిన

అమ్మగార్ని అయ్యగారు పరిశీలించి చూసేరు. తెల్లవారు ఝామున నాలుగ్గంటలకే లేచి మడిగా స్నానంచేసి జరీ అంచు ఎర్రటి పట్టుచీర, ఎర్రటి జాకెట్టుల్లో ఆవిడ లైటు వెలుగులో ధగధగా మెరిసిపోతున్నారు. ధగధగా మెరిసి పోతున్న ఆవిడ ముఖంలో ఆ సమయంలో కనిపించిన కోపపుచ్ఛాయలు అయ్యగారు గుర్తించినా ఆ కోపానికి కారణమేమై వుంటుందో మాత్రం ఆయన వూహకు అందలేదు.

"ఏంవండీ . ఏవలా ఇంత పొద్దునే భద్ర కాళీ అవతారం దాల్చేరూ" అని నవ్వును ముఖంలో పులుముకోబోయి తెల్లటి ఆవిడ ముఖంలో కనబడ్డ ఎర్రటి కోపాన్ని గ్రహించి నవ్వు నాపేసారు.

"ఔను అందరికీ వేళాకోళంగానే వుంటుంది. ఇల్లూ వాకిలీ ఏమైపోతే ఎవడిక్కావాలి. సంసారవంతా ఏ నట్టేట్లో కలిసిపోతే ఎవడి క్కావాలి" అయ్యగారికి ఆ మాటల తాలుకా అర్థవేం బోధపడ్లేదు. అసలు సంగతేవిటో అడుగుదావనుకునే సరికి అమ్మగారు అగది దాటేసారు. అయ్యగారికి వంటింట్లోంచి వచ్చే చప్పుళ్ళు వినబడుతున్నాయి. నోట్లో సొణు క్కుంటున్న సుభద్రమ్మగారి మాటలూ విన బడుతున్నాయి. మరి లాభంలేదు. లేచి వంట గది గుమ్మందగ్గర నిలబడ్డారు. కాఫీని కప్పులో పోసి వెనక్కు తిరిగే సరికి ఎదురుగా అయ్య గారు, అమ్మగారి చేతిలో కాఫీనందుకున్నారు. అయ్యగారు వంటగది దగ్గరకొచ్చి కాఫీ తీసు కున్నా, చిరాగ్గానే కాఫీ నందిచ్చేరు తప్ప అమ్మగారి కేమాత్రం తన చికాకు తగ్గలేదు. తెల్ల వారుతున్న కొద్దీ చీకటి తగ్గిపోతున్న కొద్దీ ఆవిడ కోపం ఎక్కువౌతూ వచ్చిందే తప్ప ఒక్క అరడిగ్రీ కూడా తగ్గలేదు.

కొత్తగా కట్టిన మేడింటిమీదకు కొత్తగా వచ్చిన చుట్టంలా మెల్లమెల్లగా సూర్యుడు వెలుతుర్ని మోసుకొచ్చేడు.

అంత ఉదయాన్నే తల్లి వేస్తున్న రంకెలకు పెద్దోళ్ళిద్దరికీ మెలుకువొచ్చినా లేవటానికి బద్ధకంవేసి మంచాన్ని కావలించుకుని ముసుగు తన్నేసేరు. మూడోవాడికి తల్లి కేకలకు నిద్ర ఎగిరిపోయింది. కానీ లేచి ఏంచెయ్యాలో తెలీక మంచమ్మీదే వాడు మరం వేసుక్కూ చుని చుట్టూ చూస్తున్నాడు. నాలుగోది ఐదేళ్ళ నిండిన ఆడపిల్ల మాత్రం హాయిగా నిద్ర పోతోంది.

అప్పటికే పెరట్లో జాంచెట్టుమీది కాకుల జోడీ టపటపమని రెక్కలు ఎదిల్చి, మను ష్యులు 'హాయ్' అనుకున్నట్లుగా "కావ్ కావ్" మన్నాయి.

"దిక్కుమాల్ని కాకులు ఇంత పొద్దున్నే తగలడాలా" తనలో తను అనుకున్నట్టుగా గట్టి గానే విసుక్కున్నారు సుభద్రమ్మగారు.

సరిగ్గా అలా విసుక్కుంటున్న సమయం లోనే జోగులొచ్చేడు. జోగులంటే ఆ యింటి పనివాడు. ఉదయాన్నే ఆరుగంటలకల్లావచ్చి నూతిలో నీళ్ళు తోడ్డం, ఆ తర్వాత మొక్క లకు నీళ్ళు పొయ్యడం, ఆ పిదప బజారుకెళ్ళి కూరగాయలు తేవడం, తొమ్మిది గంటలకు చిన్నపిల్లలిద్దర్నీ సైకిలుమీద కాన్వెంటుకు తీసి కెళ్ళి దిగబెట్టడం, మధ్యాహ్నం ఇంట్లో పను లేమైనా వుంటే చెయ్యడం, సాయంత్రం కాన్వెంటునించి పిల్లల్ని ఇంటికి తీసుకురావడం పిల్లలకు స్నానం చేయించి షికారుకి తీసు కెళ్ళడం అతని డ్యూటీ. ఆపనికి అతనికి నెలకో రెండు పదులిస్తారు.

"ఒరే మేం పెట్టిన తిళ్ళు, మేమిచ్చిన డబ్బూ అలా చేస్తాయిరా. ఇక్కడ కొచ్చిన మొదట్లో బాగానే వుంటారు. రెండో నెల్నించీ మొదలు ఇష్టవొచ్చినప్పుడు రావడాలు. ఒరే దీనికి మిమ్మల్ననేం ప్రయోజనం లేదురా. తప్పంతా మాదే మాదే. ఏమైనా అంటే ఆ మాత్రంచే స్తే ఏ యింట్లోనైనా ఇంతకంటే ఎక్కువే పడేస్తా రనే గీర్మానాలు. ఇవి మంచికి రోజులు కావురా నాయనా."

జోగులు రావడం చూసి, జోగులికి స్వాగతం పలికేరు అమ్మగారు. జోగులు ఏం చెయ్యాలో తెలీక చేతులు కట్టుకుని తలదించు కుని నిలబడ్డాడు. అమ్మగారు గదిలో కాఫీ కలుపుతూ జోగులుకి "అక్షింతాలు" వేస్తూనే









వున్నారు. వరండామీద నిలబడ్డ జోగుల్ని "ఇట్రారా" అని పిల్చి రెండు కాఫీ కప్పులిచ్చి "వెళ్ళి ఆ నిలువు గాడిదకి, ఆ అడ్డ గాడిదకీ ఇచ్చిరా" అన్చెప్పి "అక్కడ వాళ్ళతో సిన్మా పూసులికి తగలడక వేగరం ఇచ్చీసొచ్చి ఆదెష్ట ముండ ఇంటికెళ్ళి దాన్ని అర్జంటుగా పిల్చుకురా" అని గట్టిగా చెప్పేరు సుభద్రమ్మగారు.

"అలాగే నండమ్మగోర"ని వూఁకొట్టాడు.

క్రింద తల్లి మాటలు వినబడుతున్నాయి. కానీ ఏవిటో అర్థం కాలేదు. కాఫీ తెచ్చిచ్చిన జోగుల్ని అడిగారు పాతికేళ్ళు నిండిన భాను . శ్రీనూను.

"అదేంటో బాబూ నాకూ తెలీకండావుంది. రేత్రి నాను చిన్మాకెళ్ళినాను. పన్లోకి రాటం నేటయిపోంది. అచ్చింతాలు పడిపోనాయి." జోగులు గబగబా మెట్లుదిగి వంటగది గుమ్మం దగ్గర హాజరై పోయాడు.

"దేభ్యంలా మొహం పెట్టుకుని నిలబడ్డావేంరా. వెళ్ళు. వెళ్ళి ఆ మహారాణీగార్ని తీసుకురా. వుత్సవాలూ వూరేగింపులూ అయ్యాక రెష్టు తీసుకుంటోంది గావాల. నిలబడిందాన్ని నిలబడ్డట్టుగా తీసుకురా."

అమ్మగారి మాటతోనే వీధిలోకి పరుగెత్తాడు జోగులు. వుత్సవాలు వూరేగింపులూ అయ్యాక రెస్టు తీసుకున్న మహారాణీ ఎవరో వాడికి తెల్సు. అంచేతే గబగబా నడవడం మొదలెట్టేడు. సందులన్నీ తిరిగి అడ్డదారంట నడిస్తే మహారాణీ గారింటికి పావుగంట పడుతుంది. త్వరగా తీస్కువెళ్ళకపోతే అమ్మగారు ఇంకెన్ని దీవనలు దీవిస్తారేమోనని పరుగులాంటి నడక నడుస్తున్నాడు జోగులు.

మహారాణీవుండే పేటొచ్చింది. వూరుకి చివర నానాజాతుల పేట దాని పేరు. పేట మధ్య మర్రిచెట్టు నానుకొనివున్న కమ్మిల్లు మహారాణీది. జోగులు పాక దగ్గరకెళ్ళేసరికి పాక ముందు చిన్న పందిరీ, పందిరికి కట్టిన తోరణాలు రాలడానికి సిద్ధంగా వున్నాయి. పందిరి సరుగుడు రాట్లకి కట్టిన రంగు కాగితాలు సగం సగం చిరిగి క్రిందకు వ్రేలాడుతున్నాయి. పందిరి పైన కప్పిన కొబ్బరాకులు రాలి నేలంతా చిందర పందరగా వుంది. ఆ కొబ్బరి రేకుల్ని కాళ్ళతో పట్టిలాగుతూ ఓ గజ్జి కుక్క 'గుర్, గుర్' మని గుర్రుపెడుతోంది.

జోగులు గుడిసె ముందుకెళ్ళి, అమ్మగార్ని జ్ఞాపకం తెచ్చుకుని, కావాల్సినంత కరుకు తనాన్ని కంఠంలోకి తెచ్చుకుని "పైడమ్మా. పైడమ్మా" అని పిల్చేడు.

పైడమ్మ పలకలేదు.

రెండోసారి పిల్చేడు. కానీ రెండోసారి కూడా అలికిడిలేదు. పిలుపుకి పక్క గుడిసె లోంచి పైడమ్మ రెండో కూతురు అప్పచ్చి వచ్చి "అమ్మనేదు. అప్పని బస్సుకు దిగెడ్డాని కెళ్ళింది. అలా పన్లోకి నచ్చేస్తాననంది."

"అమ్మగారు ఫైరయి పోతన్నారు. అగ్గి బుగ్గయి పోతన్నారు. ఇలా బస్సు స్టేండు కెల్తాను. నేటవుద్ది అని కబురంపితే ఏటయి పోద్ది. కబురైనా ఎట్టిందికాదు. ఎంత నేటవుద్దో. ఎవర్తినీ తీసుకెళ్ళ కండా ఎళితే నా కాళ్ళిరగ తంతుందావిడ. నువ్వురా మీఅమ్మొస్తే వచ్చీదూ గాని ..."

"ఇల్లో" అని సంశయం వెళ్ళబుచ్చింది అప్పచ్చి.

"ఆ పక్కోర్లో ఇప్పుడే వచ్చేస్తానని చెప్పి రావే" సలహా యిచ్చేడు జోగులు.

"ఏఁవిటీ తెల్లవారుఝామునించీ అలా చిందులు తొక్కుతున్నావు." అయ్యగారు స్నానమదీ కానిచ్చి పూజగదిలో కెళ్ళబోతూ అమ్మగారి "మూడ్" చూసుకుని అడిగేరు.

"గదిలో కెళ్ళబోతూ అడగడమెందుకు లోని కెళ్ళిరండి " అని ప్రసన్నంగానే సమా ధాన మిచ్చేరు అమ్మగారు.

అయ్యగారు పూజగదిలో ఓ పావు గంట సేపు గడిపి ఇంచక్కా వచ్చేరు. అమ్మగారు ఆ సమయంతో ద్వారబంధాని కానుకుని నిల్చు న్నారు.

"ఏం. ఇప్పటికైనా తెల్సిందా" అన్నారు.

"ఏఁవిటి నీ బొంద. సరిగ్గా చెప్పి ఏడవ రాదూ. బోడి సస్పెన్సు."

"ఈ ఏభై ఏళ్ళకే చత్వారం మొచ్చిందా మీకు. దేవుడి గదిలో వెళ్ళేం చేసేరు. పూచ్చేసారా లేక నిద్రపోయేరా."

"ఏదో చేసాను. అసలు సంగతి చెప్పు."

అమ్మగారు ఏం చెబుతారో అని అయ్య గారు శ్రద్ధతో వింటున్నారు. అమ్మగారు చెప్ప బోయి నీళ్ళకుండీ ప్రక్కగావచ్చి నిల్చున్న వ్యక్తిని చూసి ఆగిపోయారు.

ఆ వచ్చిన వ్యక్తి అప్పచ్చి.

"ఏఁవే యువరాణీ. మీ తల్లి మహారాణి ఏదీ-కబుర్లు పంపి కార్లూ విమానాలు పంపితేనే గాని రారాపే. అంట్లు తోఁవుకున్న అలగా వెధవలైనా ఎంత పొగరే మీకు. ఆ వూరేగడాలు అయ్యాయా ఇంకేపైనా మిగిలాయా."

ఆ ధాటికి అప్పచ్చి బిక్కచచ్చిపోయింది.

"అప్పని బస్సుకు దిగెడ్డాని కెళ్ళిందమ్మ" ఆ మాట ఆ గొంతులోంచి ఎలా వచ్చిందో తెలీదు.

"అయితే ముద్దులూ ముచ్చట్లూ ఇంకా అవ లేదన్నమాట. అవ్వే అవ్వు. మీ షోకులూ షికార్లు మమ్మల్ని తిండాని కొచ్చినట్లున్నాయి." అనేసి "ఈ పూట దాన్దర్శనవేపైనా ఇప్పి స్తాదా నీ దర్శనవేనా" ఆ మాటేటో అర్థం కాలేదు అప్పచ్చికి. ఆ మాటకి జోగులు జవాబు చెప్పేడు.

"ఇక నొచ్చేస్తాదమ్మగోరూ "

ఏం చెయ్యాలో, ఇంటికెళ్ళిపోడవో, వుండవో బోధపడక అప్పచ్చి గోడకానుకుని నిల్చుంది.

లోనికెళ్ళి ఎప్పుడొచ్చారో ఏమో అమ్మ గారు "ఏవే కుందన్బొమ్మలాగ అలా చూస్తూ నిలబడ్డావు. వెళ్లి ఆ అంట్లకు తగలడు" అని కసిరేరు.అప్పచ్చి అంట్ల గిన్నెలవేపు నడిచింది.

సుభద్రమ్మగారి కోపం తగ్గదు. రానురానూ అది ఎక్కువై వుప్పెనలాగ అది ఆవిడగుండె నిండా నిండిపోయింది. ఆ పొంగిపోతున్న కోపం బైటకు రావటానికి అవకాశంలేదు. ఆ అవకాశం అమ్మగారికి ఏ క్షణాన్నయినా రావొచ్చు. ఆ క్షణం కోసమే సుభద్రమ్మగారు వేచి చూస్తున్నారు.

ఆ సమయం రానే వచ్చింది. వచ్చిన సమయం ఎనిమిది గంటలు. పరుగులెత్తే వచ్చిందో, నడిచే వచ్చిందో, పరుగులాటి నడకే నడిచిందో తెలీదు గేటు గొళ్ళెంతీసి

లోని కొచ్చింది పైడమ్మ. గాభరాగా, పెరడు వేపుకి రావడానికి నడకకోరు ఎక్కువవడంవల్ల ఆవిడ నేలమీద నడిచిందో, అమ్మగారు ముచ్చటగా పెంచుకుంటున్న పూలమొక్కలమీదే నడచిందో మనకు తెలీదు.

బీరువాలోంచి ఇస్త్రీ బట్టలు తీసి అయ్యగారి కిచ్చి మధ్య గదిలోంచి పెరటి వరండామీద కొస్తున్న సుభద్రమ్మగారికి మొక్కలమీద నుంచి నడిచొస్తున్న పైడమ్మ కనబడింది.

అమ్మగారు తెల్లవారుఝామున నాలుగు నించీ వేచి చూస్తున్న సమయం అది. ఆవిడలో పొంగిన కోపం కడలి మధ్య పొంగిన బడబాగ్నిలా ఆ సమయంలో ఆవిడ ముఖంలో ప్రతిఫలించింది. ఆ సమయంలో ఆవిడ ఏం చేస్తుందో ఆవిడకే తెలియని పరిస్థితిలో వుందావిడ.

"ఎంతల్లీ తీరికయ్యిందా. గుర్తొచ్చావా" అమ్మగారి మాటలను విని పైడమ్మ ఆగిపోయింది.

"ఆలిస్సెమై పోయిందమ్మా ఆలిస్సెమై పోయింది. దిక్కుమాలిన బస్సు నేటయింది. పిల్లని ఎక్కించొచ్చేసరికి ఇంత టయాం పట్టిందమ్మా" అని "ఇక్కడ బిగాల పనిచేసుకుని బేంకేజెంటు గారింటికెల్లాలమ్మా. బేగి అంట్లు పడేయండమ్మ" అని కూడా అంది.

"బానే ఎల్తావే ఎల్తావు. ఇక్కడికి తెల్లవారుఝామునే వచ్చి పాపం అలిసిపోయావు. ఎల్లే అమ్మా ఎళ్ళు. ఆ బేంకేజెంటుగారిల్లే నీకు ముఖ్యమై పోయిందన్నమాట. ఆల్లే ఇస్తున్నారే నీకు డబ్బు మేమివ్వలేదే." కోపాన్ని ఇంకో దిక్కుగా కేంద్రీకరించి అరచినంత పన్చేసారమ్మగారు.

"అదేంటండమ్మగోరుఆమాట. మీయందరి దయుంటేనే మాలాటోల్లం మనగలువుతావమ్మా. మీ యందరి దయుంది గాబట్టే పెద్దానికి నాలుగక్షింతాలు ఏయించాను. మీ యందరి దయుంది గాబట్టే దాన్నో ఇంటిదాన్ని సేయించగల్గేను. మీ యందరి దయుంది ." తన పెద్ద కూతురు సీతాలు పెళ్లి ఈ ఆఫీసర్ల పెళ్ళాలే దగ్గరుండి చేయించినట్టుగా, వీళ్ళిచ్చిన డబ్బుతోనే ఆ పెళ్ళి జరిగినట్టుగా, వీళ్ళ దయవల్లే పెద్ద కూతురు ఓ ఇంటిదాయి అయినట్టు అతి వినయంగా, అమాయకంగా మాట్లాడబోయింది పైడమ్మ.

పైడమ్మని చెప్పనివ్వలేదు సుభద్రమ్మగారు.

"ఏఁవే ఇల్రాయే" అని పిల్చిందావిడ.

అంట్ల గిన్నెలవేపు వెళ్ళబోయి అక్కడ కనబడ అప్పచ్చిని "నువ్వెందుకే ఇక్కడ కొచ్చేవ్. ఇంటికి బేగి పారెల్లు. దిక్కుమాలిన నంజ బేగెల్లే" తిట్టి, లోన్నించి 'ఏఁవే ఇల్రాయే' అని పిల్చిన అమ్మగారి పిలుపుకి సమాధానంగా పిలుపొచ్చిన దగ్గరికి క్షణంతో వెళ్ళి నిలబడింది పైడమ్మ.

సుభద్రమ్మగారు పూజ గదిలో వున్నారు. గదిలో గోడుంది కాని అది కనబడటంలేదు. దాన్నిండా పురాణ పురుషులైన దేవదేవుల ఫొటోలు మేకులికి వ్రేలాడదీసి వున్నాయి. ఆ ఫొటోలికి ఎప్పుడో వేసిన దండలు వాడిపోయున్నాయి. కొన్ని ఫొటోలకున్న కొన్ని దండలు తెగిపోయి సగం సగం జారుతూ నిల్చున్నాయి. కొన్ని క్రిందపడి మూల్గుతున్నాయి. ఆఫొటోల గోడకానుకుని వెండి పూజామందిరముంది. ఆ మందిరంలో ఘనత వహించిన దేవుడెవరో వున్నారు కానీ ఆయన రంగు రంగుల రకరకాల పువ్వుల మధ్య వుక్కిరి బిక్కిరౌతూ దర్శన మివ్వలేక పోతున్నారు. ఆ మందిరమ్ముందు ఖరీదైన అగరువత్తులు వెల్గించడంవల్లనేమో ఆ గదంతా ఖరీదైన భక్తికి నిదర్శనంగా ఖరీదైన వాసన వేస్తోంది. ఆ మందిరం ముందు రకరకాలైన పూజ సామాన్లువున్నాయి. అవి కొన్ని వెండితో చేసినవీ, కొన్ని బంగారంతో చేసినవీనని అమ్మగారు చెప్పినమీదట తెల్సిన విషయం అది.

"ఏటండమ్మగోరు పనేటి" అని పైడమ్మ భయంగా అడగబోయేటంతలో "ఇదిగో ఇటు చూడ"ని అన్నారమ్మగారు. అమ్మగారు "ఇటు చూడ"ని అనగానే పైడమ్మ "ఆ ఏచూసింది" అమ్మగారు చెయిపెట్టిచూపెడుతున్నారు. అమ్మగారు చూపెట్టేది పూజామందిరం ముందున్న దీపాల్ని.

ఆ దీపాలు వెలుగుతున్నాయి. కల్తీలేని స్వచ్ఛమైన నూనె పొయ్యడం వల్లనేమో ఆ దీపాలు స్వచ్ఛంగా వుజ్జ్వలంగా వెలుగుతున్నాయి.

"ఏటండమ్మగోరు" అంది పైడమ్మ అమాయకంగా.

"ఏటండమ్మగారూ ఏటే . దెష్టముందా. ఇటు చూసావా" అన్నారు అమ్మగారు.

"సూస్తన్నాను" అంది పైడమ్మ.

"గదిలోకొచ్చిచూడు" అన్నారమ్మగారు. గదిబైట ఒకడుగుంచి గదిలోపల ఒకడుగు వేసి ఆ వెలుగుతున్న దీపాలవేపు చూసింది పైడమ్మ. కానీ ఏవర్థం కాక అమ్మగారి వేపు అయోమయంగా చూసింది.

"అర్థమైందా లేదా"

"కాలేదన్లేదు" పైడమ్మ. అసలేవీ అన్లేదు పైడమ్మ. ఏవండానికీ ఏఁవీ అర్థం కాలేదు. అంచేత అలా నిలబడి దీపాలవేపు అమ్మగారి మొఖంవేపు అలా చూస్తోంది పైడమ్మ.

"సూదులు పొడ్సుకుచూడు. బాగా కనబడతాయి. కళ్ళుపొరలు కమ్మేయా. కళ్ళు కనబడ్డంలేదా. దీపాలెందుకు వెలుగుతున్నాయి" అని ప్రశ్నించేరు అమ్మగారు.

వెలుగుతున్న దీపాలవేపు అప్పుడుస్పష్టంగా చూసింది పైడమ్మ. పైడమ్మకు అప్పుడర్థమయింది. ఆ దీపాలు మామూలు యిత్తడి కుందుల్లో వెలుగుతున్నాయి. అక్కడ వాటిస్తానే వెండికుందులుండాలి. అవిలేవు.

"ఏవండమ్మగో.. ఎండికుందు లేవండమ్మగోరు" అని చాలా అమాయకంగా, చాలా అత్యాశ్చర్యంగానూ ఆడిగింది పైడమ్మ.

"అయ్యో నేనూ అడుగుతున్నాను. పూజ సామాను నువ్వెప్పుడు తోమావు" అని ప్రశ్న వేశారు అమ్మగారు.

"మొన్న" అంది పైడమ్మ. "కాదం"ది. "మొన్నకాదు. మొన్నకాదాండమ్మాగోరు .. అటుమొన్న. అవును .అటుమొన్నే" అని నిర్ధారణచేస్తూ చెప్పి అమ్మగారివేపు చూసింది పైడమ్మ.

"నువ్వు పని ఏయేరోజులు ఎగ్గొట్టావో గుర్తుందా" అని అడిగారు అమ్మగారు.

"ఆయేళ .ఈ పూస్సావాను తోఁవీసి ఎళ్ళిపోయే పైడీ' అంటే నానూ పూస్సావాను తోఁవీసి మీకప్పజెప్పి ఎళిపోయేను అంతే ఆ రోజు నానే తోవేను ఎండికుందుల్ని. ఆ ఎండికుందుల్ని ఆరోజు మీరిచ్చిన అదేదో గుండ, ఆ గుండతోబాగా తళాతళా తోఁవేనే ఆ పూస్సాఁవాను ఆరోజు మీ కప్పజెప్పేసే నేను యెళిపోయేను" చెప్పడం ఆపేసింది పైడమ్మ.

"పైనున్న మూఁడ్రోజులూ పూజగదిలోకెళ్ళలేదునేను. ఈవేళ తీరా పూజ చేసుకునే సమయానికి జత వెండికుందులూ కనబడ్లేదు. ఇల్లంతా వెదికినా ఏవీ? ఎక్కడ ఇఁట్లో వుంటేనా కనబడ్డానికి" విషయంచెప్పి పైడమ్మ వేపు సంశయంగానూ, దీనికి జవాబేం చెబుతావన్నట్టుగానూ చూసారమ్మగారు.

"పూస్సాఁవాను తోఁవేసి ఆ గదిలో ఎట్టేయే పైడీ అంటే ఆ సాఁవాను తోఁవేసి ఆ గదిలో ఎట్టేసి ఆ పూజ గది గొళ్ళెం పెట్టేసి ఎళిపోయానంతే . అంతేనండమ్మగోరు ఆ తర్వాత నానెరగను" అన్న మాట అంది పైడమ్మ.

"నువ్వెరగకపోతే, ఆ సామానెట్టికెళ్ళిపోడానికి ఎవరో కొత్త దొంగ వొచ్చి ఎత్తుకుపోయారంటావా ఈ మూఁడ్రోజులూ ఆ గదిలోకి పిల్లలుగాని, నేను గానీ ఎవరూ వెళ్ళలేదు. తీరా ఇవాళ చూస్తే " అని అమ్మగారు ఆగారు.

"గదంతా ఎతికిరా . ఆటకు పిల్లలీస్తారేఁవో" అని భయం భయంగా నోట్లో సొణుక్కున్నట్లుగా అంది పైడమ్మ.

"తెల్లవార్లావునించీ నేన్చేస్తున్న పనదే. ఎతకటవే పిల్లలీసారా అండానికి నా అనుమతి లేకుండా ఆ గదిలో కెళ్ళరు. వెళ్లినా ఆ పూజ సామాను ముట్టుకునే అవసరం వాళ్ళకేవుంది? 'నన్నడక్కుండా వాళ్ళేం అలాంటి పన్లు చెయ్యరు."

"అయితే అయ్యేటయ్యుంటాయండమ్మ

గోరూ . "

"ఏటయ్యాయా. రెక్కలొచ్చి ఆకాశం లోకి ఎగిరిపోయాయ్. నట్టం నేర్చుకుని పైటకు పారిపోయాయ్. ఏటౌతాయే ముచ్చటగా వున్నాయని, ముద్దుగా వున్నాయని ఎవరో చెయ్యాలని చేసిన పనిది. మా అమ్మగారికి మా అమ్మమ్మగారు ఎంతో ప్రేమగా ఎప్పటివో అవి రాజుల రాజ్యాల కాలంనాటివి, అవి ఈనాటి వెండితో చేసినవి కూడా కాదు, ఇచ్చార్ట. మా అమ్మగారేవో మా పెద్దక్కగారికి, కాశ్మీరు కాపరానికెళిపోయే ముందు ఇచ్చేస్తే, అవి తనకు కావాలని, ఆ రెండు వెండి కుందులూ తనకివ్వమంటే నా దగ్గరకంటే నీ దగ్గరే జాగ్రత్తెక్కువని, నాకంటే నీకే భక్తెక్కువని, భక్తెక్కువ కాబట్టి ఆ జత వెండి కుందులూ నీ దగ్గరుంటేనే బాపుంటుందని, ఆ కాశ్మీరక్క తను కాశ్మీరు వెళ్లిపోయే ముందు ఈ చిన్న చెల్లిగారికిచ్చిందట. అలాగా ఆ వెండికుందులు తన దగ్గరికి అంత కష్టంమీద వచ్చాయిట. అదట ఆ వెండికుందుల వైనం ."

"తెవడానికి నీకివ్వడమే తప్ప, ఆ తర్వాత నా కళ్ళతో నేను చూడలేదు. అంచేత అవ్వే టయ్యాయో నీకే తెలియాలి. ఎలా తెస్తావో ఏం చేస్తావో సాయింత్రంలోగా కుందులురెండూ తెచ్చి నాకిచ్చి, ఆ తర్వాత పన్లోకిరా. వెళ్లు" అని తను చెప్పదల్చుకున్నది సూటిగానూ, స్పష్టంగానూ చెప్పేరు అమ్మగారు.

అమ్మగారు చెప్పిన్దానికి పైడమ్మ గజగజ వణికిపోయింది. అంతకుముందే బస్టేండు నుంచి పరుగెత్తిరావటం వల్లనో లేక, ఇంత నింద మీదపడ్డంవల్లనో లేక ఇలాంటి పరిస్థితి ఎదురైందేవి చెప్మా అనే భయంవల్లనో పైడమ్మ శరీరం ఆకులా గజగజా వణికిపోయి చెమట పట్టేసింది. అమ్మగారితో ఏం చెబుదా మనుకున్నా పైడమ్మకి నోరు పెగల్లే. ఆయమ్మకోసారి ముఖం తిరిగినట్టనిపించిం ది భూమి కదిలిపోయి, నేలంతా చుట్టుకుపోయి తనని కప్పేస్తున్నట్టనిపించింది. ఏం చెప్పాలో

తెలీక పైడమ్మ అలా బొమ్మలా నిలబడి పోయింది. ఆయమ్మకోసారి తన రిక్షా పెనిమిటి, తనిద్దరి "ముండపాపలూ", ఆరేళ్లు నిండిన కొడుకూ గుర్తొచ్చేరు. ఆయయ్య కాళ్ళూ, ఆయమ్మ కాళ్ళూ పట్టుకుని ఎదిగిన కూతురు సీతాలుకి మున్సిపలాఫీసు బంట్రోతు సంబంధం కుదిర్చి, నిన్నగాక మొన్ననే పెళ్ళి చెయ్యడం గుర్తుకొచ్చింది. బొట్టెకి మూడు ముళ్ళేయించేసి "అత్తారింటి'కి అంపించాననే కన్నతల్లి సంతోషవింకా తీరనేలేదు. ఈ అపనింద మీదబడింది. కనబడ్డం లేదంటే తను ఎత్తికెళ్లిందన్న మాటేగదా . ఎత్తికెళ్లిం దంటే తను దొంగతనం చేసిందన్న మాటే. అంటే తను దొంగదన్నమాట ఆ ఆలోచన తలలో మెదిలేసరికి పైడమ్మ తల నరాలన్నీ జివ్వుమన్నాయి. కాళ్ళనించి తలదాకా వళ్ళంతా తిమ్మిరెక్కినట్టనిపించింది.

"నాను దొంగదాన్ని మాత్తరం కాదండమ్మ గోరు . ప్రేమించానన్జెప్పి తత్నల్లిసి తను కడుపల పడ్డాక వదిలీసి తనబాపు ఎళిపోతే తనని కని పారేసి చూడకుండా తల్లెలిపోతే ఎక్కడ పెరిగిందో తెలీకుండా వూహ వచ్చిన్దాకా తనూ పెరిగినా, ఆనాడైనా తనకి దొంగతన మబ్బలేదండమ్మగోరు వూహ తెలిసాక బతకడమెలాగరా అని కూకుంటే టీకొట్టు సింవాచలం సేరదీస ఇంటింటికీఇడ్లీలమ్మే అని తన కొదారం సూపట్టిన్నాడైనా దొంగతనమబ్బ లేదండమ్మగోరూ ఇడ్లీలు దగ్గర సేరికైన రిక్షామావ, ఒలే పైడీ మనిద్దరవూ మను వాడుదావంటే. ఆనాడైనా దొంగతనంగా ఆడి దగ్గరికి నేను సేర్లేదు. పల్లగ్గా కోవెల్లో నా మెళ్లో మూడుముల్లూ ఏసినాడాడు. బతికనేక ఆళింటిదగ్గరా . ఈళింటి దగ్గరా ఇంటి నలుగురం చాకిరి సేస్తున్నాం తప్ప దొంగతన మెరగమండమ్మగోరు " తన జీవితాన్ని ధైర్యంగా, నిర్భయంగా అమ్మగారి ముందుం చింది పైడమ్మ. తనమీద నిందపడినందుకు పైడమ్మ కడుపు తరుక్కుపోతోంది. ఆవిడ కళ్లు చెరువైపోయాయి. ఆ కళ్ళంట కారే కన్నీళ్ళని ఆయమ్మ తుడుచుకోపోవటంవల్ల అవి జాకెట్టులేని ఆయమ్మ గుండెమీద అడ్డుగా వున్న పైటమీద ఇంకిపోతున్నాయి. అంత చెప్పినా పైడమ్మ దుఃఖవింకా ఆగలేదు.

"ఓ రోజుకాదు, రెండ్రోజులు కాదు... ఎనిమి దేళ్ళ ఎరుగుదురు నా నెలాంటిదాన్నో ... ఆకల్తో సచ్చానేకాని అడక్కుండా తిన్నేదు. అమ్మా ఆకలనడిగేనేగాని ఒప్పుడూ ధయిర్యం చేసెరగను. నానూ, నా పిల్లలూ, మావందరూ మీకు తెల్సు. ఎలాటోల్లవో మీకు తెల్సు. అన్నీ తెల్సిన మీరే . మమ్మల్నిన్నాళ్ళూ పెంచిన మీరే "దొంగనంజ"నని ముద్దర ఏసినారు. ఇంకా ఏ గంగలో పడల మేంవు . నాయం మాకు వొవుడు సెబుతాడు" అని కనబడని ధైర్యవేదో పైడమ్మలో ఆవహించి, అమ్మగార్ని నిలదీసి అడిగింది.

పైడమ్మ అన్నదానికి, పైడమ్మ పడ్డ బాధకీ అమ్మగారేం చలనం చెందలేదు సరిగదా, ఆ మాటల్నాఎడ ఖాతరు చెయ్యనట్టవుపించేరు. అంతసేపూ పైడమ్మ మాటలు అమిత శ్రద్ధగా విన్న అమ్మగారు ఆఖరుసారిగా పైడమ్మనో మాట అడిగారు.

"చూడు పైడమ్మా నువ్వు నిజం చెబు తున్నావో, అబద్ధం చెబుతున్నావో నాకుతెలీదు. నువ్వు దొంగతనం చేసావని కూడా నేనన్ను. కానీ ఎవరూ తియ్యకుండా ఇంట్లో వస్తువు పోదుకదా' ఇంట్లో వెతికేను ఎవరయినా చూసారేమోనని అందర్నీ అడిగేను. పూజ గదిలో సామాను ఎవడు తీస్తాడు? ఆ రెండు కుందుల్నీ ఆరోజు నువ్వు చూసాక మేమెవరం చూడలేదు. నువ్వే ఆఖరుసారిగా చూసేవు. అవునా అవును. అయితే ఆ తర్వాత అవ్వే టయ్యాయి? అది తేలాల్సింది అవునా అవును. అంచేత ఆ విషయమేదో తేల్చదల్చు కున్నాను కాబట్టి, అదేదో తేల్చే అని అయ్య గారు కూడా చెప్పేరు కాబట్టి ధర్మపురి బైరాగి దగ్గర "అంజనం" వేయిస్తే అందులో ఎత్తు కెళ్లిన మనిషి కనబడిపోతుంది. నిజం తెలిసి పోతుంది. మన జోగులుగాడ్నిప్పుడు పంపు దామనుకుంటున్నాను" అని పైడమ్మతో చెప్పి

జోగుల్ని కేకేసి మళ్ళీ పైడమ్మతో "చూడు పైడమ్మా వాడితో 'అంజనా'నికి మా బేబీని గాని, నీ చిన్నకూతుర్నిగాని పంపిద్దామను కున్నాను. కానీ ఇద్దర్నీ వద్దు. మనిద్దరికీ సంబంధం లేనివాడ్నొకడ్ని ఏర్పాటు చేస్తాను. అప్పుడు మనకేవీ అనుమానాలుండవు" అని చెప్పి "ఓరే జోగులూ! ఎదురింటి మాస్టుగారి చిన్నబ్బాయిని ఎస్. టీ. ఓగారి భార్యగారు ఓ సారి రమ్మన్నారని తీసుకురారా" అని కేక వేసారు.

"అవునమ్మా. మాఁవు దొంగోళ్ళం అవునమ్మా మేఁవు దొంగోళ్ళవేనమ్మా మంచికిరోజుల్లేవమ్మా నాయేఁకివి దినాలు కావమ్మా ఇవి అన్నేయేఁకి రోజులు . ఇంత శతపోరు పెట్టినా మీరినుకోకుండా మాఁవు దొంఁగోళ్ళఁవేనని నిశ్చేపరిచేసారన్న మాట దొంగోళ్ళవేనమ్మా దొంఁగోళ్ళఁవే...ఎలాగా మా మీద చోరీతనవంటగట్టేరు కనక అంజి నాలు, అస్త సాముద్దిరికాలు ఏయిస్తానంటు న్నారు గనకా, అయ్యేయించే ముందర నాదో మాట ఇనుకోండమ్మగారు. అయ్యేయించే ముందు కార్లో మీరే మా గుడిసెకొచ్చి సూసు కోండి నిజానిజాలు మీరే ఇచారించుకోండి" అని పైడమ్మ కళ్లు తుడుచుకొని మళ్ళీ అంది: "నా పిల్లల మీద ఒట్టేసి సెబుతున్నానమ్మా. నానేం మీ వొస్తువు సంగతెరగను " అనేసి మరి లాభం లేదని తెల్సుకొని. "ఎ కర్ర నగ్గుంటే ఆ కర్ర కాలుద్ది" అనేసి నూతి గట్టునో మూల కూర్చుని ఏడ్డం మొదలెట్టింది పైడమ్మ.

జోగులు ఎదురింటి మాస్టుగారి చిన్న బ్బాయిని తీసుకొచ్చేడు. ఆ వెనువెంటనే అమ్మగారు, అయ్యగారి నడిగి ఓ ఐదు రూపా యలు తీసుకుని అంజనం వేయించడానికి ఖర్చుకి జోగులికిచ్చేరు. ఆ పిదప మాస్టుగారి చిన్నబ్బాయితో సహా జోగులు ధర్మపురి బైరాగి దగ్గరకి సైకిల్ మీద బయల్దేరేడు.

నూతిగట్టు నానుకుని కూర్చున్న పైడమ్మ అలా నూతి గట్టునే చాలాసేపు మతిలేనిదాన్లా కూర్చుండిపోయింది. రోహిణి కార్తిలో నడి రోడ్డుమీద మొహం తిరిగి పడిపోయినదాన్లా కూర్చుండిపోయింది. దిక్కూ దివాణం లేకుండా ఎడార్లో ప్రయాణం చేసే ఒంటరి పక్షిలా కూర్చుండిపోయింది. అలా ఎంతసేపయిందో. తెలీదు.

మధ్యాహ్నం రెండైంది.

ధర్మపురి నుంచి జోగులొచ్చాడు. జోగుల్తో వెళ్ళిన ఎదురింటి మాస్టారి కొడుకూ వచ్చేడు అప్పటికే ఈ విషయం తెల్సి ఈ పైనంపట్ల కుతూహలంగా ఎప్పుడెప్పుడని కాసుక్కూ చున్న అమ్మలక్కలు "ఏవైందేవైందంటూ" బిలబిలా వచ్చేరు. అమ్మగారు లోన్నుంచి "ఒసేవ్ .. పైడీ! ఇల్రాయే . వున్నది వున్నట్టు మేస్టారి కొడుకు చెబుతాడు విను " అని కేకేసారు.

"ఉదయాన్నే ఎవడి మొకం సూసాన్రా బగవంతుడా, ఇలాటి సిక్కొచ్చి పడినాది ఇలాటి మచ్చొచ్చి పడినాది. నిప్పులా బతికి నానిమీద నీడ పడినాది" విచారించి, వూపిర్ని బిగపట్టుకుని నూతి గట్టుమీంచి లేచింది పైడమ్మ.

ధర్మపురి బైరాగి వెళ్ళగానే వున్నాట్ట. మాస్టుగారబ్బాయిని వెళ్ళిన వెంటనే నూతిలో నీళ్లు తోడి కాళ్ళూ చేతులూ కడుక్కోమన్నాట్ట. ఆ పిదప తనూ కాళ్ళూ చేతులూ కడుక్కుని వచ్చి కూచున్నాట్ట. మాస్టుగారి కొడుకుని తన కెదురుగా కూర్చోబెట్టుకుని, తన అరచేతిలో కాటుకని చందమామలా గుండ్రంగా దిద్దుకుని,

"సూసింది సూసినట్టుగా సెప్పబ్బాయ్" అన్నాట్ట. జోగులు చెబుతున్నదాన్ని విని అక్కడ్నుంచి మేస్టుగారబ్బాయిని అడగటం మొదలెట్టారు అమ్మలక్కలు.

"నా చేతుల్ని కళ్ళకు అటూ యిటూ పెట్టు కోమన్నాడండి."

"తర్వాత?"

"కాటుక రాసుకున్న తన అరచేతిని నా కళ్ళ ముందుంచేడండి."

"తర్వాత్తర్వాత?"

"అంతా చీకటిగా లైట్లారిపోయినట్టవుపిం చిందండి."

"తర్వాత నాయనా ?"

"అందులో కనబడింది కనబడినట్టుగా చెప్పమన్నాడండి ఆ బైరాగి" మధ్యలో జోగులు అడ్డం వచ్చేడు.

"నువ్వూరుకోరా. " అమ్మగారు గసిరేరు.

"నువ్వు చెప్పు బాబూ "

"ఆ చీకట్లో ముందు యిల్లు కనబడింది."

"ఎవరిల్లు బాబూ?"

"ఇల్లా...మేడా?"

"ఈ మేడే కనబడిందండీ."

"పూజా మందిరం కనబడిందండి."

"పూజా మందిరమే?"

"పూజా మందిరంలోకి ఒకావిడ వెళ్ళటం కనబడింది."

"ఆడమనిషా.. మగోడా?" ఎవరిదో ప్రశ్న.

"ఒకావిడని అంటుంటే, ఆడమనిషా, మగ మనిషాని ఏవిటా చిత్రాంగి ప్రశ్నలు?" ఎవరో పెద్దావిడ విసుక్కుంది.

"పూజామందిరం దగ్గరున్న వెండికుందు రెండూ చేతిలోకి తీసుకుని బైటకొచ్చేసి, అటూ ఇటూ చూసి నూతిగట్టు వేపున్న రేకు తలుపు వేపు వెళ్లిందండి."

"ఆ ఆడమనిషి కనబడిందా బాబూ?"

"కనబడిందండి పైడమ్మలాగే వుందండి పైడమ్మేనండి."

పైడమ్మ మరక్కడ వుండలేకపోయింది. లేచొచ్చేసింది. లేచొచ్చేసిన పైడమ్మ జాంచెట్టు మొదట్లో కూర్చుని "నానేం దొంగతనవూ సెయ్యనేదు ఆ సూణ్నారాయణ మూరితి సాచ్చిగా నానే సోరీ ఎరగను ప్రబో" అని తల బాదుకుని, గుండె కొట్టుకుని ఏడ్చింది.

అయితే ఆ మాటలెవరు నమ్ముతారు? ప్రత్యక్షంగా చూసినట్టు ధర్మపురి బైరాగి అంజనంతో పైడమ్మ రెండు కుందులూ దొంగతనంచేసి పారిపోవడం కనబడిపోతే "నా తియ్యనేదు బగవంతుడా" అంటే ఎవరు నమ్ముతారు. ఎవరూ నమ్మరు.

"అయితే ఇప్పుడేం చేస్తారు?" అని ఎవరో సుభద్రమ్మగార్ని కుతూహలంగా ప్రశ్నించేరు. ఆ మాటకి అమ్మగారు—

"దొంగదాన్ని పన్లోకి తెచ్చుకోడం నాదీ బుద్ధి తక్కువ" న్నారు. ఆ మాటకి ఇంకో భామామణి—

"ఇవాళ ఇది మీ ఇంట్లో అయింది. రేపు మా యింట్లో అవుతుంది. అంచేత పోలీసు రిపోర్టివ్వండి" అని సలహా పారేసింది ఆ సలహాను ఇంకో మహిళారత్నం క్రింద పడకుండా పట్టుకుని "అంతెందుకులెండి ఆ వెండి కుందుల ధర ఇమ్మని, పన్లోంచి మాన్పించేయండి" అని బహు భేషుగ్గా చెప్పింది.

"ఇంతయ్యాక పని మాన్పించక నువ్వే కావాలేనని వుంచుతారేటి" అని ఇంకో పన్లేనావిడ అంది.

అన్ని మాటలూ జాంచెట్టు మొదట్లో కూర్చున్న పైడమ్మకి విన్పిస్తూనే వున్నాయి. ఆ తర్వాత ఎవరో ఒకావిడ వచ్చి పైడమ్మతో "ఆ కుందు లెక్కడయినా, నీ కూతురు పెళ్లికి డబ్బు కావల్సి వొచ్చి తాకట్టు పెడితే చెప్పు పర్లేదు అమ్మగారు ఇడిపిస్తారు " అని అన్నారు. "లేకపోతే నువ్వే తీసేసినట్టు రుజువైంది కాబట్టి ఆ డబ్బిచ్చేసి పని మానీ" అన్నారు.

"అనాగేనమ్మా అనాగే. ఇంత నింద పడ్డాక ఇంతనిజం తెల్సాక పోలీసుల్ని పిలిపించి కొట్లో ఎట్టించక దయ తల్చేరు దయ గల తల్లులు. ఇచ్చేత్తానమ్మా ఇచ్చేత్తాను ఆ డబ్బు సెల్లించేత్తాను ఆ దొంగతనం నానే సేసాను ఆయమ్మ ఏయమ్మో అన్నట్టు నా కూతురి పెళ్లి సంబడానికి డబ్బు సాలక మీ యింట్లో ఆ ఐదు తులాల ఎండికుందులూ నానే ఎత్తికెల్లి అమ్మేసుకుని, సొమ్ము సేసుకుని నా దినోరం సేసుకున్నానమ్మా. నానే తీసా తల్లీ నానే తీసాను" పిచ్చిగా, వెర్రిగా, జాలిగా, హృదయ విదారకంగా రోదిస్తూ ఆ మాటలంది పైడమ్మ.

ఆ తర్వాత పైడమ్మ మొగుడ్ని పిల్చి

విషయం చెప్పి, తనకి వాయిదాలమీద డబ్బు ఇచ్చేట్టుగా ఒప్పించి, అమ్మగారు ఆ వెండి కుందుల కథను అలా పరిసమాప్తి చేసేరు.

ఇది జరిగిన వారం రోజుల్నాడు, ఆ రోజు ఆదివారం. ఆ రోజు స్కూలు సెలవవటంవల్ల సుభద్రమ్మగారి కూతురు చిన్నన్నయ్యను పిల్చి "అన్నయ్యా, దేవుడిపెళ్లి బొమ్మలాట ఆడుకుందావా?" అంది.

అన్నయ్య "వూఁ" కొట్టాడు. చుట్టు ప్రక్కల పిల్లలందరూ ఆటకు పోగయ్యేరు. కొట్టు గదిలో దాచుకున్న లక్కపిడతలన్నీ తెచ్చుకుని మేడమీద వరండా చివర కూర్చున్నారు. మూటవిప్పి, లక్కపిడతలన్నీ పేర్చి కర్రదేవుణ్ణీ, దేవతనీ తీసి నిలబెట్టారు, దేవుడికీ దేవతకీ తల్లి నడిగి నూనెతెచ్చి దీపాలు వెలిగించేరు. వుత్తుత్తి అన్నం కూరా వండుకుని వుత్తిత్తి భోజనం చేసేరు. గోల చేసారు. బట్టలారబెట్టుకోడానికి మేడమీద కొచ్చిన అమ్మగారు "ఏమిటర్రా ఆ గోల"ని పిల్లల్ని గసురుతూ "పూజల్లో నన్ను మించిపోయింది నా కూతురని" ఇంటికి దీపంలాంటి ఒక్కగానొక్క కూతుర్ని ముద్దులాడ్డానికి దగ్గరకొచ్చి అక్కడ వెలుగుతూ కన్పించిన దీపాలవేపు చూస్తూ నిశ్చేష్టురాలై పోయినిలబడిపోయారు. ఆవిడకి ఆ సమయంలో మాట రాలేదు. "ఏవండీ" అనికేకేస్తే క్రిందనుంచి అయ్యగారు పరుగెత్తుకొచ్చేరు.

"ఇవి నీకెక్కడివే" అని కోపంగా అడిగారు అమ్మగారు తమ ఇంటి దీపాన్ని.

"అన్న యిచ్చేడు" అని తన చిన్నారి అన్నయ్యను చూపెట్టి క్రూరంగా ముఖం పెట్టుకొని చూస్తున్న 'అమ్మ'ని చూసి ఏడుపు లంకించింది ఇంటిదీపం.

"ఒరేయ్. నీకెక్కడివిరా?" అని చిన్నారి అన్నయ్య నడిగేరు అమ్మా నాన్నలు.

"పెద్దన్న . య్యి ..చ్చే . డు . ." అని జవాబు చెప్పేడు.

"ఓరేయ్ పెద్దన్నయ్యా...పెద్దన్నయ్యా." వాను పరుగెత్తుకొచ్చేడు.

"ఇవి వాళ్ళకిచ్చింది నువ్వేనా?"

"అవున్నేనే. . దేవుడి పూజ బొమ్మలాట లాడుకుంటున్నాం ఇయ్యాన్నయ్యా అంటే ఆ ఆ రోజేరోజో జ్ఞాపకం లేదు మమ్మీ. మేడ మీద ఎండుతున్న వీటిని సరదాగా ఆడుకోమని నేనే ఇచ్చేను. ఏం తప్పా" అని ఎదురు ప్రశ్న వేసేడు పెద్దన్నయ్య.

"అయితే ఆ సంగతి నాకెందుకు చెప్పలేదు" అని అమ్మగారు కొడుకు మీద విరుచుకుపడ్డారు. విరుచుకుపడి ఆవిడ అయ్యగారివేపు పిర్గ్గా చూసేరు.

"జరిగిందేదో జరిగిపోయింది. ఈవిషయం ఎక్కడికీ పొక్కకుండా జాగ్రత్తపడండి" అని కళ్ళతోనే అమ్మగార్ని ఓదార్చి క్రిందకు వెళ్లిపోయారు.

అమ్మగారి కొక్కసారి పెదమ్మ గుర్తొచ్చింది. "ఆకల్తో సచ్చానేగానండమ్మగోరు కక్కుర్తిపడి సోరీతనం సెయ్యలేద"న్న పెదమ్మ మాటలూ ఏడుపూ వినబడినట్లాయ్యాయి.

"ఈ సంగతి పెదమ్మకు తెలిస్తే" అనే ఆలోచనొచ్చేసరికి అమ్మగారు గజగజా వణికిపోయారు. వెంటనే ఇంట్లో పిల్లల్ని పిలిచి ఈ సంగతి ఎక్కడా తెలియకూడదని ఖాయిదా చేసారు.

"అయితే ధర్మపురి బైరాగి అంజనం సంగతో" ఎంత కొట్టుకు చచ్చినా ఆ విషయవేఁ ఆవిడకు అర్థం కాలేదు సరిగదా కాంద్రు-కాంద్రుమని దర్జా దర్పాలతో తిరిగే పెద్దపులి, షో కేసులో పెట్టిన దూదిపులిలా చాలాసేపు మౌనంగా నిశ్శబ్దంగా నిల్చుండిపోయింది. □



# దేవుని ముగింపు

సాయంత్రం నాలుగున్నర. పనులు కట్టేసి మెకానిక్కులు, క్లీనర్లు ఎంతవేగం ఇంటికి పారిపోదామా అని ఆతృత పడుతున్నారు. అల్లరి పెడుతున్న కొన్ని ఇంజన్ల మీద మెకానిక్కులు పైమయిపోతోందని గాబరాగా పనిచేస్తున్నారు. చిన్న షంటింగ్ రైల్వే డీజలింజన్లని మెయిన్‌టెయిన్‌చేసే చిన్న లోకోషెడ్ అది. లూబ్రికేటింగ్ ప్రజర్ డెవెలప్ అవడంలేదని నేనూ అవస్థ పడుతూనే వున్నాను నా ఇంజనుతో. ఎదురుగా విండో గ్లాస్‌లోంచి పక్క లైను పక్కచూసి గతుక్కుమన్నాను.

నా చూపులు ఎంత మెరుపులా ప్రసారమయ్యాయో అన్ని క్షణాల్లోనే ఎవరిమీంచో ఇంజను పోవడం కళ్ళారా చూసేను. నా ఇంజన్ని షట్ డౌన్ చేసాను. వెంటనే అటు పరిగెడదామని ఫుట్‌బోర్డుమీద కొచ్చేను. ఏక్సిడెంట్ అయిన ఇంజనికీ నా ఇంజనికీ అట్టే దూరంలేదు. ఫైనల్ టెస్టింగ్ కోసం నేను ఇంజన్ని టెష్టుచేస్తున్న సమయంలో పక్క లైన్లో జరిగిందీ ఘోరం. భూమిమీదకు గెంతేనో లేదో ఆ ఇంజను షంటరు (డ్రైవరు) రాములు నా దగ్గరికి పరిగెత్తు కొచ్చేడు ఏక్సిడెంటయిన ఇంజన్ని వదిలేసి.

నాకూ రాములికీ తప్ప ఏక్సిడెంటయినట్టు మరో పిట్టకూ్కడా తెలీదు.

"సార్ .మీ ఋణం జన్మజన్మలకీ "

ఏదో అనబోతున్నాడు. రాములు నోటంట మాట రావడంలేదు.

"ఇప్పుడెలా? బ్రతికి వున్నాడో లేదో చూడాలి పద."

"సార్. మనిషి మధ్యగా చక్రాలు దొర్లుకుపోయేయి. ముక్కలుగా శవం పడింది. ఎవరికీ తెలీదు. మీమట్టుకు చూడనట్లు వూరుకోండి. తక్కినది నా అదృష్టంమీద ఆధారపడి వుంటుంది."

ఆయాసపోతున్నాడు రాములు.

చచ్చినవాడు ఎలానూ చచ్చేడు. బ్రతికున్న మనిషిని ఇక్కడివాళ్లు చంపేయకుండా చూడాలి. షెడ్ మధ్యస్థంగా ఈ ఏక్సిడెంట్ ఎవరు చూసినా రాముల్ని చంపేయక మానరు.

"ఇంతకీ ఎవరది?"

"బనారసి"

ఉత్తర ప్రదేశ్‌నుంచి ఇంతదూరం కడుపు

గుడిమెట్ల గోపాలకృష్ణ

పట్టుకు వచ్చిన అమాయకుడు బనారసి మరి లేడా? ఏ పని చెప్పినా తలూపి ఆక్షణం చేసేసే ప్యూన్ బనారసి మరి లేడంటే నమ్మ బుద్ధి కావడంలేదు.

అసలు రాములు షెడ్‌లో స్పీడ్‌గా డ్రయివ్ చేస్తాడని ఎన్నోసార్లు స్టాఫ్ రిపోర్టున్నవున్నాయి. అయినా రాముల్ని ఈ క్షణంలో చూస్తుంటే జాలేస్తోంది.

"ఏమీ ఎరగనట్టు షంటర్స్ రూమ్‌లో వెళ్ళి కూర్చో." అన్నాను.

ప్రాణాలు బిగపట్టుకు షంటర్స్ రూమ్‌కి పోయేడు రాములు.

చార్జిమేన్‌గా ఫైనల్ టెస్టింగ్ నా ఇంజన్ని నేను చేస్తున్నాను. అయితే యిప్పుడు ఆక్సిడెంటయిన లైన్‌లోంచే నేను నా ఇంజన్ని ప్లేస్‌మెంట్ చెయ్యాలి షెడ్డులో. ఇదిచాలా రిస్కు. ఒకటి ఏక్సిడెంటయిన ఇంజన్ని నా ఇంజన్‌తో కపులప్ చేసినపుడు బాక్స్ సి.బి.సి. అనే ఆటోమెటిక్ టైప్ కప్లింగ్‌వల్ల పెద్దసౌండ్ క్రియేట్ కావచ్చు. రెండు: ఆ ఏక్సిడెంట్ నేనే చేసినట్లుగా నేరం నామీదకు రావచ్చు. ఇది చాలా రిస్కని తెల్సినా మరో పదినిమిషాలెలాగయినా శవాన్ని ఎవరికంటా పడకుండాగానీ వుంచితే అంతా రేపటికి గప్‌చిప్. టోకన్ క్లర్కు బహుశా బనారసి చార్జిమేన్ దగ్గర పర్మిషన్ తీసుకుపోయింటాడని అనుకుంటాడు లాస్టున. శవాన్ని రాత్రి మాయం చేసెయ్యచ్చు. తర్వాత ఏదోకథ పుట్టించచ్చు.

ధైర్యంతో బండిని శవంమీంచి లాగించేసాను. రూట్ సెట్టింగ్ చేసేపద్ధతి ఎవరూచూసే ఆస్కారంలేదు. అందరూ టోకిన్ల గొడవలో వున్నారు. అదీకాక యిది పూర్తిగా షెడ్‌కి ఇంటీరియర్. షంటింగ్ రూమ్‌లోంచి రాములు కేకలు పెట్టుకుంటూ పైకి వచ్చేశాడు.

"రన్నోవరు. చార్జిమేన్ టెస్టుచేస్తున్న ఇంజనుకింద బనారసి పడిపోయాడు"

ఇదీ రాములు అరుపు.

జనం పొలోమని నావక్క పరుగు. నా కాళ్ళు గజగజ.

నా అమాయకత్వాన్ని, నా మంచితనాన్ని రాములు పులిపంజాదెబ్బ కొట్టేడు. చేతులు



నామీద పడ్డాయి. గాయాలు ఒంటికి. ఎన్నో అంటున్నారు. రక్తం .

కర్రతో ఎవరో తలమీద కొట్టేరు

ఇంతలో 'చీటీ' అనుకుంటూ ఎవరో పరుగెత్తుకు వచ్చేరు.

'నా చావుకు ఎవరూ కారణం కాదు'— బనారసి. ఇదీ చీటీ.

*　　*　　*

రాత్రి పన్నెండు. తలుపు యెవరో కొడుతున్న చప్పుడు. దెబ్బలకి ఫష్టెయిడ్ చేసింది శ్రీమతి. ఆమె ఒహాటే గోల.

"ఎవరోతలుపుతీయ్యి"అన్నాను సత్యవతితో.

సత్యవతి నన్ను మనసారా ప్రేమించే ఇల్లాలు.

రాములు ..

'ఛీ నీ ముఖం నాకు చూపక!'

'నేను దుర్మార్గుణ్ని సార్. కానీ ఆ చీటీ పడేసింది నేనే.'

రాముల్ని ఈక్షణంలో యెలా అర్థం చేసుకోను? అయితే నేరం నామీద మోపేందుకు ఎందుకు ప్రయత్నించినట్టు? అవకాశం ఆలోచనలు . స్వార్థం మనిషి మనసేవుంది రాములిక్కూడా. రాములులో వున్నది విశ్వాసఘాతుకత్వంకాదు. పరిస్థితుల ప్రభావంలోవున్న ఆవేశం అంతే

"పోన్లే జరిగిందేదో జరిగింది. ఇక ఎవ్వరికీ ఏమీ చెప్పకుండా జాగ్రత్తగా మసలుకో. శవాన్ని రేపు పోస్టుమార్టమ్ చెయ్యొచ్చు. అన్ని దగ్గరుండి గబగబా జరిపించేసేయ్. అందరూ ఆత్మహత్య అని నమ్మేశారుకాబట్టి మరింకేం భయంలేదు."

"వెళ్ళొస్తాను సార్."

*　　*　　*

మర్నాడు మధ్యాహ్నం ఒంటిగంట.

శవం జేబులో మరోకాయితం.

'ఆత్మహత్య చేసుకుంటున్నందుకు విచారిస్తున్నాను. పరిస్థితుల ప్రాబల్యంవల్ల యిలా చేస్తున్నాను. ఎవరూ నా చావుకు బాధ్యులు కారు' బనారసి.

బనారసి నిజ సంతకం అది.

నేనదిచూసేక పెద్దగా ఆశ్చర్యపోలేదు. ఎందుకంటే అది జరిగిపోయిన అఘాయిత్యానికి భగవంతుడిచ్చిన సరయిన ముగింపు బహుశా. (కల్పితం) □





సీరియల్

# ప్రాణా-మల్లిక



ఐవియస్ అచ్యుతవల్లి

ఫారిన్ పోవాలంటే మాటలతో మూటలతో అయ్యే పనా! వీసాలు మీసాలూ అంటూ బోలెడు గొడవలు

అవి అన్నీ క్షణాలమీద వస్తాయి నీకెందుకు? నీకు నిజంగా ఫారిన్ కంట్రీస్ చూడాలని వుందా?

"మా అన్నయ్యలు యిద్దరు అమెరికాలో సెటిలయ్యారు. ఒకడు ఆస్ట్రేలియాలో ఇంకొకడు లండన్‌లోనూ వున్నారు. మిగతా ఇద్దరూ రెండేళ్ళకో మూడేళ్ళకోవస్తారు కాని,అమెరికా అన్నయ్యలు అక్కడే సెటిలయ్యారు. వాళ్ళ పిల్లలకి కూడా అక్కడ వలస వెళ్ళి స్థిరపడిన హిందూ కుటుంబాలలోనే సంబంధబాంధవ్యాలు చేస్తారుట" అంది నళిని.

"అయితే ఇంకేం! టూరిస్ట్ పాస్‌పోర్ట్‌కు ట్రయిచేద్దాం. నీవంకన నేను కూడా చూస్తాను అన్ని దేశాలూ!" అంది సుభ వుత్సాహంగా.

"మా నాన్నగారికి లెటర్ వ్రాసి డబ్బు తెప్పిస్తాను. బడ్జెట్ ప్రిపేర్ చేయి" అంది నళిని.

"నాన్నగారి కెందుకు ఆయింట్‌మెంట్! జగానికి నాధుడు లాంటి జగన్నాధులుంగారు వున్నారు కదా!"

"ఆయన జగానికి నాదులు కాని నాకు నాధులు కారు.''

"ఏమిటే ఆ కథ?" అంది సుభ. నళిని వచ్చినది మొదలు సుభ గమనిస్తూనే వుంది. తిరిగి వెళ్ళటానికి కాని, భర్త దగ్గరనుంచి వర్తమానం వినటానికి కాని నళిని తహతహ పడటం లేదు. నళిని భర్తని చేరుకోవటానికి కన్నా ఫారిన్ కంట్రీస్ సందర్శించటానికి ఎక్కువ ఉత్సాహం చూపటంతో నళినికి ఏదో కథ వుందని సుభ అనుమానించింది.

"కథేమిటి! కథేమీ లేదు" అంది నళిని అతి సాదాగా వుండటానికి ప్రయత్నించుతూ.

"నా దగ్గర దాస్తున్నావా? నళినీ! కథేమీ లేకపోతే, ఆయననించి పారిపోవటానికి ఎందుకు ప్రయత్నించుతున్నావ్?'' అంది సుభ సూటిగా చూస్తూ. చాలా పదిలంగా, కట్టు దిట్టంగా, ఎంతో మనోనిబ్బరంతో కాపాడు కుంటూ వస్తున్న జీవ రహస్యం సుభ సూటి ప్రశ్నతో చెల్లాచెదరు అయ్యింది. గాజు తలుపు మీద వాడి అయిన దెబ్బతో కొట్టితే వెయ్యి శకలాలుగా చిట్లినట్లు నళిని హృదయాంతర్గత విషయం వెయ్యి ముక్కలుగా చీలిపోయింది. నళిని కళ్ళు తడితో తళతళలాడుతున్నాయి. శోకం రావటానికి చిహ్నంగా ముక్కు కొస ఎర్రబారింది. పెదాలు రావిరేకుల్లా రెపరెప లాడాయి. అయినా తమాయించుకుంది.

"ఎందుకు అనుకుంటున్నావ్ అలాగ?''

"వసే! మీ ఇద్దరికీ పిల్లా పీచూ లేదు. ఒకరికి ఒకరుగా వుండాల్సిన సంసారం మీది. పది రోజులయినా ఒక్కరోజయినా మావారు ఇల్లా అంటారని కాని, ఆయనకి ఇది ఇష్టమని కాని మాటవరసకయినా అన్నావా? ఆయన ట్రంకాల్ చేస్తే కూడా, దానికి జవాబు యీయ కుండా ఫారిన్ వెళ్ళదామా అంటున్నావు. దానినిబట్టి ఇదేదో కీచులాట వ్యవహారం అను కోకుండా వుండటం ఎలా సాధ్యం?"

"పధ్నాలుగేళ్ళబట్టీ ఒకళ్ళని ఒకళ్ళు విడిచి పెట్టకుండా సంసారం చేసివున్నాము. విరహం లోని వేడి, వాడి మాకు అనుభవంలోకి రాలేదు. టైం యీజ్ వెరీ షార్టు. అంచేత విరహం కూడా అనుభవింపచేద్దామని ప్లానులు వేస్తున్నాను అంతే! ఖంగారు పడిపోకు" అంది తేలిగ్గా.

"అయినా మీ వారికి పెద్ద రాచకార్యాలేమి వున్నాయి? మీ అన్నయ్యా లున్నారన్నావు. ఇద్దరూ సరదాగా ఒక ట్రిప్పు వేసిరాకూడదూ! అయినవాళ్ళుండగా ఆలోచన దేనికి?"

"ఆలోచన కాదు. ఆ ఉత్సాహం లేదు. మా పుట్టింటికి కూడా మరీ మా పెళ్ళి అయిన మొదటి రోజుల్లో వచ్చేరు ఒకటి రెండు సార్లు. మళ్ళీ ఆయన మా యింటికి రాలేదు. నేనే అటూ యిటూ తిరుగుతూ వుంటాను'' అంది నళిని.

"పోనీ దేశంలో అయితే ఏదో అనుకో వచ్చును. ఫారిన్ ట్రిప్ కదా! ఒకసారి మీ వూరు వెళ్ళివస్తావా? ఈలోగా నేను కావల్సిన వాళ్ళని నలుగుర్ని కలుసుకుంటాను. ఒకటి రెండు నెలలు పడుతుంది."

"ఎందుకు! నేను మద్రాసు వెళుతున్నాను. మా అక్కయ్య కొడుకు వున్నాడు. అక్కడికి వెళ్ళినాక నీకు జాబు వ్రాస్తాను. ఆ అడ్రసుకి

**జరిగిన కథ :**

రామనాథం కూతురు సుమన ఆ వూళ్ళోని మరో రైతు జగన్నాధరావు వైపు ఆకర్షితురాలయింది. జగన్నాధరావు భార్య నళినికీ సుమనకూ స్నేహం కలిగింది. పరస్పరం ఆకర్షింపబడ్డ జగన్నాధరావు, సుమన లభించిన అనుకూల పరిస్థితులలో శారీరకంగా కూడా దగ్గరయ్యారు. నళినికీ, వినతకూ కూడా జగన్నాధరావు, సుమనలపై అనుమానం కలిగింది. తన ఆరోగ్యం చెడిపోవడంతో తన భర్తను చేసుకొమ్మని సుమనను కోరింది సావిత్రి. సుమన అంగీకరించలేదు. వినత ఒప్పుకొంది బావగారిని చేసుకోవడానికి. తనని పెళ్లి చేసుకొమ్మని జగన్నాధరావుని అడిగింది సుమన. జగన్నాధరావు అందుకు సుముఖంగా లేడు. నళిని మహిళా సభలో పాల్గొనడానికి ఢిల్లీ కెళ్లింది.

ప్రొసీడింగ్స్ వ్రాయి" అంది నళిని.

ముందు నళినికి అక్కడ్నించి కాశ్మీరుకి వెళ్ళాలనుంది సుభ పట్టుపట్టి తనని అడుగుతూంటే మనస్సులోనే అప్పటి కప్పుడు మద్రాసు ప్రయాణం నిర్ణయించేసింది. కప్పదాటుగా ముందు అక్కడ్నించి తప్పుకుంటే తర్వాత చూసుకోవచ్చును అనుకొంది నళిని. తర్వాత నాలుగు రోజులున్నా ఢిల్లీ చుట్టుపక్కల ప్రశస్తమయిన స్థలాలన్నీ చూస్తూన్నా సుభ నళిని భర్తయొక్క సంగతులు అడగకుండా వూరుకుంది. సుభ త్యాగంగల మనిషి. రెండు మూడు తడవల మాటలలో నళినికి భర్తయొక్క ప్రసక్తి తేవటం నచ్చదని గ్రహించింది. నళిని బంగారు పిచ్చుక. అలాంటి మనిషితో స్నేహం సడలించుకోవటం ఏమాత్రం ఇష్టంలేదు. సుభ మద్రాసుకి ట్రయిన్ ఎక్కించటానికి స్టేషన్‌కి వచ్చినప్పుడు సుభ కళ్ళల్లో నీళ్ళు మెరిసాయి.

"చాలా రోజులకి ఇద్దరం కలిసి హేపీగా గడిపాము. త్వరలోనే మన ఫారిన్ ట్రిప్‌కి ఏర్పాటు చేయనా?" అంది.

"నేను వెళ్లి ఆలోచించి వెంటనే వ్రాస్తాను" అంది నళిని.

"తప్పక వ్రాయి. గౌతం కూడా వెళ్ళమన్నారు! తనకీ చాలా సరదా. కాని తిరిగితే బిజినెస్ దెబ్బతింటుందని భయం. నువ్వు ష్యూర్‌గా వస్తానని అంటే నేను కొంచెం డబ్బూ గిబ్బూ జాగ్రత్త చేసుకోవాలి కదా! టైం కావాలి."

"వ్రాస్తానుకదా!" అంది నళిని.

"నీ జాబు కోసం ఎదురు చూస్తాను" అంది సుబ్బలక్ష్మి-మారిన సుభా గౌతం. నళిని తల వూపి నవ్వింది. స్నేహితురాలి ఆంతర్యం గుర్తించినట్లు వుంది ఆ నవ్వు.

* * *

"ఇంకా రాలేదేమిటి?" సుమన అడిగిన ప్రశ్నకు తల అడ్డంగా వూపాడు జగన్నాధరావు. సుమనకు అంతా అగమ్యగోచరంగా వుంది. నళిని ఇదిగో సభలు అంటూ తనకు ఇల్లు, స్కూలు అప్పచెప్పి వెళ్లి మూడు నెలలు గడుస్తోంది. మద్రాసునించి కాబోలు స్కూల్ ఎల్లా వుంది? వూళ్ళో మహిళామండలి, పంచాయతీ ఎల్లా నడుస్తోంది అంటూ ఒక వుత్తరం వ్రాసింది సుమనకు. ఆ వుత్తరం కేవలం ఫార్మాలిటీకి వ్రాసినట్లున్నది కాని, తన ఇల్లూ వాకిలీ కోసం ఆరాటపడే ఒక స్త్రీ వ్రాసినట్లు లేదు. తనకి తను వచ్చేదాకా ఇల్లూ, వాకిలీ చూస్తూండమని పనిమనిషికి, నమ్మకమయిన బంధువుకి అప్పచెప్పినట్లు అన్నది కాని, తనకి జగన్నాధరావుకీ మధ్య సంబంధము గుర్తించినట్లు చెప్పలేదు. ఆయన ఆవిడ వెళ్ళే

ముందరే ఈ విషయం తేల్చివేయాల్సింది. వారం రోజులేకదా! వెళ్ళివచ్చేక నెమ్మదిగా ఈ సమస్య చర్చించుకుందాం అనుకున్నారు.

"మీకేమయినా వ్రాసారా?" అంది సుమన.

"ఊహుఁ" అన్నాడు. సుమనకు చిరాకెత్తిపోతోంది. స్కూల్‌కు కూడా రెగ్యులర్‌గా వెళ్ళటం లేదు. హెడ్‌మిస్ట్రెస్ వాళ్ళు మామూలుగా నడుపుకుపోతున్నారు. జగన్నాధరావుకీ మనస్సులో దిగులు పేరుకుపోతోంది. నళిని ఎందుకిలా వూళ్ళు పట్టుకు తిరుగుతోందా అని రాత్రింబవళ్ళు ఆలోచిస్తున్నాడు. మొదటి పదిహేను రోజులూ సుమన తానూ చాలా సార్లు ఫ్రీగా సంతోషంగా తమ పడక గదిలోనే కలుసుకున్నారు. రాజమ్మ ఒకటి రెండు సార్లు వీళ్ళ పరిస్థితి గమనించినా "ఏదోలే! పెళ్ళీ పేరంటం లేని పిల్ల. ఆయనా వంటరిగా వున్నాడు. కక్కుర్తిపడ్డారు" అని ఆ సంగతిని తన మనస్సులోనే నొక్కిపట్టింది. పైగా నళినమ్మ చాలా మంచిది. ఈ పిల్ల ఇల్లా చేసిందని తెలుస్తే చాలా బాధపడుతుంది. ఆమెకి ఈ సంగతి తెలియనియ్యకూడదు అనే నిర్ణయం కూడా చేసుకుంది. సుమనతో మామూలుగానే ఆమె వచ్చినప్పుడు మాట్లాడేది. అప్పుడప్పుడు జగన్నాధరావుగారితో పాటు ఆమెకి కూడా వడ్డించేది. కొసరి కొసరి నళినికి ఎల్లా ప్రేమతో పెట్టేదో అల్లాగే ప్రేమగా పెట్టేది. రాను రాను సుమన ఆ ఇంట్లో తిరుగుతూంటే అనుక్షణం నళినే గుర్తుకు రాసాగింది. జగన్నాధరావుగారికి నళినితో వాంఛ లేకుండానే సంసారం చేసినా ఆ పదేళ్ళూ చాలా సాఫీగా హుందాగా తన జీవితం గౌరవంగా సుఖప్రదంగా జరిగినట్లు అన్పించసాగింది. సుమనతో వాంఛలు మనస్ఫూర్తిగా తీర్చుకుంటున్నా ఇందులో ఏదో అక్రమము అగౌరవము వుందనిపించి అతని మనస్సు బరువెక్కిపోయేది. తరుచు గుండెల్లో బరువు. వారానికి నాలుగయిదు రోజులు ఏదో వంకన ముసుగుతన్ని పడుకొని ఆలోచించేవాడు. నళినికి ఎన్ని జాబులు వ్రాసినా మా అన్నయ్య కూతురు రమ్మంది. నాలుగు రోజుల్లో వెళ్ళివస్తాను. మా అక్కయ్య కోడలుండమంది. రెండు రోజులు చూసి వస్తాను అంటూ మధుర, మైసూరు, మద్రాసు, త్రివేండ్రమ్-ఒక్కొక్క వూరు నించీ వ్రాస్తూ వస్తూంది. జగన్నాధరావుకి తలనొప్పి వచ్చేస్తోంది. ఇన్నాళ్ళూలేని ఈ బంధువులు నళిని వస్తే ఇంత ఆప్యాయతగా ఘనంగా స్వాగతాలు పల్కుతున్నారు. ఇన్నాళ్ళు ఎందుకు రమ్మనలేదు? ఈ బంధువులంతా కొత్తగా పుట్టుకొచ్చారా? అందరూ సంసారాలు వదులుకొని బంధువుల ఇళ్ళమ్మట ఇల్లాగే తిరుగుతున్నారా? ఇటు చూస్తే సుమనకి హడావిడి ఎక్కువగా వుంది.

"మన మాట చెప్పండి. ఎన్నాళ్ళిలాగ? మనం పెళ్ళి చేసేసుకుందాం" అంటోంది.

"తను వూళ్ళో లేనప్పుడు మనం తొందరపడితే బాగుండదు సుమనా! తను రానీయి. వచ్చేక అంతా కలిసి ఆలోచించుదాం. పెళ్ళాం వూళ్ళో లేని సమయంలో మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడని అందరూ నిందలు వేస్తారు. తొందరపడిపోకు" అంటున్నాడు. నళిని రాక కోసం జగన్నాధరావుగారే కాక సుమన కూడా ఎదురు తెన్నులు చూస్తోంది. జగన్నాధరావుకి సుమనతో కలవడానికి కూడా మనస్కరించటం లేదు. తన ఇంట్లో పూడ్చలేని అగాధం ఎర్పడినట్లు అన్పించుతోంది.

"అబ్బబ్బ! నళిని చచ్చిపోయినా బాగుండును. నలుగురితోపాటుగా ఏడ్చేసి సుమనతో బాహాటంగా సంసారం చేద్దును. ఇప్పుడు సంసారం అన్ని సౌకర్యాలతోనూ జరుగుతున్నా ఇంత వెలితి, ఇంత బాధ తన జీవితంలో ఎప్పుడూ అనుభవించలేదు'' అనుకొంటున్నాడు. అందుకనే కోపంగా నళినికి జాబు వ్రాసేసాడు జగన్నాధరావుగారు.

ఆ రాత్రి ఏదో విషయాలు చర్చిస్తూ చాలా పొద్దు పోయినదాకా సుమన జగన్నాధరావుగారింట్లో వుండిపోయింది. రాజమ్మ హాలులోనికి వచ్చింది.



"నీకిష్టమని వంకాయ పచ్చిపులుసు పెట్టాను. భోజనానికి వుండిపోమ్మా! నాలుగు వడియాలు వేయించి పిలుస్తాను" అని వెళ్లింది. మునుపు రాజమ్మ సుమనని అల్లా ప్రేమగా పిలిచి భోజనం చేయమంటే జగన్నాధరావు మురిసిపోయేవాడు. ఇప్పుడు చిరాకు వేసింది. చప్పున "నళిని లేదుకదా! పెత్తనం అంతా ఈవిడిదే అయిపోయింది" అన్నాడు.

"మీరే చేయమన్నారుగా పెత్తనం?"

"నేనా?"

"ఆఁ! నాకేం తెలుసు! అన్నీ ఆమెకే తెలియాలి అంటూండేవాళ్ళు కదా!"

"ఏదో మాటవరసకి అన్నానేమో!"

"మాట వరసకి అన్నారని ఆమెకి తెలియదేమో!" అంది సుమన. ఏదన్నా ఎడమాటకి పెడమాట అనే అలవాటుంది సుమనకు.

చిన్నప్పట్నించీ చదువుకుంటున్న పిల్ల అనే గారంవల్ల ఇంట్లో ఆమెదే పై చేయిగా గడుపు కొచ్చేవారు. జగన్నాధరావు మితిమీరిన ప్రేమ చూపించటంతో అంతటి వాడినయినా ఎంత మాటన్నా అడగగల్గే చనువు వచ్చింది.

"యతి అంటే ప్రతి అంటావు. అంత ఎక్కువ మాట్లాడటం నాకు నచ్చదని నీకు తెలీదా!"

"ఓ? మీకు నచ్చేటట్లు నేనుండాలా?"

"మరి కాక!"

"అల్లా అయితే నాకు నచ్చేపని మీరుకూడా చేయాలి."

"చేయటంలేదా!"

"ఏమి చేస్తున్నారు? ఆవిడ వరసచూస్తే సంసారం వదులుకున్నట్లే కన్పిస్తోంది. మనం వివాహం చేసుకున్నా ఏం కొంప మునగదు. మా అక్కయ్య ఆడపడుచు కూతురు పెళ్ళి ఈ నెలాఖరున అవుతోంది. మంచి ముహూర్తంట. ఆరోజే మనం చేసేసుకుందాం."

"ఇన్నాళ్ళు లేనిదీ ఇప్పుడేమంత తొందర? నీ లాంటివాడే కాశీ ప్రయాణంచేసి వచ్చి గుమ్మం యెక్కుతూ అయ్యో, ఇన్నాళ్ళూ నా భార్యా బిడ్డలు ఎల్లా బ్రతుకుతున్నారో పాపం అని జాలి పడ్డాడట. అలావుంది నీ ధోరణి."

"మీ మగవాళ్ళని నమ్మకూడదు ఎప్పుడో ఒకప్పుడు నీదారి నీవుచూసుకో అంటారు. అందులో భార్యవున్న వాళ్ల కూడానూ."

"ఇన్నాళ్ళు ఎలా నమ్మావు! ఇప్పుడెందుకు నమ్మకం తగ్గిపోయింది? నా భార్య క్రొత్తగా

వచ్చినది కాదు కదా! నీవు పరాయిదేశం దానివి కాదు తెలియక పప్పులో కాలువేసానని వాపోవటానికి! దేని కయినా సమయం సందర్భం కలిసి రావాలి" అన్నాడు. సుమన మాట్లాడ లేదు. భోజనం చేస్తూంటే సుమన గబుక్కున లేచి బాత్ రూంలోకి వెళ్ళిపోయింది. జగన్నాధ రావు మామూలుగా సుష్టుగా భోజనంచేసి వక్కపొడి వేసుకుని మేడమీదకు వెళ్ళి ఈజీచైర్‌లో జేర బడ్డారు. సుమన వాంతి చేసుకుని వాష్ బేసిన్‌లో ముఖం అదీ కడుక్కుని క్రింద హాలులో సోఫామీద దిండు వేసుకుని పడుక్కుంది. రాజమ్మ వచ్చి "ఏమ్మ వంట్లో బాగుండ లేదా!" అంది ఆప్యాయంగా.

"ఏమిటో పచ్చిపులుసు బాగా ఇష్టం కదా! అని ఎక్కువ తినేసాను లాగుంది కడుపులో తిప్పేసింది."

"పాపం!" అంటూ ఇంట్లోకి వెళ్లి నిమ్మకాయ రసం తేనె కలిపి తెచ్చి. "కొంచెం పుచ్చుకో! పైత్యం చేస్తే విరిగిపోతుంది." అంది. సుమన మాట్లాడకుండా పుచ్చుకుంది. రాత్రి బాగా జాము గడిచాక జగన్నాధరావు గారు క్రిందకు వచ్చేరు.

అప్పటికి ఇంట్లో పనివాళ్లు యెవరి మటుకు వారు సర్దుకు పోయేరు.

"సుమా! పైకి రాలేదేం?" అన్నాడు.

"వంట్లో ఏం బాగాలేదు."

"అదేం?" నుదుటి మీద చేయివేసాడు ఆదుర్దాగా కొద్దిగా వెచ్చగావున్నట్లుంది. కణతలు అదురుతున్నాయి.

"ఏం చెప్పను? ఎలా చెప్పాలో తోచటం లేదు."

"బాగుంది! వంట్లో బాగు లేకపోతే ఎలా వుందో చెప్పలేక పోవటమేమిటి! ఆ చెప్పలేక పోవటమే వంట్లో బాగులేక పోవటమా?" అన్నాడు.

"అదికాదు. నేను మిమ్మల్ని తొందర చేస్తున్న దెందుకని చాలాసార్లు మీరు నన్ను రొక్కించారు. ఆ తొందరేదో మీకు నేను ఎలా చెప్పను? ఇంకా నన్ను అర్ధం చేసుకో లేదా! ఇన్నాళ్లు లేని తొందర ఇప్పుడేమిటి అంటూ వస్తున్నారు. ఇన్నాళ్ళు నే నేమిటో యెవరికీ తెలియక్కర్లేకుండా జరిగింది. మాదీ పరువు మర్యాద వున్న కుటుంబం. ఈ సంగతి తెలిస్తే మా అమ్మగారు ముందు నన్ను చంపి తర్వాత తనూ ఏదో మింగి చస్తుంది."

జగన్నాధరావుగారు ఆశ్చర్యపోయాడు.

"ఇప్పుడంత కఠిన నిర్ణయం తీసుకోవలసిన అవసరం ఏముంది! నళిని రానీయి. నేను ఇంక వచ్చేయమని చాలా కోపంగా వ్రాసేను. తప్పక ఈ జాబు అందగానే వచ్చేస్తుంది. తనకీ చెప్పి ఆమె సలహా ప్రకారంచేద్దాం. మూడు వంతులు తనూ ఈ తప్పుని అంగీకరించ కలదు."

"అవ్వ చచ్చేంత వరకూ అమావాస్య ఆగదు. మనం పెళ్ళి పీటల కన్న ముందే బాల సారె పీటల మీద కూర్చోవలసి వస్తుంది. అందరూ వచ్చి అక్షింతలువేసి ఆనందబాష్పాలు రాల్చటానికి ఇది సినిమా తుది ఘట్టం కాదు. నిజ జీవితం. లోకంనించి నానారకాల మాటలూ పడవలసి వస్తుంది."

"సుమా!" ఆశ్చర్యంగా లేచి నించున్నాడు.

"ఏమిటి నువ్వంటున్నది?"

"ఏముందీ! రాజుగారి చిన్న భార్య వంశానికి వారసుడ్ని అందివ్వబోతూంది." తనూ లేచి కూర్చుంది. జడ ముందుకు వేసుకుని రేగిన తల చేతి మునివ్రేళ్ళతో గీరుకుంటో ఓరగా జగన్నాధరావుగారి ముఖంలోకి చూసింది. లేత నీలంరంగు నైటుబల్బు కాంతిలో అతనిముఖం కఠినంగా బిగుసుకుపోయింది. ఇన్నాళ్ళకి తన శూన్య గృహంలో చిరుపాపల జిలిబిలి పలుకులు వినే అవకాశం సుమన వల్ల కలిగినందులకు తొలిసారిగా తనలో దాంపత్య వాంఛలు రెచ్చగొట్టి తనని మామూలు సౌఖ్యానికి పురిగొల్పి తనని సంపూర్ణ మానవుడిని చేసినందుకు కృతజ్ఞతలు లేకపోగా సుమన వెంపు తీక్షంగా చూసి ఒక్కమాట అయినా మాట్లాడకుండా గబ గబా నడుచుకుంటూ మేడమీదికి వెళ్ళిపోయేడు. ఎంతో అనునయం ప్రేమ ఆశించిన సుమనకు పెద్ద చెంప పెట్టులావుంది జగన్నాధ

రావు ప్రవర్తన! సుమన ముందు తీవ్రంగా తల పంకించింది. తర్వాత చాలాసేపు ఆలోచించింది.

తెల్లవారుజామున రాజమ్మ నాలుగింటికే లేచి వీధి తలుపు తాళం తీస్తుంది. పెరట్లోకి వెళ్ళి పని మనిషిని లేపుతుంది. అది లేచివచ్చి వీధి వరండా అంతా ఊడ్చి కడిగి బాగాముగ్గులు పెడ్తుంది. ఈ కార్యక్రమము అవుతుండగా రాజమ్మ పెరట్లోకి వెళ్ళి కంబార్లని లేపుతుంది. వాళ్ళు పశువుల పాకలు ఊడ్చి పేడ కళ్ళాపులు జల్లి, పాకలో ఒక మూలగా సాంబ్రాణి పొగ వేసి పాలు తీయటం మొదలు పెట్తారు. రాజమ్మ స్నానంచేసి వచ్చి మజ్జిగ గిన్నె ముందు పెట్టుకుని కూర్చుంటుంది. చల్ల కవ్వంతో మజ్జిగ చిలుకుతూ. గోవిందనామాలు గుమ్మడు పాట పాడుకుంటూ వుంటుంది. నళిని అయితే ఆ చల్ల చిలక్కొట్టి మృదువుగా "ఖిర్ ఖిర్ ఖిర్ ఖిర్" అనే సవ్వడికే లేచి క్రిందకు వచ్చేది. అలాగే ఆరోజుకూడా రాజమ్మ లేచి హాలులోనికి వచ్చేసరికి సుమన నిద్ర లేని కళ్ళతో అల్లా కూర్చుని వుండటం చూసింది. రాజమ్మ నళినిని ఎంత ప్రేమగా పలకరించేదో, సుమనని కూడా అల్లాగే పలకరిస్తుంది. రాజమ్మ గాభరాగ దగ్గరకొచ్చి వీపు మీద చేయివేసి నిమురుతూ-

"ఏమ్మా ఇంత పెందరాళే లేచావు! నిద్ర పట్టలేదా?" అంటూ అనునయించింది. సుమన మొండి ధైర్యం తెచ్చుకుంది. తను అనుకున్న పని సాధించింది. జగన్నాధరావుకి మునుపటి ప్రేమ లేకపోతే లేకపోవచ్చును. నళినికున్న సాంఘిక మర్యాద తాను పొందలేకపోవచ్చును. కాని వాళ్ళిద్దరూ కూడా ఇప్పుడు తనని అంగీకరించక తప్పదు. లేక, కేవలం డబ్బు ఆస్తి పోతుందనే పీనాసితనం చూపపోయారా వాళ్ళ జాతకాలు నడిబజార్లో నించుంటాయి. ఏం చేస్తారో! రెండు మార్గాలూ వాళ్ళకు ముళ్ళ బాటలే అవుతాయి. అవుతే అవనీయి తనకేం? వాళ్ళమీద జాలి తనకెందుకు వుండాలి? భర్త నాటకం తెలిసి కూడా తెలియనట్లుగా సంఘ సేవకురాలుగా ప్రఖ్యాతి పొందుతూన్న నళినికి ఈ దెబ్బతో కళ్ళు తెరిపిడి పడతాయి. సంఘ సేవ, దీనజన మానవసేవ స్త్రీ జనోద్ధరణ. ఆహా! ఎంత బాగున్నాయో యీ మాటలు! ఏం చేస్తుందో చూడాలి! సుమన నర నరాల్లో రక్తం సలసలా మరిగిపోతోంది. కళ్ళమ్మట ఏదో తెలియని ఉడుకుమోతుతనంతో నీళ్ళు ధారలుగా కారజొచ్చాయి. వీపు రాస్తూన్న రాజమ్మ చేతికి సుమన శరీరంలోని రక్తం మరగడం చూచాయగా తెలిసింది. "బాగా జ్వరం వచ్చింది" అనుకుంది.

"ఏమ్మా వంట్లోబాగు లేదా! అరే ఏడుస్తావెందుకు పిచ్చిపిల్లా!" అంది.

"పిన్నిగారూ!" అంటూ ఆమె భుజంమీద తలపెట్టి వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఏమిటమ్మా! ఎందుకు అంత బాధపడుతున్నావు! నీ తల్లిలాంటి దాన్ని నాతో చెప్పు! ఏమాట అయినా మన ఇద్దరి మధ్య వుంటుంది. బాధపడకు, బెంగపడకు!" అంది రాజమ్మ.

"కొంప మునిదింది పిన్నిగారూ!" అంటూ ఇంకా వెక్కి వెక్కి పడుతూ గుండెలు బెక్క సాగింది. రాజమ్మ తాను గమనించిన సంగతి రూఢీ అయినందుకు చాలా సంతోషించింది మనస్సులో. పైకి మటుకు—

# అనుభవానికి కాదు

గట్టు తెగి ప్రవహిస్తున్న వెల్లువలో
కంటి కానే పస ముత్యం—
వేగంగా పోతున్న రైలు కిటికీలోంచి
దూరంగా పరుగెత్తిన ఎర్ర గులాబీ—
ఆకాశంలో పోతూ
టెలిగ్రాఫ్ తీగలమీద వాలిన చిలికపిల్లా-
క్షణమాత్ర సౌందర్యం
అనుభవానికి కాదు
అనుభూతికి మాత్రమే.

—సుధామ

"ఏమిటమ్మా! అంత గాభరాపడుతున్నావ్!" అంది ఇంకా ప్రేమతో గొంతు అంతా తడుపుకుని.

"మా వాళ్ళకు నే నేమి జవాబు చెప్పుకోను పిన్నిగారూ! ఇప్పుడు వాళ్ళకి నా ముఖం ఎలా చూపెట్టను చెప్పండి!"

"ఏం?" అంది రాజమ్మ ఇంకా అర్థం కాని దానిలా.

"నన్ను పెళ్లి చేసుకుంటానని నమ్మించారు. నళినిగారు కూడా ఒప్పుకున్నారని చెప్పారు. తొందర పడొద్దని యెంత వారించినా వినలేదు. ఇప్పుడు నా భయం నిజమయింది. తీరా అడిగితే నళిని వచ్చేక చూద్దాం అంటున్నారు. ఆవిడ ఎన్నిరోజులయినా రావటం కనపడటం లేదు. వారం పదిరోజుల్లో వస్తానని చెప్పింది. ఇల్లు చూడమంది. ఇల్లుచూసి పెడదాం అనుకున్నాను.

ఇంత అఘాయిత్యం చేస్తారని అనుకోలేదు. మొన్ననే మా అమ్మవాళ్ళు సవా లక్ష ప్రశ్నలు వేసారు. ఇప్పుడు నా గుండెల్లో దడగా వుంది. నళిని వచ్చేదాకా ఈ నిప్పుని మూట కట్టటం ఎలాగ? పిన్నిగారూ, మీకు జగన్నాథరావుగారి వద్ద చనువు వుంది. అటు ఆయనకీ ఇటు నాకూ పెద్దదిక్కు మీరే. మీరే ఆలోచనా పాలోచనా చెప్పాలి. ఏం చేయమంటారు పిన్నిగారూ" అంటూ వెక్కెక్కి ఏడిచింది. రాజమ్మ సింహాసనం ఎక్కినట్లు సంబరపడింది. తనకొక పెద్దరికం వచ్చింది. ఇన్నాళ్ళనుంచి ఆ ఇంట్లో వుంటున్నా కేవలం నౌకర్ల మీద యాజమాన్యమే కాని కుటుంబ విషయాల్లో జోక్యం కలిగించుకోవల్సిన అవసరం వుండేదికాదు. ఇన్నాళ్ళికి సుమన ధర్మమా అంటూ తనకీ ఒక మనిషిగా విలువ వచ్చింది. భుజాలు పొంగించుకుంది.

"అదేమిటే నా తల్లీ! ఎంతో సంతోషించాల్సిన విషయం. వూరూ వాడా పండుగ చేసుకోవాల్సిన విషయం. ఉండు నేను చెబుతాను. నిండు చూలాలిని ఇలా ఏడిపిస్తారా? ఎందుకు చేసుకోడో నేను అడుగుతాను కదా! వూరుకో వూరుకో. ఏడ్చి హైరాన పడకు. ఇన్నాళ్ళకు తనకు పిల్లలు కలుగుతున్నందుకు సంతోషించాలి కాని నళిని రావాలి పోళిని రావాలి అంటూ. నిన్ను వీధిన పెడతాడా? గొప్ప వారి గోత్రాలు ఇలానే వుంటాయి. అందితే జుట్టూ అందకపోతే కాళ్ళూ! నేను చూస్తాగా నువ్వు ఏమీ బాధ పడకు? నిబ్బరంగా వుండు. లే! లేచి ముఖం అదీ కడుక్కో! హార్లిక్సు కలిపి ఇస్తాను" అంటూ ఓదార్చింది రాజమ్మ సుమనని. సుమన లేచి నెమ్మదిగా బాత్‌రూం వెంపు వెళ్ళింది.

* * *

నళిని తంజావూరు వచ్చింది. బ్రహ్మాండమయిన బృహదీశ్వరాలయం చూసింది. తంజావూరుతో నళిని తమిళనాడు పర్యటన పూర్తి అయింది. మేనమామ కొడుకు రాజేశ్వర్ తోడుగా వచ్చేడు. రాజేశ్వర్‌కు నిండా పాతికేళ్ళు లేవు. కాని పొడుగ్గా, బలిష్టంగా వుంటాడు. గ్రాడ్యుయేషన్ అయింది. స్పోర్ట్స్ అంటే మంచి ఇంటరెస్టు. నళినియొక్క అందం, ఆకర్షణ అమితంగా ఆకట్టుకుంది రాజేశ్వర్‌ని.

"వదినా!" అన్నాడు. అతని మేనమామ అక్కడొక హోటల్ పెట్టుకున్నాడు. అతని హోటలులోనే దిగారు. మేనమామ భార్య పున్నమ్మ మళయాళీ వనిత. చిదంబరరావు చాలా మర్యాదస్థుడు. నళినిని చాలా గౌరవంగా ఆహ్వానించాడు. చాలామంది పిల్లలున్నారు. అంతా చిన్నచిన్నవాళ్ళు. పెద్దమ్మాయి సోసమ్మ వీణ నేర్చుకుంటోంది. తంజావూరు వీణలకి ప్రసిద్ధి. ఒక చిటికిన వ్రేలితో తాళం తీగలు మీటితే ఝుమ్మంటూ నాదం హాలంతా ప్రతిధ్వనించుతుంది. సోసమ్మకు పన్నెండేళ్ళుంటాయి. నేవళీకంగా చామనచాయగా వుంటుంది. చేయెత్తు పిల్ల అయ్యో సూచనలున్నాయి. పొడుగాటి జుట్టు. పున్నమ్మ తన పిల్లలందర్నీ మళయాళీ అలవాట్లలోనే పెంచుతోంది. ఆడపిల్లలు ఎక్కువ. సోసమ్మ ఉదయాన్నే ప్రతిరోజూ స్నానం చేస్తుంది. వీణకు ఊదొత్తులు వెలిగించి పూజ చేస్తుంది. తర్వాత గంటా గంట

స్నేర వీణ ప్రాక్టీసు చేస్తుంది. ఆ పిల్లకు రాజేశ్వర్ మీద ఆశ వున్నట్టు తోస్తూంది. రాజేశ్వర్‌కు ఏమి కావాల్సి వచ్చినా ఆ పిల్ల అందిస్తూ కూడా కూడా తిరుగుతూ వుంటుంది.

"ఏమిటీ?" అంది నళిని.

"నిన్ను గురించి వినటమేకాని ఎప్పుడూ చూడలేదు. అమ్మ ఎప్పుడూ నీ గురించి చెబుతూ వుంటుంది. సోమనాధం మామయ్య కూతురు చాలా అందమయినదని, మన బంధువుల్లో ఎవరిళ్ళల్లో పెళ్ళిళ్ళు పేరంటాలు జరిగినా నువ్వు వస్తావేమో అని అందరూ ఎదురు చూసేవారు. కాని నువ్వు వచ్చి ఒక గంటో రెండు గంటలో వుండి వెళ్ళిపోయేదానివి. మేమంతా మెరుపల్లే వచ్చి వెళ్ళిపోయింది అనుకునేవాళ్ళము. ఇన్నాళ్ళకు నీతో సావకాశంగా మాట్లాడే అవకాశం కలిగింది" నళిని నవ్వింది.

"ఎందుకు నవ్వుతావు?"

"అందరిలాగే మాట్లాడావు. అందుకని."

"ఏం మాట్లాడాను?"

"ఏం లేదులే."

"నువ్వెళ్ళిపోతావంటే నాకెంతో దిగులుగా వుంది. వస్తావని అమ్మ చెప్పినప్పుడు ఎంతో ఆనందంగా అన్పించింది. ఇంకా మంచి మంచి మాటలకో చెప్పచ్చుకాని నేను చెప్పలేక పోతున్నాను. ప్రతి క్షణం ఎప్పుడు నువ్వు వచ్చే సమయం అవుతుందా అని ఎదురు చూస్తూ కూర్చున్నాను. నువ్వు వచ్చినాక ఈ ప్రతిక్షణం నాకెంతో అమూల్యంగా కన్పించుతోంది. మళ్ళీ నువ్వెళ్ళిపోతావంటే ఏదో దిగులుగా వుంది" అన్నాడు.

తన ప్రక్కన పొడుగ్గా, హుందాగా ఎంతో రక్షణ ఇచ్చేవాడిలా తను చూడాలనుందన్న ప్రతి స్థలము ఎంతో ఆత్మీయతగా తీసుకువెళ్ళి

చూపించి ఆ స్థల ప్రసిద్ధి వివరాలు ఎంతో శ్రద్ధగా వివరించి చెప్పే ఈ చిన్నారి ఆరాధకుడి పట్ల నళిని మనస్సు ఆర్ద్రిత పొందింది.

"ఏం రాజూ! అస్తమానూ వెళ్ళిపోతావు, వెళ్ళిపోతావు అంటున్నావు. నాకు వెళ్ళాలన్న, కనీసం వెళ్ళివుండాల్సింది అన్న ఆలోచనన్నా లేకపోయినా నీవు అస్తమానూ అల్లా అంటూ వుంటే వెళ్ళితీరాలికదా అన్న ఆలోచన నాకూ వస్తోంది" అంది తేలికగా అన్నట్లు. కాని మనసునిండా మణుగు బరువు. వెళ్ళి తీరాలి. లోకం దృష్టిలో తనకు అది పెట్టని కోట. శాశ్వత నివాసం. కాని వెళ్ళాలన్పించటంలేదు. కాని ఇన్నాళ్ళూ ఎల్లా తిరుగుతుందీ! ఒకళ్ళ ఇంటినించి ఒకళ్ళ ఇంటికి. ఒక బంధువు ఇంటినుంచి ఒక స్నేహితురాలి ఇంటికి! ఇల్లా ఎన్నాళ్ళు? ఇప్పటికే బంధువులంతా తమలో తాము చెవులు కొరుక్కుంటూ వుంటారు, దీని సంసారాని కేదో గ్రహణం పట్టిందని. నిజం గానే పట్టింది కదా! ఎప్పటికో అప్పటికి అగ్ని పర్వతం బ్రద్దలుకాక తప్పదు! భూమి తన కాళ్ళక్రింద భూమి కొంచెం కొంచెంగా బీటలు పడి, దూర దూరంగా జరిగి తననే కబళించ బోతూ వుంటే చూస్తూ వూరుకోవటమా? వూరుకోక చేయగలిగిందేముంది? తను వేరే ఒక ధ్యేయం పెట్టుకోవాలి! తన మనస్సు, ఈ సంసారం ఇలా అయ్యిందే అన్న ఆవేదనకు ఉనికిపట్టుకాకూడదు. చదువుకున్నది. ఆర్థికంగా తను ఎవరికీ లోబడనవసరం లేదు. తను ఎప్పుడూ మనస్సుని సంతోషపరచుకుంటూ వుండాలి. పైకి జగన్నాధరావుగారికిగాని, చుట్టు ప్రక్కలకి కాని తన బాధ తెలియనీయకుండా గౌరవంగా మసులుకోవాలి. చుట్టూ ముళ్ల వున్న ఆలోచన లేకుండా, గులాబీ ఎంత స్వచ్ఛంగా నిర్మలంగా విరిసి మురుస్తుందో తనూ అలాగే తన మనస్సుకు గుచ్చుతూన్న ఈ ముళ్ళల్లాంటి ఆలోచనలలోంచి తెప్పరిల్లి వెల్లివిరిసిన ఆనందోత్సాహంతో సంచరించాలి.

"వదినా!" అన్నాను.

"ఊఁ."

"నేను ఒక మాట విన్నాను."

"ఏమిటా మాట?"

"నిన్ను జగన్నాధరావుగారు బాగా చూడటం లేదుట కదా?"

"ఎవరన్నారు ఆ మాట?"

"మనింట్లో ఆడవాళ్ళు అనుకుంటుంటే విన్నాను."

"నువ్వు నమ్మావా?"

"ఆఁ, ఎల్లా నమ్ముతాను ఆడంగి మాటలు?"

"రాజూ! ఆడంగి మాటలు నమ్మనివాడవి నన్ను ఆ మాట ఎందుకు అడిగావు?"

"మరి నేను ఎందుకు అడిగానంటే .. "

"ఎందుకు అడిగావో నాకు తెలుసును. నేను ఇన్ని ఏళ్ళుగా ఎక్కడికన్నా వచ్చినా ఒక్కపూటన్నా వుండకుండా వెళ్ళిపోయేదాన్ని. ఇప్పుడు అందరి ఇళ్ళూ చుట్టి వస్తున్నాను. మూడు నెలలు గడిచినా నా ఇంటికి నేను వెళ్ళ వలెనన్న ఆతృత కనపరచటంలేదు. అందు వల్ల ఈ గుసగుసలు పుట్టివుంటాయి. నాకు అన్ని వూళ్ళూ చూడాలని, అందరి జీవితాలూ పరిశీలించాలనీ అన్పించింది. నేను జగన్నాధ రావుగారి సంపూర్ణాంగీకారంతోనే మా వూళ్ళో ఒక స్కూల్ పెట్టాను. గ్రామానికి మాకుసహకారం ఇచ్చే పంచాయితీ మెంబర్లను ఎన్నుకున్నాము. లైబ్రరీ, మహిళామండలి కూడా బాగా నడుస్తున్నాయి. పట్నాలలో పల్లెలలో సామాజిక జీవితాలలో గల భేదం కొట్టవచ్చినట్లు కన్పిస్తోంది. దీనిని ఎలా సరిదిద్దాలా అని ఆలోచిస్తున్నాను. బహుశా అవకాశాలు అల్పమవుటచేత వాళ్ళ భావాలు కూడా సంకోచంగానే వుంటాయనుకుంటున్నాను. వాళ్ళమనస్సు వికసింపచేసి పట్నవాసులకున్న సౌకర్యాలన్ని పల్లెవాసులకు కూడా వుండేటట్లు చేస్తే పట్నవాసం ఇంత కంజెస్టడ్‌గా తయారవదు అని ఆలోచిస్తున్నాను. నేను ఎంతకీ నా ఆలోచనల్లో నేను వుండి ఎన్ని రోజులు గడిచాయో కూడా పట్టించుకోలేదు. దానితో నేను ఏదో భర్తచే నానా బాధలు పడి లోకంమీద పడి తిరుగుతున్నాననుకుంటున్నారు" అంది నళిని.

"వదినా?" ముఖమంతా కళ్లు చేసుకుని చూస్తూ అన్నాడు రాజేశ్వర్.

"ఏమిటి!"

"నీకన్నీ తెలుసు;" ఆరాధనగా అన్నాడు.

"చూడు రాజూ! నీకన్నా ఎంతో అనుభవజ్ఞురాలిని. ఒక్కో అనుభవం జీవితదారాన్ని ముడిపెట్టూవుంటుంది. చాలా అనుభవాలు నాకు మనుష్యుల్ని చదవటం నేర్పింది. స్త్రీ మనస్సు ఎదిగినంత తొందరగా మగవాళ్ళ మనసు ఎదగదు."

"నీకు మనుష్యుల్ని చదవటం వచ్చుగా మరి! నా మనస్సులో ఏమి వుంటుందో చెప్పు!" అన్నాడు రాజేశ్వర్. గుప్పిటలో ఏదో తాయిలం దాచి దీంట్లో ఏముందో చెప్పుకో అనే చిన్నపిల్లవాడిలా వున్నాడు రాజేశ్వర్ నళినిముందు.

"నాకు తెలుసు కాని చెప్పి లాభంలేదు. అల్లాంటి ఆలోచనలు ఆరోగ్యదాయకం కాదు."

"ఏమి?"

"ఇద్దరిమధ్యా బోలెడంత వయోభేదం వుంది. నేను వివాహితను. మనది గౌతమీ తీర సాంప్రదాయ కుటుంబము. ఇక్కడ పుట్టి పెరిగిన మనం విదేశీ సాంప్రదాయంగా ఆలోచింపటం అవివేకం. నీకు బోలెడు భవిష్యత్తు వుంది."

"నీకు లేదా భవిష్యత్తు, మనిద్దరం కలిసి ఎన్నో అభివృద్ధిపనులు చేయవచ్చును. అసలు మనం గౌతమీ తీరానికి వెళ్ళవలసిన అవసరం ఏముంది! అక్కడివాళ్ళే మనుష్యులా! అజ్ఞానం, పేదతనం ఎక్కడవున్నా దాని నిర్మూలనకు కృషి జరగవలసిందే. దానికి నీలాంటి చురుకుతనంవున్న స్త్రీలు ముందడుగు వేయాలి."

"బాగుంది రాజూ. భర్తా సంసారంవున్న దానిని లోకోద్ధరణ కోసం దేశం అంతా తిరగమంటావా! నేనున్న చోటనే బాగుచేసుకోవటం మొదలుపెట్టాలి" అంది నళిని.

"వదినా! నేను నా మనస్సు విప్పినంత తేలికగ నీవు నీ మనస్సుని తెరువవు. నేను అల్పబుద్ధిని అనవసరంగ తేలిపోయేను" అన్నాడు. అతని ముఖం ఎర్రబడింది.

"బుల్లిబాబూ నీవు కూడా నాతో మా ఊరు రా. నేనేమిటో నీకు తెలుస్తుంది" అతని చెంపలు చనువుగా సాగదీసింది. మెత్తగా సున్నితంగా వున్న నళిని అరచేతులని కళ్ళ మీద పెట్టుకున్నాడు రాజేశ్వర్.

"చాలా చిన్నబ్బాయివి, లాభంలేదు రాజూ! సోసమ్మని కూడా ప్రయాణం చేయి. ఆ అమ్మాయికి నేను చాలా నేర్పాలి" అంది నళిని.

"తనెందుకు?" అన్నాడు.

"మీ మామయ్య చాలా మంచివారు. నిదానస్థులు" అంది నళిని.

"అయితే!"

"అల్లాంటి తండ్రి పిల్లలు చాలా నిదానంగా వుంటారు. నీలాంటి ఆవేశపూరితులకు అల్లాంటి నిదానస్థుల అండ ఎంత అయినా అవసరం. సోసమ్మ చాలా మంచిపిల్ల. ఆమెతో నీ జీవితం చాలా ఉన్నతమైన స్థాయికి తీసుకుపోతుంది"

"నీవు మారేజ్ బ్యూరో కూడా పెట్టావా?"

"లేదు. మీతో కూడా మొదలుపెడ్దామన్న ఆలోచన వచ్చింది."

"నీకంతా వేళాకోళంగా వుంది వదినా! నేనేమైన మైనపుముద్దనుకున్నావా? మనిషిని మనసున్న మనిషిని."

"అందరూ మనసున్న మనుష్యులే రాజూ! ఒకళ్ళకు మనస్సు చెప్పినట్లు వింటుంది. ఒకళ్ళకు పరిస్థితులు చక్కగా కలిసివస్తాయి. మనసు, పరిస్థితి కలిసివచ్చినవాళ్ళే అదృష్టవంతులని పిలవబడుతారు."

"మంచిదానివే!"

"వుత్తమంచిదానినేనా? చాలా మంచిదానిని" అంది నళిని.

* * *

జగన్నాధరావుగారు ఎవ్వరికీ ఒక్కమాటన్నా చెప్పకుండా తెల్లవారుఝామునే

కారు తీసుకుని బయటకు వెళ్ళిపోయేరు. సుమన స్నానంచేసి రాజమ్మ ఆప్యాయంగా పెట్టిన వేడివేడి ఇడ్లీలు, అల్లంపచ్చడితో తింటోంది.

"ఈయన యింకా లేవలేదులావుంది" అంది రాజమ్మ.

"లేచినారమ్మగారూ! నేను కసువూడుస్తావుంటె కారు తీసుకుని వెళ్లిపోయేరు" అంది పనిమనిషి.

"అయ్యో! కాఫీయేనా అడగలేదేమిటి!" నొచ్చుకుంది రాజమ్మ. ఇన్నాళ్ళనించీ ఇంటిలో వుంటున్నందుకు వాళ్ళ మంచినే మనసారా కోరుకుంటుంది రాజమ్మ.

"అంత అర్జెంటుపనిలేమున్నాయి?" అంది సుమన.

"ఎక్కడికన్నా వెళ్తే వాతో చెప్పకుండా వుండరు. ఊరి బయటదాకా షికారు వెళ్ళారేమో!" అంది రాజమ్మ. కాని ఆ రోజు మర్నాడు కూడ జగన్నాధరావుగారు ఇంటికి రాకపోవటంతో రాజమ్మకు కాళ్ళుచేతులూ ఆడటం మానివేసినాయి.

"ఎక్కడికి వెళ్లినట్లు? ఇంత ఇల్లు వాకిలీ పాడీ పంటా! ఏంచేయాలి?" వంట కూడా వండుకోకుండా అటూ ఇటూ కాలుగాలిన పిల్లిలా తిరుగుతోంది. ఇదెక్కడి సంసారం. భార్య ఒకవీధికి భర్త ఒకవీధికి పెత్తనాలు చేస్తూ పోతూవుంటే ఇల్లు కనిపెట్టుకుని వుండే దెవరు? పన్నెండుగంటల మధ్యాహ్నంవేళ కారు వచ్చి ఇంటిముందున్న వరండాముందు ఆగటంతో రాజమ్మ గుండె గూట్లోపడింది. సుమన హాలులో కూర్చుని ఆ రోజు పేపరు చూస్తోంది. జగన్నాధరావుగారు నేరుగా లోపల బాత్రూంకు వెళ్ళారు. రాజమ్మ గబగబా వంటింట్లోకి వెళ్లింది. స్నానం చేసి పంచె కట్టుకుని తువ్వాలు భుజంమీద వేసుకుని డైనింగ్ టేబులువద్దకు వచ్చేరు. సుమన కళ్ళు యాంత్రికంగా పేపరు చదువుతోన్నా చెవులు వంటింటి సంభాషణ వినటానికి ఆతృత పడుతోన్నాయి.

"ఇంట్లో చెప్పలేదు! ఏమిటా అని కంగారు పడ్డాము" అంది రాజమ్మ, పప్పులోకి వేయించిన చల్లమిరపకాయలు వేస్తూ.

"ఏమయింది?" అన్నాడు. ఎందుకనో గొంతులో మార్దవత్వం లేదు.

"ఉత్తరాలు వచ్చేయి. రెండుకవర్లు" అంత కన్నా ఇంకేమి మాట్లాడాలో తోచలేదు రాజమ్మకు. ఎల్లాగో అతనన్నా యింటికి వచ్చేడు. అదే చాలు. ప్రాణం కుదుటపడింది రాజమ్మకు. భోజనం చేస్తున్నంతసేపు ఏం కావాలో అడిగి వడ్డించటం తప్ప మరోమాట అనలేదు. సుమన చెప్పిన విషయం ఎత్తటానికి ధైర్యం చాలలేదు. సుష్టుగా భోజనంచేసి హాలులోకి వచ్చేడు. రాజమ్మ అలమారు తెరిచి వక్కపొడివున్న భరణి తీసుకువచ్చి అందించింది. కొంచెం తీసుకుని హాలులో వున్న

(వి) చిత్ర విజ్ఞానం



బెరైటిస్ ఖనిజం, రబ్బరు, రంగులు, గాజు, పింగాణీ పరిశ్రమలకు ఎంతో అవసరం. ప్రపంచంలోకెల్లా అతి బ్రహ్మాండమైన బెరైటిస్ ఖనిజ సంపద మన ఆంధ్ర ప్రదేశంలోని కడప జిల్లాలో కోడూరుకు సమీపానవున్నది. ఈ ఖనిజం నూనె బావులు త్రవ్వటానికి ఎంతో ఉపయోగం కనుక, దీనిని మనం మిడిల్ ఈస్ట్ దేశాలకు ఎగుమతి చేస్తున్నాం. ఈ ఎగుమతి వల్ల ఏటా మనకు నాలుగుకోట్ల రూపాయిలకు మించిన విదేశీ మారక ద్రవ్యం లభ్యమౌతున్నది.

---

కూర్చున్న సోఫాకెదురుగావున్న మరో సోఫాలో కూర్చున్నాడు. సుమన పేపరు టీపాయ్‌మీద పెట్టింది. రాజమ్మ మేడమీదకు వెళ్లి అతనికి వచ్చిన రెండు కవర్లు తెచ్చి యిచ్చింది. అతను కవర్లు విప్పి చదువుతూన్నంతసేపు సుమన అతని ముఖంకేసి చూస్తూ వుంది. రకరకాల భావాలు అతని ముఖంలో రంగులుదిద్దుకున్నాయి. ఇంతలో హెడ్ మిస్ట్రెస్ గుణమణి వచ్చింది

"నమస్కారం సార్" అంటూను.

"నమస్తే రండి కూర్చోండి. ఏమిటిలా వచ్చేరు?" అన్నాడు సుమనని చూస్తూ ఇబ్బందిగా ముఖంపెట్టి.

"మీరూ యిక్కడనే వున్నారా! అయితే నా పని సులువు" అంది.

"ఏమిటా పని?" అంది సుమన.

"ఏముంది మామూలే. స్కూళ్ళ ఇనస్పెక్టర్ వస్తున్నామంటూ వ్రాసారు" అంది గుణమణి.

"మనకేం భయం వుండక్కరలేదు. పిల్లలంతా సక్రమంగా స్కూళ్ళకు వస్తున్నారు. మాష్టార్లు పాఠాలు చక్కగ చెబుతున్నారు. పిల్లలు బుద్ధిగా చదువుకొంటున్నారు. ఇంకేం కావాలి?" అంది సుమన.

"ఛ! భయం అనికాదు. కొంచెం పార్టీ అదీ అరేంజ్ చేస్తే బాగుంటుందేమో అని నా ఉద్దేశ్యం. ఒకటిరెండు రోజులు వుండేలా వున్నారు. మరి నళినిగారింకా రాలేదు. మీరూ ఈ మధ్యస్కూల్‌కి రెగ్యులర్‌గా రావటంలేదు. ఆవిడనిమనం ఒక అతిథిగా గౌరవించాలి కదా! అందుకని మనం ముందుగా ఒక నిర్ధారణకు వచ్చివుండటం అవసరం అని వచ్చేను" అంది గుణమణి.

"ఎప్పుడు వస్తారు ఆవిడ?" అన్నాడు. రాజమ్మ టీ బిస్కెట్లూ తెచ్చింది. సుమన ఆమెకో కప్పు అందించి తను ఒక కప్పు తీసుకుంది.

"ఈ నెలాఖరులో రావచ్చును. ఇరవయి నాలుగు ఇరువయి అయిదు తేదీలలో రావాలని వ్రాసింది" అంది "టీ" తీసుకుంటూ.

"ఈలోగా ఆవిడ వచ్చేస్తారులెండి" అన్నాడు జగన్నాధరావు.

"అమ్మయ్య! ఆవిడ వచ్చేస్తే మాకు ఇంక ఆవిడని ఎలా రిసీవ్ చేసుకోవాలో తర్జన భర్జనలు చేసుకోవాల్సిన అవసరం వుండదు" అంది గుణమణి.

"ఎప్పుడు వస్తామని వ్రాసేరు? జాబు ఆవిడ వద్దనించేనా!" అంది సుమన.

"ఎప్పుడో ఒకప్పుడు రాక తప్పదు కదా!" అన్నాడు.

"ఎందుకు తప్పదు? ఆమెకు తప్పించుకోవాలంటే బోలెడు దారులున్నాయి."

"తప్పించుకునే దారులు అందరికీ వుంటాయి.

దారులు లేకకాదు. తప్పించుకోలేకపోవటం. ఆ విషాదం భరించకలిగే మనస్థయిర్యం లేక!"

"ఆ మాటలకేం లెండి. ఇంక మన కథ ఒకకొలిక్కి వచ్చిందన్న మాటేగదా! ఆమెకు మనస్ఫూర్తిగా స్వాగతం ఇస్తున్నాను నేను."

"నీ స్వాగత సత్కారాలకోసం రావటం లేదు. సముద్రంమీద ఎగురుతూపోతున్న పిట్టకు అలుపువస్తే ఏంచేస్తుంది. తెరచాప కొయ్యమీద వాలుతుంది. ఆ ఓడ దానిని ఏ తీరం చేరుస్తుందో దానికి తెలియుదు. పూలు పళ్ళూ కొల్లలుగా వుండే తోటలున్న దేశమే చేరుతుందో, గుక్కెడు మంచినీళ్ళు కూడా కరువుగా వుండే ఎడారి తీరమే చేరుతుందో ఆ పిట్టకు తెలియదు! ఎగరటం ప్రారంభించిన పిట్టకు సముద్రం సగందూరంలోకి వెళ్లినాక ఎటు చూసినా గంభీర నీలజలధి దర్శనమియ్యటంతో గాభరా పట్టుకుంటుంది. కనబడ్డ ఓడ తెరచాప కొయ్యమీద కూర్చుంటుంది" అన్నాడు.

"మీకు ఈమధ్య ఆవిడమీద జాలి ఎక్కువయిపోతున్నట్లుంది. ఆవిడకేదో వూహించలేని కష్టం వచ్చినట్లు బాధపడుతున్నారు."

"కష్టంకాక మరేమిటంటావు? భార్య బ్రతికి వుండగా మరో పెళ్లికి సిద్ధం అయిన నన్ను ఏమనుకుంటారు జనం?"

"జగన్నాదులు అనుకుంటారు. మీరేదో బోలెడు మంచి పేరు నాకోసం త్యాగం చేసుకుంటున్నా మనుకుంటున్నారుపాపం! ఒక్కొక్కళ్ళకి ఇద్దరేసి ముగ్గురేసి భార్యలు వుండటం మన సమాజంలో కొత్త కాదు. మన పురాణాల్లోని దేవుళ్ళందరికీ బహు భార్యాత్వం వుంది. కలౌ వెంకట నాయకొ అన్న శ్రీ వెంకటేశ్వరస్వామి వారికి ఇద్దరుభార్యలున్నారు. సిరిగలవానికి చెల్లును అన్నట్లు సిరిసంపదలున్న పురుషులు ఇద్దరేం, నలుగుర్ని కూడా పోషింపవచ్చును ఎటొచ్చీ తాళి కట్టినవారినే భార్యలు అంటారు. మిగిలినవారిని ఏమంటారో మీకు నేను వివరించనక్కరలేదు." జగన్నాధరావుగారు సుమన వెంపు వింతగా చూసేడు. మునుపటిమీద కొంచెం రంగు వచ్చి నిగారింపుగా వుంటోంది. మనిషిలో ఢీ అంటే ఢీ అనే పోట్లాట తత్వం బాగా పెరిగింది. మొదటి రోజుల్లో వున్న ఆ ఆర్ద్రత, అనురాగం ఆత్మీయత ఇప్పుడు మచ్చుకయినా సుమనలో లేవు. "రాజెవరి కొడుకు?" అన్నంత ధీమా వచ్చింది. బేలతనం అసలు లేనేలేదు.

"సుమా!" అన్నాడు తీక్షణంగా.

"ఏమిటి?" అతని చూపులతో తన చూపులను గాఢంగా నిలిపింది సుమన.

"నళిని వచ్చేలోగా నీ కథ పూర్తి కావాలి. నువ్వేం చేయదల్చుకున్నావో చెప్పు" కఠినంగా అన్నాడు.

"పెద్ద రొడ్డొచ్చె మొదలాడు అన్నట్లుంది. ఈవిడరాగానే కళ్యాణవీణ మ్రోగించెయ్యటమే! ఇంకా చేయదల్చుకున్నదేముంటుంది?"

"ఆ ప్రశంస ఎత్తటానికి నీకు అధికారం లేదు. నీకు పురుడు పుణ్యాం పోసుకోవాలని వుంటే ఏదయినా దూరప్రాంతం పట్టణానికి వెళ్ళు. ఖర్చు నే నిస్తాను. స్కూల్ ఉద్యోగం మామూలుగానే వుంటుంది. నీకు బాగా ఓపిక వచ్చేక నీ ఉద్యోగంలో నీవు జేరుదువుగాని, లేదా ఎబార్షన్‌కి ప్రయత్నించుతా నంటే మరీ మంచిది. నీ ఆరోగ్యం భంగపడకుండా చప్పున ఒక త్రోవ చూసుకొనుట నయం."

(సశేషం

# శ్రీదేవి

శ్రీవారు క్యాంపుకు వెళ్తానని అరగంట క్రితమే బయల్దేరి వెళ్ళారు. టాల్‌స్టాయ్ 'అన్నా కెరినినా' చదువుతూ కూర్చున్నాను యేం తోచక. హరీ, గిరీ పై చదువులకు వెళ్ళి, బిందు పెళ్ళయి అత్తారింటికి వెళ్ళిపోయాక కాలం గడవడమే కష్టమైపోతున్నది. ఎన్ని పనులు కల్పించుకున్నా, ఎన్ని పుస్తకాలు చదివినా- బరువుగా కాలం గడుస్తున్నది-ఆలోచనలు తేనెటీగల్లా-ముసురుకుని-మనసంతా అల్లకల్లోలమై పోయింది.




టాల్‌స్టాయ్ సృష్టి-అన్నా - స్త్రీలోని బలహీనతకూ-ప్రేమకూ ఆరాధనకూ లొంగిపోయి శలభాల్లా మాడిపోయే - స్త్రీజాతికి - ప్రతీక-అనిపిస్తోంది. మన భారతీయ మహిళకే కాదు — సాంఘికపరమైన కట్టుబాట్లూ - విలువలూ- పాశ్చాత్యదేశాల్లో కూడ స్త్రీ జీవితం - పురుషుని జీవితానికి పూర్తిగా భిన్నంగా - ముఖ్యంగా సంఘ నియమాలకు కట్టుబడి బ్రతక్క తప్పదన్న సత్యాన్ని - చక్కగా చిత్రించాడు రచయిత.

'అన్నా' కారెక్టరు చదువుతుంటే - మనసంతా భారంగా అనిపించింది. ఆ నాడు-నేనూ-కృష్ణా యెలాంటి సాహసం చేసినా-యీ నాడు నేనూ మరో 'అన్నా' అయ్యుండేదాన్నేమో!

కృష్ణ గురించిన ఆలోచనలు రాగానే—

గుండెల్లో గుబులంతా పైకుబికింది. అది ఆనందమో, ఆవేదనో తెలీని యేదో తీయని బాధ. గతస్మృతుల పరిమళం గుప్పున గుబాళించబోయే తరుణాన. .

"టింగ్-టింగ్-"అంటూఫోను ఎక్కడిదో-విసుగ్గా లేచి అందుకున్నాను.

"హలో నేనేనోయ్ లతను. ఏమిటి పరధ్యానం. శ్రీహరి ధ్యానంలో మునిగిపోయావేమిటి?" నువ్వు—

"అబ్బే-అదేంలేదు-ఏదో పుస్తకం చదువుతూ పరధ్యానంలో పడిపోయానులే కానీ—యేమిటి విశేషాలు?"

"విశేషాలేం లేవుగానీ-కృష్ణ వచ్చాడు—మీ గురించి వివరాలడిగినాడు-చెప్పాను—మీరీ వూళ్లోనే వుంటున్నట్లు-అడ్రసిచ్చాను—మళ్ళీ రాత్రికే వెళ్లిపోతానంటున్నాడు. ఇక్కడనుంచి మీ యింటికి వస్తానన్నాడు-నీవింట్లోనే వుంటావని-ముందుగా చెప్తున్నాను-మరి వుంటావు కదూ!—"

"అలాగే-అలాగే-రమ్మను తప్పక-మావారు క్యాంపుకు వెళ్ళారు. యేంతోచడంకూడా లేదు" అదే మరొకప్పుడయితే "నీవూ రావాలి" అనేదాన్నే లతతో-కానీ-యీనాడు కృష్ణను యేకాంతంగా కలుసుకుని-సంవత్సరాల తరబడి అల్లుకున్న ఆశలను-ఆలోచనలను మాటల రూపంలో అతనిముందు పెట్టాలన్న స్వార్థం-లతమీది అభిమానాన్ని చంపేసింది.

అవతల ఫోన్ పెట్టేసిన చప్పుడు-యోచనా స్రవంతికి ఆనకట్ట కట్టింది.

విచిత్రం-ఆశ్చర్యం ఇప్పుడప్పుడే కృష్ణను గూర్చిన తలంపులు ఇంతలో హఠాత్తుగా అతన్ని కలిసే అవకాశం. పన్నెండేళ్ళ నుండి నాలో వూపిరి పోసుకుంటున్న వూహలు—కార్యరూపం దాల్చలేని కోరికలు-అన్నీ నన్ను వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. జీవితంలో లభించిన యీ సదవకాశాన్ని పూర్తిగా వినియోగించుకోవాలి. కనీసం కొన్ని నిముషాలపాటైనా యీ సమాజాన్నీ, బాధ్యతల బరువునీ బంధాల్నీ కట్టుబాట్లనూ అన్నీ త్యజించాలి. ఇద్దరం ఒకరికొకరుగా నీవు నేను అనే భేదం లేకుండా వూవూ, తావిలా హాయిగా జీవితాన్ని ఆస్వాదించాలి.

వెంటనే నవ్వొచ్చింది నా ఆలోచనలకు.

వయస్సు గుర్తుచేసింది మనసు-

ఈ వయసులో పిల్లల తల్లిగా—నాలుగు పదులు నిండిన యీ సమయాన—యింకా యిలాంటి పిచ్చేమిటి?

అసలు-నా జీవితమే ఒక విచిత్రం-

పుట్టింది సంప్రదాయాలకే విలువనిచ్చే—సనాతన కుటుంబం. ఆలోచనలు ఆధునికమైనవి. ప్రేమ, వాత్సల్యం, కరుణ ఎన్ని పాళ్ళల్లో వున్నాయో అంతే వున్నాయి ద్వేషం రోషం, తొందరపాటు.

సహజంగా అందరితో కలిసిపోయి—కలివిడిగా వుండే స్వభావం. కుండ బద్దలు కొట్టినట్లు ఎవరితోనైనా సరే మాట్లాడి 'యదార్థవాదీ లోక విరోధీ' అన్న సామెతను ఋజువు చేసే స్వభావం. మంచి అనుకుంటే - వాళ్ళను అతిగా నమ్మేయడం-విపరీతంగా ఆరాధించడం.

ఎవరేనా అనవసరంగా ఏదైనా అంటే నొచ్చుకుని బాధపడిపోవడం-కడివెడు కన్నీళ్ళు కార్చి బాధనంతా వెళ్ళగక్కుకోవడం సరదాగా చదవడం ఆరంభించి నిత్యకృత్యాలలో ఒకటైపోయిన పుస్తకపఠనం కలిగించిన లోకజ్ఞానం.

కష్టాల్లోవున్నవాళ్ళ నాదుకోవాలనే సేవాభావం—

యౌవన ప్రాంగణంలో అడుగు పెట్టీపెట్టకముందే అమాయకంగా - వివాహితుడైన ఒక ధీరుడుకు హృదయాన్నర్పించి అపాత్రదానం చేసి ఆ తీవ్రాఘాతానికి తట్టుకోలేక విరిసీ విరియని మొగ్గలా రాలిపోయే తరుణాన తనలో రగులుతున్న అగ్నిని కనిపెట్టలేని తలిదండ్రులు వరాన్వేషణ చేశారు. సడలించలేని సాంఘిక విలువలను తోసెయ్యలేక వివాహమంటేనే అయిష్టత యేర్పడ్డ తాను తన తర్వాతి ఆడపిల్లల భవిష్యత్తుకు అడ్డుగోడ కాకూడదనే ధ్యేయంతో వివాహానికి వొప్పలేక తప్పలేదు.

తన జీవితంలో ప్రవేశించిన శ్రీహరి ఎంతో సౌమ్యుడు, ఉత్తముడు. గతంలోని పీడ కలలను దాదాపు దూరంచేయగలిగింది అతని

సాహచర్యం.

ఉద్యోగ నిర్వహణ అయిపోయాక యిక అతనికి తనతోడిదే లోకమైంది. కదిత్తే కంది పోతానన్నంత అపురూపం - నేనేది చెప్పినా ఆజ్ఞలా భావించి శిరసావహించే మెత్తదనం. అనుక్షణమూ నా కోసమే తాననే భావన—

"జీవితమంతా మనిద్దరం యిలాగే హాయిగా చిన్నపిల్లల్లా గడపాలి వసూ!" అన్న అభ్యర్థన.

ఆ అమాయకుణ్ణి మోసం చేస్తున్నానన్న భావన ముల్లులా గుచ్చుకోగా తన తప్పును తెలియబరిస్తే "గతం గురించి మాట్లాడకు వసూ! నా అదృష్టవశాత్తూ - నీవు నాకు లభించావు-భవిష్యత్తులో మాత్రం నీవు పూర్తిగా నాదానివిగా వుండాలి-నీలోని ప్రతి అణువూ నాలో ఐక్యం కావాలి. ఈ విషయంలో మాత్రం నేను పూర్తిగా స్వార్థపరుణ్ణి సుమా!" అన్న హృదయ వైశాల్యం-నిజాయితీ—

కానీ-కానీ-ఎక్కడో - ఏదో అసంతృప్తి-అన్నీవున్నా యేదో లేదనే భావం. ఇంకా ఏదో కావాలనే కోరిక-

వంటపనుల్లో యింటిపనుల్లో సాయం చేస్తూ-అవకాశం వున్నప్పుడంతా తన్నే అంటిపెట్టుకుని వుంటూ తనకు చిన్న పిసరు అనారోగ్యం చేస్తే యెలాంటి సేవ అయినా చేయడానికి తయారయ్యే వారిని చూస్తే నా హృదయం కృతజ్ఞతాభావంతో నిండిపోయేది. అతనిలో నాకు మంచి సంరక్షకుడు-ఒక్కోసారి పితృప్రేమ కన్పించేవి. అంతేకానీ అతనిలో లీనమైపోవాలనీ అతనే నా సర్వస్వం కావాలనే కోరిక ఏ నాడూ కలగలేదు.

శరీరాలతో పాటు-మనసులు కూడా యేకం కావలసిన తరుణాన—

నా మనసెక్కడో విహరిస్తూ వుండేది. ముభావంగా - యాంత్రికంగా అతన్ని సుఖపెట్టాలని ప్రయత్నమే తప్ప నాలో యెలాంటి స్పందనా కలిగేది కాదు.

శారీరికంగా అతనికి లొంగిపోయినా— అతను తన శరీరాన్ని ప్రతి అవయవమూ స్పృశిస్తూ—

"నీవెందుకింత డల్‌గా వుంటావు వసూ!-నేనంటే నీ కిష్టంలేదా-లేక సెక్సంటే అయిష్టమా" అన్న ప్రశ్నకు యేమి చెప్పాలో తెలీని అయోమయావస్థ "మీరన్నా సెక్సన్నా నాకేం అయిష్టంలేదు-కానీ-మీ దగ్గరకు వస్తే నేను వుత్సాహాన్ని పొందడం లేదు-మీ మనసు నన్ను జయించలేకపోతున్నది" అని చెప్పాలని అనుకున్నా చెప్పలేక పోయానెప్పుడూ.

మనసులు కలిసినా కలవకున్నా యెలాంటి ప్రత్యేకమైన భావాలు ఒకరిపట్ల మరొకరికెలాంటి ప్రత్యేకమైన అభిమానం వున్నా లేకపోయినా-మన వ్యవస్థ పుణ్యమా అని వివాహితులైన వారి జీవితం సాఫీగా నడిచిపోయినట్లే వుంటుంది. లోపల ఎన్ని అభిప్రాయ భేదాలున్నా ఒకరినొకరు ద్వేషించుకుంటున్నా— లోకం దృష్టిలో ఆదర్శప్రాయమైన జంటగా గుర్తింపబడ్డం యేమంత కష్టంకాదు.

అందరు భార్యాభర్తల్లాగే మా జీవితమూ యాంత్రికంగా — సర్వసామాన్యంగా ఆర్థిక సంబంధమైన కొన్ని చిన్నచిన్న ఇబ్బందులు తప్ప మరే ఒడిదుడుకులు లేకుండా నడుస్తున్నది. నాలో రోజురోజుకూ అకారణంగా పేరుకుపోతున్న అసంతృప్తి-విసుగుదలా— జీవితంపట్ల విరక్తి ఎందుకో నాకే అర్థం అయ్యేది కాదు. మానసికంగా ఆందోళన పడుతున్న నేను శారీరకంగా కూడ బలహీనంగా తయారయ్యాను. వరుసగా-దగ్గరదగ్గర పురుళ్లు-ఆయన జీతం చాలని పరిస్థితి-నన్ను మరీ కుంగదీసింది.

ఆయన డ్యూటీపై వెళ్ళగానే-పిల్లలు బడికి వెళ్ళే-ఒంటరినై వివిధ రకాలుగా ఆలోచిస్తూ గడిపే నేను ఆయన మంచితనంతో ఆయన సాహచర్యంతో కొంతవరకూ కోలుకున్నాను. ఆర్థికంగా ఆయన కేవిధంగానైనా సాయం చేయగలిగితే బాగుండునన్న ఆలోచన వచ్చి ఆయన్ని వొప్పించాను.

అతి ప్రయాసతో వుద్యోగం సంపాదించ గలిగాము. నేనేనాడో చదివిన బి.యాడి యీ నాటికి వుపయోగపడిందని ఆనందించాం యిద్దరమూ.

ఉద్యోగంవల్ల కుటుంబ ఆర్థిక పరిస్థితి మెరుగవుతుందనీ యిద్దరం హాయిగా పిల్లలను చదివించి వృద్ధిలోకి తీసుకురావచ్చనీ-ఆశించాను కానీ-ఆ వుద్యోగమే నాలోని భావుకతనూ, అణచుకోలేని ఆవేశాన్నీ రెచ్చగొట్టి నిశ్చలమైన తటాకంలో రాయి విసిరినట్లు మా జీవితంలో ఒడిదుడుకులను కల్పిస్తుందని యే నాడూ వూహించలేదు.

అసలు నేను వుద్యోగంలో చేరగానే— హెడ్‌మాస్టారి సీటులోవున్న వ్యక్తిని చూడగానే అతన్ని ఇదివరకెక్కడో చూసినట్లు— ఎంతోకాలం నుంచీ అతని పరిచయం కలిగి వున్నట్లు అన్పించింది.

అదో చిన్నస్కూలు. ఆ స్కూల్లోవున్న వుపాధ్యాయులందరిలోకీ అంతోయింతో బాగా చదువుకున్నవాళ్ళము, పుస్తకపరనమంటే అంతో యింతో ఆసక్తిగలవాళ్ళం మేమే అవడంవల్ల మా పరిచయం పెరిగిపోయింది. అంతేకాదు వుద్యోగ నిర్వహణలో యిద్దరివీ ఒకటే భావాలు, ఒకటే పద్ధతులు. ఒకరినొకరు మన్నించుకుని హాయిగా ఖాళీ దొరికినప్పుడల్లా యేదో చర్చలతో గడిపేవాళ్ళం.

అలా ఆలా దినదిన ప్రవర్ధమానమైన మా పరిచయం స్నేహంగా మారింది. మా యింట్లో ఎలాంటి అభ్యంతరాలూ లేవు కనుక తను మా యింటికి తరచు వచ్చేవాడు - గంటల తరబడి చర్చలు వాగ్వాదాలు-అతనితో మాట్లాడుతుంటే అతన్నే చూస్తుంటే జీవితమంతా హాయిగా గడిచిపోతుందన్న భావన నాలో కలుగకపోలేదప్పుడప్పుడూ. మూడు వసంతాలు దొర్లాయి. భర్త నాపట్ల చూపిన అచంచల విశ్వాసం, ఆయన నాకిచ్చిన సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని నేను నిలుపుకోలేకపోయాను.

ఆనాడు జీవితంలో మరెన్నడూ మరచిపోలేని ఆ సంధ్యాసమయంలో సన్నగా చిన్నగా లలిత సంగీతం ఆలాపిస్తున్న వింజమూరి శివరామారావుగారికంఠమాధుర్యాన్నిగ్రోలుతూ-ఒకరికెదురుగా మరొకరు కూర్చున్న వేళ-

కృష్ణ నాచేతికందించిన చిన్నకాగితాన్ని అందుకున్నాను ఆశ్చర్యంగా-

"మిమ్మల్ని నేను విపరీతంగా అభిమానిస్తున్నాను-వసుమతిగారూ" అన్న ఆ వాక్యాలు మళ్ళీ మళ్ళీ చదివాను.

నేనూ చెప్పాలని ప్రయత్నించీ చెప్పలేని ఆ వాక్యాలు నిజమనిపించాయి.

నేను మన ప్రాచీన పతివ్రతామతల్లుల జాతికే చెందినదాన్నయితే సంప్రదాయపు ముసుగులో మనసులోని బలహీనతల్ని దాచుకుని నీతి అనీ, ద్రోహమనీ భావించినట్లైతే—

"నేనూ మిమ్మల్ని అభిమానిస్తున్నాను కృష్ణా - అయితే అన్నయ్యలా" అని చెప్పేదాన్నేమో!

కానీ-నా మనసును నేనే వంచించుకోలేక హృదయోద్వేగాన్ని అదుపులో పెట్టుకోలేకపోయాను. కృష్ణ వెళ్ళిపోయినా అతను వ్రాసిన వాక్యాలు నన్ను వెంటాడుతూనే వున్నాయి రాత్రంతా. రాత్రంతా నిద్రంటే ఏమిటో తెలియని నేను-ముభావంగా యేదో ఆలోచిస్తున్న నన్ను-చూచి-అదేమిటో అర్థంకాక - అడిగితే ఏమి విసుక్కుంటానో అని తటపటాయిస్తూ-

"నిద్ర రాలేదా వసూ!" అంటూ పైన చేయి వేయబోతే సున్నితంగా చెయ్యి తీసివేస్తూ అన్నాను "వొంట్లో బాగులేదు."

"ఏమిటి తలనొప్పా - అమృతాంజనం తేనా" ఆదుర్దాగా అడిగారు.

"ఏమీ వద్దు-కాస్సేపు నన్ను పలకరించకండి" అంటూ దూరంగా జరిగాను.

ఇలాంటి సమయాల్లో నన్ను ఇంకా పలకరిస్తే పర్యవసాన మేమిటో వారికి బాగా తెలుసు యీ పదేళ్ళ అనుభవంతోను.

మెదలకుండా పడుకున్నారు.

మరునాడు యెంతో ఆలోచించి, ఆలోచించి నా ఆలోచనలు కాగితంపై పెట్టాను.

అత్రుతగా చూస్తున్నట్లు కృష్ణ చూపులే చెప్తున్నాయి.

"నిన్న మీరు వ్రాసినట్లే నేనూ మిమ్మల్నెంతో అభిమానిస్తున్నాను. కానీ యివన్నీ యెవరితో చెప్పలేని, చెప్పుకోరాని భావాలు.




సంఘం దృష్టిలో యిలాంటి ఆలోచనలే తప్పు కానీ నేను మిమ్మల్ని చూడకుండా - మీతో మాట్లాడకుండా వుండలేకపోతున్నాను కృష్ణ గారూ

ఆ తర్వాత కృష్ణనుండీ మళ్ళీ వుత్తరం తను కూడా నా గురించి అలాంటి భావాలు కలిగి వుండడం అపచారంగా భావిస్తున్నాననీ, కానీ నిజం దాచుకోలేక మనసు విప్పి చెప్పాననీ దాని సారాంశం

క్రమంగా మా యిద్దరి మధ్య వుత్తర ప్రత్యుత్తరాలు-బడిలో - చూపులతో సంభాషణలు, సాయంకాలాల్లో మా యింటి దగ్గర సమావేశాలు అతను నా పై అధికారి అనే భావనే లేదు నాలో పరాయి వ్యక్తి అన్న మాటే లేదు నాలో కానీ డ్యూటీ విషయంలో మాత్రం ఎప్పటిలా ఖచ్చితంగా-వేలెత్తి చూపలేని రీతిగా కార్యక్రమాలు నిర్వర్తించేవారం

ఎన్నడూ లేనిది మావారిలో కోపం, విసుగు కన్పించసాగేయి నాకేమో కృష్ణసాన్నిధ్యం స్వర్గతుల్యంగా వుండేది ఆతని రాక అతని మాటలు నాలో అనిర్వచనీయమైన ఆనందాన్ని కల్గించేవి అతన్ని చూడని ఒక్క సెలవుదినం ఒక యుగంగా జీవితమే నిస్సారమన్నట్లు గడిచేది నాకు ఎన్నడూ లేనిది శ్రీవారు మెల్లి మెల్లిగా చీవాట్లు పెట్టసాగారు నన్ను - రోజూ అలా పరాయి మగాళ్ళతో బాతాఖానీ ఏమిటని? పైగా యింట్లో ఆడపిల్ల వుందికదా అంటూ——

నాకు కోపం పంతం అసలే ఎక్కువేమో అతని మాటలు ఎందుకు లక్ష్యపెట్టాలన్న వుద్దేశ్యంతో ఎప్పటిలా మెలుగుతూనేవున్నాను

కృష్ణ రాగానే తను అయిష్టంగా మొహం పెట్టేవారు విసురుగా యింట్లోంచి వెళ్ళిపోయేవారు

ప్రేమ మైకం పూర్తిగా ఆవరించిన నేను అవన్నీ లక్ష్యపెట్టే స్థితిలో లేను నా చెవుల్లో ప్రతిధ్వనించేది కృష్ణ మాటలే.

"గృహజీవితం నరకప్రాయమై పోయింది నాకు వసుమతిగారూ! మీ ఆప్యాయతలో, ఆదరణలో సేద తీర్చుకోవాలి నేను మీరు కాదంటే నేనేమైపోతానో" అంటూ జాలిగా అతని అభ్యర్థన అగ్నిసాక్షిగా వివాహమాడిన భర్తకూ, అతని సంతానానికీ పరువు మర్యాదలతో బ్రతుకుతున్న కుటుంబానికీ అతని భార్యకూ ద్రోహం చేస్తున్నానన్న ఆలోచన

రాగానే మనసంతా కకావికలై పోయేది. అతనితో స్నేహం మానేద్దామనీ, నాతో తన పరిచయాన్ని మరచిపొమ్మందామనీ ఎంతో ప్రయత్నించేదాన్ని. కానీ అతన్ని చూడగానే అతని తలపులు మనసుకు రాగానే నేను ఓడిపోయేదాన్ని. భౌతికంగా మాకెలాంటి సంబంధమూ లేనే లేదని కేవలం మానసికమైన సంబంధమేననీ మనసును తృప్తిపరచుకునేదాన్ని.

"స్త్రీకి పూర్వపు కట్టుబాట్లు యిప్పుడు లేవు వసుమతిగారూ! సంఘంలో స్త్రీ పరిస్థితి మునుపటికీ యిప్పటికీ ఎంతో మారింది. మన యీ స్నేహం బహిర్గతం కానంతవరకు తప్పని నేననుకోను. పాపమనీ, దగా అనీ మనల్ని మనమే వంచించుకోవడం తప్పు" అనేవాడు కృష్ణ.

ఆఖరికి నేను అతనికి నా సర్వస్వాన్నీ అర్పించడానికి సిద్ధమయ్యాను. అతని కోర్కె తీర్చలేని నా జీవితం వృథా అనుకున్నాను.

ఆనాడు మొట్ట మొదట మేమిరువురం ఏకాంతాన స్పర్శానందాన్ని అనుభవించాం. అతని పెదిమలు నా పెదాలను తాకాయి. గాఢ పరిష్వంగంలో మైమరచాం యిద్దరం.

ఏదో మత్తు - మైకం - శరీరాకర్షణకూ, తాత్కాలిక అనుభూతులకూ లొంగే వయస్సు కాదు. భౌతిక సుఖాలకు కొత్తవాళ్ళము కాము-అయినా అదో మధురానుభూతి. విపరీతమైన ఆనందం. జీవితమంతా అతని సాన్నిధ్యంలోనే వుండిపోతే-అన్న ఆలోచన.

ఇంతలో పిల్లలు వచ్చిన సందడి. చెళ్ళున కొరడాతో చరచినట్లు మేల్కొంది వివేకం. పిల్లల దృష్టిలో బడకుండా యిద్దరం సర్దుకున్నాం.

కృష్ణతో నా సాన్నిహిత్యం ఎక్కువయిన కొద్దీ మావారికీ నాకూ దూరం యేర్పడసాగింది. ఎవరూ వూహించలేనంత, ఎవరికీ చెప్పుకోలేని సంఘర్షణ నాలో ఆరంభమైంది. కట్టుకున్న భర్తకూ, సామాజిక విలువలకూ ద్రోహం చేస్తున్నాననే భావన ఒకవంక, నేను కావాలనుకున్న నన్ను కావాలనుకున్న నా హృదయాన్నీ నాలోని అణువణువునూ స్పందింపజేసే కృష్ణమీది వ్యామోహం మరో వైపు. పైకి నవ్వుతూ, త్రుళ్ళుతూ వున్నా ఏదో దిగులు. ఈ కథ యెలా ముగుస్తుందా? ఈ నాటకానికి అంతం యెప్పుడా అని ఆలోచన. ఇంటిపనీ, వుద్యోగ నిర్వహణ అంతరాయంగా-గుణాలు.

కానీ "కాగల కార్యం గంధర్వులే తీర్చారన్నట్లు" ఆనాడు అనుకోనివిధంగా జరిగిన సంఘటన నా ప్రశ్నకు జవాబు చెప్పింది.

రోజు రోజుకూ వారి ప్రవర్తన కఠినంగా తయారయింది. కృష్ణను యింటికి రానిస్తే తను యెక్కడికయినా వెళ్ళిపోక తప్పదన్నారు. నామీద ఎప్పటికప్పుడే నిఘా వేస్తున్నారు. నాలో పంతం కసీ, పెరిగిపోయాయి. కానీ సాంఘిక విలువలనూ, వ్యవస్థనూ కాదనలేను. కాదని మనలేనని నాకు తెలుసు.

అందుకే ఆనాడు నిర్ణయించుకున్నాను-"కృష్ణా-నేను నీకు అందలేను. కనిపించని సంకెళ్ళు నన్ను అన్నివైపులా బంధించి వున్నాయి. భౌతికంగా మనం యెంతో దూరం వున్నా మానసికంగా యిద్దరం ఒకటే" అని చెప్పాలని!

అందుకే - అందరికంటే ముందు బడికి వెళ్ళాను. అనుకున్నట్లుగానే కృష్ణ ఒక్కడే వున్నాడు.

కానీ ఒంటరిగా అతన్ని చూడగానే నాలో వుద్రేకం పొంగింది. చెప్పదలుచుకున్న మాటలేవీ నోట్లోంచి యివతలకి రాలేదు. అతని గుండెలపై తల దాచుకుని రోదించసాగాను.

అలాంటి సమయంలో ఎవరిదో దగ్గు వినిపించి నిశ్చేష్టులమై విడిపోయాము. అసలే పిరికితనం. ఇక ఆ వ్యక్తి తాను చూచిన దృశ్యాన్ని చిలవలు పలవలుగా వర్ణించి చెప్పక మానడు అందరితోటీ. సంఘంలో పరువు ప్రతిష్ఠలతో బ్రతుకుతున్న యిద్దరి కుటుంబాలూ యిక వీధిన పడ్డట్టే అనుకుంటూ భయంతో వణుకుతున్న నేను సెలవు కాగితం యిచ్చేసి ఇంటికి చేరాను.

ఏనాడూ యిటువంటి తప్పు చేయని నేను యిక దుఃఖాన్ని అణచుకోలేకపోయాను. నిజాన్ని దాచుకోలేక జరిగిందంతా అమాయకంగా ఆయన ముందు పెట్టాను. కానీ అన్ని వేళలా నిజం చెబితే జరిగే అనర్థ మేమిటో నా కప్పుడే తెలిసింది.

అంతవరకూ మనసులో దాచుకున్న తన ఆలోచనలనూ, ఆవేశాన్నీ వెళ్ళగ్రక్కేశారు ఆయన. మా యిద్దరిలో అలాంటి భావాలున్నాయని ఎప్పుడో పసిగట్టేశాననీ, యిక కృష్ణ మా యింటికి రావడం కానీ, నాతో చనువుగా వుండడంగానీ సహించలేననీ చెప్పేశారు.

"పదేళ్ళనుంచీ నేను నిన్నెంత గాఢంగా ప్రేమిస్తున్నానో మాటలతో చెప్పలేను వసూ! నీపై నాకేనాడూ ఎవరితో యెంత స్వేచ్ఛగా ప్రవర్తించినా అనుమానం అన్నదే కలుగలేదు. కానీ యీనాడు నేను నీకిచ్చిన స్వతంత్రాన్ని దుర్వినియోగం చేసుకున్నావు. నా మనసుకు నీవు కలిగించిన గాయ మెన్నటికీ మానదు. అయినా నాలో నీకంత అసంతృప్తి కలిగించే గుణాలేమున్నాయి వసూ! కృష్ణ నాకన్న అందగాడా, ధనవంతుడా, విద్యావంతుడా? యేమిటి చూచి అతని ఆకర్షణలో పడ్డావు? జరిగిందేదో జరిగిపోయింది. ఇకమీదటయినా జాగ్రత్తగా వుండు. సంఘంలో మనకున్న పరువు మర్యాదలను నిలబెట్టు. పిల్లల భవిష్యత్తును పాడుచేసే అధికారం నీకు లేదు వసూ!" అని చిన్న పిల్లాడిలా వెక్కి వెక్కి యేడ్చాడు.

నిజమే-ఆయన చెప్పిందంతా నిజమే. కానీ కోతిలాంటి మనసు ఆ మాటలను పెడచెవిని పెట్టమంటుంది. ఇంగితం బాధ్యతలూ, బంధాలపట్ల మొగ్గుతుంది. ఈ రెండింటి ఘర్షణలమధ్య నలిగి నలిగి నీరసించిపోయాను నేను. నా స్వార్థం కోసం, నా మానసిక సంతృప్తి కోసం కుటుంబ గౌరవాన్ని బలి చెయడం బుద్ధితక్కువ అని తెలుసుకున్నాను.

ఆఖరుకు కృష్ణను యింటికి పిలిపించి నన్ను పూర్తిగా మరచిపొమ్మనీ, తనలో లేనిపోని



"నువ్వీ పెట్టెలో పడుకో రాజం!! అప్పుడు మనం. రైలుకు ఒక్క టికట్ కొంటే చాలు!!!

---

ఆశలు రగిలించిన నన్ను క్షమించమనీ వేడుకున్నాను.

ఆయన కూడా కృష్ణను అర్థించారు-ఆదేశించారు. తన కుటుంబ శ్రేయస్సుకై సహకరించమని కోరారు. పరిస్థితులన్నీ అర్థంచేసుకున్న కృష్ణ క్రమంగా మా యింటికి రాకపోకలు తగ్గించాడు. తన చుట్టూ గిరిగీసుకున్నట్లు నాతో దూరదూరంగా మెలగసాగాడు. కానీ-నేను మాత్రం అతన్ని మరచిపోలేక - కొన్ని సందర్భాలలో అతను నన్ను చిన్నచూపు చూస్తున్నాడన్న భావన- కలతపెట్టగా విచిత్రమైన ప్రవర్తనకు అలవాటు పడ్డాను. అందరితోనూ కలహించడం - ముఖ్యంగా ఏ చిన్న విషయంలోనైనా సరే కృష్ణతో దెబ్బలాడ్డం. నా చుట్టూ వున్నవాళ్ళు నన్ను చూచి పరిహసిస్తున్నట్లు వూహించేదాన్ని. ఇక యిలా అయితే నాకు పిచ్చెత్తిపోతుందేమోనన్న భయం కలిగేది. ఆత్మహత్య ప్రయత్నాలు కూడా చేయక పోలేదు- కానీ - పిల్లలు, నన్ను నమ్ముకున్న మావారు నేను లేకపోతే దిక్కుకొకరుగా చెల్లాచెదరవుతున్నారన్న ఆలోచన వచ్చి అదీ విరమించుకున్నాను. తప్పనిసరిగా వుద్యోగం మానేశాను. ఇంటిపనికి తోడుగా పుస్తకాలు చదవడం-అప్పుడప్పుడు చిన్నచిన్న రచనలు చేయడం వ్యాపకమైంది నాకు. క్రమంగా కృష్ణను గురించిన ఆలోచనలు కొంతవరకు స్మృతిపథంలో నుంచి తొలగిపోయినా - కృష్ణ

బదిలీచేయించుకు వెళ్ళినా యేదో చెప్పలేని అభిమానం—

అతన్ని పదేపదే చూడాలని కోరిక.

అతని సాహచర్యాన్ని పొందలేకపోయా నన్న తపన-వివాహమనే యీ పసిడి పంజరంపై అలుక-'ప్రేమ' అన్నది మానసికమైన అను భూతి. దానికి వయస్సూ, పరిస్థితులు అడ్డురావు. అలాంటప్పుడు ఆ ప్రేమ భావవాహినికి అడ్డు కట్ట వేయమనే హక్కు ఈ సంఘానికెవ రిచ్చారు? వివాహితులైనంత మాత్రాన ప్రేమ భావన నశించిపోవాల్సిందేనా? అన్న ఆలో చనలో తేలుతున్న నన్ను తలుపుపై టకటకలు యీ లోకంలోకి తెచ్చాయి. తలుపు తెరిచి చూద్దును గదా! ఎవరో కుర్రవాడు. "అమ్మా అక్కడ చెట్టుకింద నిల్చున్న బాబుగారు మీకీ వుత్తరం యిమ్మన్నారు" అంటూ మడత పెట్టిన కాగితం ఒకటి యిచ్చాడు.

దూరంగా చెట్టుకింద నిలబడ్డ మనిషెవరో నేను పోల్చుకోలేకపోయాను. కాగితం విప్పి చూద్దాను గదా!

"వసుమతిగారూ?

మిమ్మల్ని చూడాలనే లతగారి యింటినుంచి యిక్కడిదాకా వచ్చాను. కాని శ్రీహరిగారు నాకు యిప్పుడే స్టేషనులో కనిపించారు. ఈ యేడెనిమిది సంవత్సరాల మన మధ్యదూరం ఆయనకు నాపై కోపాన్ని పోగొట్టి వుంటుం దనీ పూర్వపు ఆ గాథను మరచి నన్ను ఎప్ప టిలా పలకరిస్తారనీ వూహించి సంతోషంగా దగ్గరకు వెళ్ళాను. కానీ నా దురదృష్టం అతను నన్ను చూడగానే మొహంలో వ్యక్తంచేసిన అసహ్యం, క్రోధం నన్ను కలవరపెట్టాయి. మునుపోసారి మీ జీవితంలో ప్రవేశించి మీ దాంపత్యజీవితాన్ని కలుషితం చేశాను. ఇప్పుడు మళ్ళీ అమృత కలశంలో విషబిందువులా ప్రవే శించి మళ్ళీ మిమ్మల్ని కలతలపాలు చేయడం నాకు భావ్యంకాదు. అందుకే యింటిదాకా వచ్చి మీతో మాట్లాడాలని వున్నా ఆ కోరికను బలవంతాన చంపుకుంటున్నాను. ఆయన ఇంట్లో లేనప్పుడు మీతో ఒంటరిగా మాట్లాడం మీకు అపకారం తలపెట్టినట్లే - మీ జీవితం సుఖ మయం కావాలనీ మీ దాంపత్యం అన్యోన్యంగా వుండాలనే కాంక్షించే—

'కృష్ణ'

ఉత్తరం చదవగానే నా కళ్ళు శ్రావణ మేఘాల్లా వర్షించసాగాయి. తలెత్తి చూస్తే కృష్ణ వడివడిగా వెళ్ళిపోతున్నాడు. ఒక్కసారి రమ్మని ఎలుగెత్తి పిలిస్తే పిలుపు అందనంత దూరంలో అతను.

ఉత్తరం తెచ్చిన కుర్రవాడిని పంపుదామని ప్రక్కకు తిరిగిచూస్తే వాడెప్పుడో వెళ్ళి పోయాడు. వుత్తరం చింపి వుండలుచేసి విసిరే శాను. కన్నీళ్ళతో బరువెక్కిన హృదయంలో అలా ఎంతసేపో నిల్చున్నాను. ఇంత సమీ పానికి వచ్చికూడా కృష్ణతో మాట్లాడలేక పోయిన దురదృష్టం నన్ను వెక్కిరించింది.

అలాగే ఆలోచిస్తూ నిల్చున్న నేను ఆటో ఆగిన చప్పుడుతో వీధిలోకి చూశాను ఎవరా అని!

మరెవరో కాదు వారే-క్యాంపు కాన్సిలైంది కాబోలును.

గబగబా కన్నీరు తుడుచుకుని బలవంతాన నవ్వు పులుముకుని తనకెదురుగా వెళ్ళాను. సూట్‌కేసందుకుని "ఏమిటి క్యాంపు అయి పోయిందా?" అని ప్రశ్నించాను.

"మరో అర్జెంటు పనివుండి మానేశానులే- ఏమిటి తీరిగ్గా నిల్చుని ఆలోచిస్తున్నావ్" అంటూ లోపలికెళ్ళారు.

నాకు అర్థమైంది ఆయన ఎందుకు వచ్చారో క్యాంపు మానుకుని-కృష్ణ రాలేదనీ నన్ను కలు సుకోలేదనీ నేను చెప్పినా నమ్మరు. మళ్ళీ మొదలు అనుకుంటూ ఆయన వెనకే లోపలికి వెళ్ళాను నేను.

సాంఘికపరమైన కట్టుబాట్లకూ

వైవాహిక బంధానికీ—

నా మెడతో తాళికట్టి నాపై అధికారాన్ని సంపాదించిన మా వారికీ—

నా కడుపు చించుకు పుట్టిన నా పిల్లల మమతాను రాగాలకూ బందీని నేను. నేనేకాదు. మన భారతదేశంలోని ప్రతిస్త్రీ కూడా యించు మించు నాలాంటి కోవకు చెందిందే. □

# పరమపద సోపానం

ఆ అంగడికి వెళ్లిన పక్కింటి అబ్బాయి ఇంకా తిరిగి రాలేదు.

శ్రీమతికి కంగారుగా వుంది.

అరగంట క్రితమనగా నల్లులమందు తీసుక రావడం కోసం అతడిని పంపింది ఆమె.

ఎవ్వరికీ తెలియకుండా రహస్యంగా తీసుక రమ్మని రెండు మూడుసార్లు హెచ్చరించింది. అలాచేస్తే పావలా యిస్తానని ఆశచూపెట్టింది. దాంతో గాలిపటమూ, దారమూ కొనుక్కో వచ్చునని వూరించింది.

తాను నల్లుల మందుకోసం ఆ అబ్బాయిని పంపినట్టు ఎవరయినా తెలుసుకున్నారేమోనని భయపడుతోంది.

పైకిలేచి వీధి గుమ్మంకేసి నడచింది.

వీధిలో గ్రీష్మకాలపు సూర్యుడు తన ప్రతాపం చూపెట్టుతున్నాడు. అందువల్ల వీధి నిర్మానుష్యంగా వుంది. ఆ అబ్బాయి వచ్చే జాడ కనిపించకపోవడంతో శ్రీమతి వెనుదిరిగింది.

ఇంతలో తనను పలకరిస్తున్నట్టుగా ఈల వినిపించింది. ఉలిక్కిపడి వెనుదిరిగింది. బుద్ధిమంతుడిలా పేపరులో తల దాచుకున్నాడు నరహరి. అటువైపుకోసారి వురిమి చూసి శ్రీమతి యింటిలోకి వచ్చేసింది.

రాజమ్మ యింకా షాక్ నుంచి కోలుకోలేదు. శ్రీమతికి తన తల్లి బాధలనే పదార్థంతోనే పోతపోసిన విగ్రహంలా కనిపించింది.

మానవజీవితం సమస్యల పుట్టలాంటిది. ఒక సమస్య తొలగిపోతే మరో సమస్య పుట్టుకొస్తుంది. రాజమ్మ జీవితం సమస్యల నెదుర్కోవడంలోనే జరిగిపోతోంది. జీవితాంతం అండగా నిలవాల్సిన భర్త పదిహేనేళ్ళ క్రితమే చనిపోయాడు. సంసారాన్ని ఆవిడే పోషించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. అయినా ఆవిడప్పుడు యింతగా క్రుంగిపోలేదు. నాలుగైదు యిళ్ళలో పాచిపని చేసింది. రోజూ కూలికి వెళ్ళేది. పెద్దవాడు ప్రకాశాన్ని యింటర్మీడియట్ వరకూ చదివించుకొంది. ఆ తరువాత ప్రకాశం తాను చదవనుగాక చదవనని భీష్మించుక కూర్చున్నాడు. తన స్నేహితుడి సహాయంతో ఫ్రూట్ జ్యూస్ తయారుచేసే ఫ్యాక్టరీలో ఓ చిన్న వుద్యోగం సంపాదించుకున్నాడు. నెలకు మూడువందల జీతం.

"ఎదిగి వచ్చిన కొడుకు బాధ్యతలనుంచీ విముక్తురాల్ని గావించినా ఆమెను బాధలింకా వదిలిపెట్టలేదు. అందుకు తానేగా కారణం!" అనుకొంది శ్రీమతి.

'వీల్లేదు. తాను మరొకరికి బరువుగా వుండగూడదు. తనవల్ల మరొకరు బాధ పడగూడదు. ఇందుకు పరిష్కారం తానే ఆలోచించాలి' అనుకొని పైకి లేచి వీధిలోకి నడచింది.

వీధిలో పక్కింటి అబ్బాయి కనిపించాడు.

దగ్గరికి వచ్చిన తరువాత జేబులో నుంచీ డబ్బులు పైకి తీశాడు.

మధురాంతకం నరేంద్ర

డబ్బులు ఆమె చేతిలో పెడుతూ "మందు లేదన్నారు. స్టాకు అయిపోయిందట. వారం వరకూ రాదన్నారు" అన్నాడు.

ఆమె నిరుత్సాహపడిపోయి "పోనీలే" అంటూ వెనుదిరిగింది.

"మరి పావలా " గొణిగాడు పక్కింటబ్బాయి.

వాడి చేతిలో పావలాబిళ్ళ పెడుతూ "ఈ విషయం ఎవరికీ చెప్పగూడదు " అంది శ్రీమతి.

సరేనంటూ తుర్రుమన్నాడు ఆ అబ్బాయి.

శ్రీమతి లోపలకొచ్చి మూలగా చుట్టిపెట్టి వున్న పడకలపైన వాలిపోయింది. ఎదురుగా అలమారాలో అందంగా సద్దిపెట్టివున్న పుస్తకాలు ఆమెను వెక్కిరిస్తున్నట్టుగా కనిపించాయి ఆమెకు వాటి అవసరం చాలా రోజుల క్రితమే తీరిపోయింది. శ్రీమతి కాలేజీకి వెళ్ళడం మానేసి సంవత్సరం రోజులకుపైగా అవుతోంది.

* * *

పద్దెనిమిదేళ్లు ముగిసీ ముగియక మునుపటి నుంచీ శ్రీమతికి పెళ్లి ప్రయత్నాలు మొదలయ్యాయి. ఎందరో వచ్చి చూశారు. తమకు తగినంత అందం లేదన్నారు కొందరు. కట్నం చాల్లేదన్నారు యింకొందరు. జాతకాలు కుదరలేదనేశారు మరికొందరు. చివరికో సంబంధం కుదిరింది. పెళ్లిపత్రికలు ప్రింటయ్యాయి. ఏర్పాట్లు జరిగిపోతున్నాయి. అటువంటి సందర్భంలో మరికొంత డబ్బు ఎక్కువగా లభించే యింకో సంబంధం చూసుకున్నారు అవతలి వాళ్లు. పెళ్లి ఆగిపోయింది. శ్రీమతి అన్నయ్య ప్రకాశానికి తల కొట్టేసినంత పనయ్యింది. రాజమ్మ నెత్తీ నోరూ మొత్తుకుంది. తనకేసి అందరూ అదోలా చూస్తున్నారంటూ అప్పుడే శ్రీమతి కాలేజీకి వెళ్ళడం మానేసింది.

వంటింట్లో పాత్రలు దొర్లుతున్న శబ్దం వినగానే పైకి లేచింది శ్రీమతి. అన్నం పాత్రను పడదోసి నేలపైకి పడిన అన్నాన్నంతా తినేస్తోంది ఓ కుక్కపిల్ల. మధ్యాహ్నం తల్లీ కూతుళ్లిద్దరూ భోంచేయలేదు. అందుకే అన్నం అలా పాత్ర నిండుకూ వుండిపోయింది. అడుగుల చప్పుడు వినగానే తల పైకెత్తి చూసి, ఆమె అట్లకాడ చేతికందుకోగానే కుక్కపిల్ల బయటకి దౌడు తీసింది.

శ్రీమతి బయటకు వచ్చి మళ్ళీ పడకల పైకి వాలిపోయింది.

భయంకరమైన నిశ్శబ్దం మళ్ళీ ఆవరించుకొంది.

ప్రొద్దున పదిగంటల ప్రాంతంలో శ్రీపతి తండ్రి రాసిన వుత్తరం అందుకొన్నప్పటి నుంచీ ఆ యింటిని అలాంటి నిశ్శబ్దమే రాజ్యమేలుతోంది.

'శ్రీపతి-శ్రీమతి' పేర్లెంత బాగా కుదిరాయి అని వందసార్లయినా అనుకొని వుంటుంది శ్రీమతి.

రోజంతా విపరీతంగా ఎండకాసిన తరువాత సాయంకాలం అనుకోకుండా భోరున కురిసే వర్షంలా వాళ్లింటికి వచ్చాడు శ్రీపతి. అతగాడు ప్రకాశానికి బాల్యస్నేహితుడు. బీకామ్ వరకూ చదువుకొని కర్నూల్లో బ్యాంకు వుద్యోగం చేసుకుంటున్నాడు. సమయం చూసి తన మనసులోని మాట బయటపెట్టాడు ప్రకాశం. మా యింట్లోగూడా ఈమధ్య పెళ్లి పెళ్ళంటూ తొందరపెడుతున్నారు. 'మీ అమ్మానాన్నా ఒప్పుకుంటే మీ చెల్లెల్ని పెళ్లిచేసుకోవడానికి నాకేమీ అభ్యంతరంలేదు' అనేశాడు శ్రీపతి. అతడి అమ్మానాన్నా వచ్చి చూశారు. అమ్మాయి వాళ్ళకు నచ్చింది. పెళ్లి నిశ్చయమైపోయింది. పెళ్లిపనులు చకచక జరిగిపోతున్నాయి. ఫ్యాక్టరీవాళ్ళ పనులు చెయ్యడంకోసం ప్రకాశం తిరుపతికి వెళ్లిన రోజునే ఆ వుత్తరం వచ్చింది. శ్రీపతికి తనకిప్పుడిప్పుడే పెళ్ళిచేసుకోవాలని లేదని వాళ్ళనాన్నగారికి వుత్తరం రాశాడట! ఆ విషయమే ప్రకాశానికి తెలియజేశారు ఆయన.

"మొదటిసారీ యిలాగే పెండ్లి నిశ్చయమైపోయిన తరువాత మనపనులు మనం చేసుక

పోతూవుంటే ఆగిపోయింది. ఇప్పుడూ ఇలాగే జరుగుతోంది. నిశ్చయమైపోయిన ఈ పెండ్లి యిలా ఆగిపోతూవుంటే ఎలాగే శ్రీమతీ! నేనేం చెయ్యనే ...అయ్యో నా రాతా!" అంటూ వాపోసాగింది రాజమ్మ.

"అప్పుడే మొదలుపెట్టావా ఏడుపు! అయినా ప్రపంచానికి యిప్పుడేం ప్రళయమొచ్చింది చెప్పు?....నేనసలు పెళ్ళే చేసుకోను. నువ్వలా ఏడిస్తే నేనూరుకోను" అంటూ జీరబోయిన గొంతుతో వారించింది శ్రీమతి.

కూతురికి భయపడి నోరు తెరిచి మాట్లాడక పోయినా అప్పటినుంచీ రాజమ్మ మనసులోనే క్రుంగిపోతోంది. తల్లి అలా బాధపడుతూ వుండడాన్ని గమనించిన శ్రీమతి భరించలేక పోయింది.

ప్రతివిషయానికి దండిస్తూవుంటే పిల్లలు మొండివాళ్ళుగా తయారౌతారు. సమస్యలు విశ్వరూపాన్ని ధరించినప్పుడు పెద్దలు గూడా అలాగే మొండివాళ్ళగా తయారవుతారనిపిస్తుంది. శ్రీమతిని అలాంటి మొండితనమే ఆవహించింది.

తనవల్ల ఏర్పడిన సమస్యకు తానే సరయిన పరిష్కారం చూసుకోవాలని అనుకొంది. ఆలోచించి, ఆలోచించి చివరకు పక్కింటి అబ్బాయిని నల్లులమందు తెచ్చిపెట్టమని అడిగింది. రాజమ్మ బలహీనంగా మూలుగుతూ వుండడం వినిపించగానే శ్రీమతి వులిక్కిపడింది. ఆమె దగ్గరికి నడిచి "ఏమిటే అమ్మా! మూలుగుతున్నావు?" అంటూ కంగారుగా ప్రశ్నించింది.

నాలుగయిదుసార్లు కుదిపికుదిపి అడిగిన తరువాత మెల్లగా కళ్ళు తెరిచింది రాజమ్మ. "గుండె నొప్పోంది" అంది.

"చాలా సేపటి నుంచీ నొప్పోందా?"

"ఇప్పుడే కొద్దిగా ఎక్కువయ్యింది."

శ్రీమతి డాక్టరు దగ్గరికి పరిగెత్తింది.

ఆ వీధిలోనే కొంచెం దూరంలో ఓ డాక్టరు కొత్తగా ప్రాక్టీసుపెట్టాడు. అతడిని తీసు



కొచ్చింది.

పేషెంటును పరీక్షించిన తరువాత కొన్ని టేబ్లెట్లు తెప్పించమని ప్రిస్క్రిప్షన్ వ్రాసిచ్చాడు డాక్టరు. ఇంజెక్షను చేసిన తరువాత ఫీజు తీసుకొని వెళ్లిపోతూ "అనవసరంగా ఆలోచించడమూ, ఆవేశపడడమూ మంచిదిగాదు. నేను వ్రాసిచ్చిన మందులు చెప్పిన ప్రకారం వాడండి. ఆ మాత్రలు వేసు

కుంటే బాగా నిద్ర పడుతుంది. ఒక మాట- మీరు రాత్రికంతా పేషెంటుపైన ఒక కన్ను వేసివుండాలి. మరేమీ కంగారు పడవలసిన అవసరం లేదు" అన్నాడు.

శ్రీమతి బజారుకు వెళ్లి మాత్రలు తీసు కొచ్చింది.

ఆమె రాత్రంతా నిద్రపోనట్టే లెక్క.

ఆత్మహత్య మహాపాపమన్నారు పెద్దలు. ఒడుదుడుకులకు తట్టుకొని సూటిగా గమ్యం కేసి నడుస్తూ కర్తవ్యపాలన చేయమంటుంది గీత. రాత్రంతా ఆలోచిస్తూ వుండిన శ్రీమతి తెల్లవారేసరికి చచ్చిసాధించేదేమీ వుండదన్న నిర్ణయాని కొచ్చేసింది. ఆమె మనసులో మరో వూహ స్ఫురించింది. తనవాళ్ళకూ, తనవూరికీ దూరంగా ఎక్కడికో మారుమూల ప్రాంతా నికో, సుదూర తీరానికో పారిపోవాలనిపిం చింది. కానీ ఒంటరిగా తానెలా అంతదూరం వెళ్ళగలదు? తనకో తోడు కావాలి. తనకు తోడెవరు వస్తారు?

శ్రీమతి కప్పుడు నరహరి గుర్తుకొచ్చాడు.

కొందరు నిర్దుష్టమయిన జీవితాన్ని గడప లేరు. సమయానికింత తినడం కోసం మిగిలిన అవసరాలు తీర్చుకోవడం కోసం ఎక్కడో ఒక చోట, ఏదో ఒక పని చేస్తారు. వాళ్ళకు నా అనేవాళ్ళుండరు. ఒకవూళ్ళో వాళ్ళుండలేరు. ఒకచోట పని చేయలేరు. ఎక్కడ పడితే అక్కడ తిరగడం, తోచినట్టల్లా ప్రవర్తిం చడం వాళ్ళకలవాటు. వాళ్ళు దారం తెగిన గాలిపటాలు; తాడులేని బొంగరాలు.

నరహరి అలాంటివాడే!

అతడిది ఆ వూరు కాదు. రెండు మూడు నెలల క్రితం ఆ వూరు వచ్చాడు. శ్రీమతి యింటి కెదురుగా సోడాలు తయారుచేసే అంగడొకటుంది. అందులో అతను పనిచేస్తూ వుంటాడు. సమయం దొరికినప్పుడల్లా మాంసం ముక్కకోసం చూసే కుక్కలా ఎదురింటి వైపు చూపులు సారిస్తూ వుంటాడు.

అంగడిలో అతడున్నాడో లేదో చూడ్డం కోసం వీధి వాకిలి దగ్గరికి వచ్చింది శ్రీమతి.

నరహరి అంగడిలో కనిపించాడు.

కానీ అప్పుడే తిరుపతి నుంచి తిరిగొచ్చిన ఆమె అన్న ప్రకాశం "నా కోసమేనా ఎదురు చూస్తున్నావు?" అంటూ లోపలి కొచ్చాడు.

శ్రీమతి అతడి వెనకాలే నడచింది.

మంచంపైన పడుకొని వున్న తల్లిని చూడ గానే "ఈవేళప్పుడు అమ్మ ఎందుకలా పడు కొందే శ్రీమతీ?" అని అడిగాడు.

"నిన్న గుండె నొప్పొచ్చింది. డాక్టరొచ్చి మందిచ్చి వెళ్ళాడు. ఇంకా నీరసంగా వుంటే"

"ఎందుకొచ్చింది?" అంటూ తల్లివైపు నడచాడు.

రాజమ్మ కళ్ళు తెరిచింది.

"ఎలా వుందమ్మా?" కంగారుగా ప్రశ్నిం చాడు ప్రకాశం.

అన్ని ప్రశ్నలకూ సమాధానంలా శ్రీమతి వుత్తరం తీసుకొచ్చి యిచ్చింది.

వుత్తరం చదవగానే కాస్సేపు నిశ్చేష్టుడై వుండిపోయాడు ప్రకాశం. తరువాత కాలు గాలిన పిల్లిలా మండిపడసాగాడు.

"చూస్తాను. వాడి కిభేమిటో తేలుస్తాను. చేసుకుంటాననటం, తరువాత కాదుపొమ్మనటం అంతా వాడిష్టమే నేమిటి? ఇప్పుడు చేసుకో నంటే ఎలా కుదురుతుందో కనుక్కుంటాను" అంటూ పైకిలేచి "వెళ్లొస్తాను" అన్నాడు.

"ఎక్కడికి?" అంటూ ప్రశ్నించింది రాజమ్మ.

"కర్నూలుకు."

"అప్పుడేనా? అంత తొందరెందుకు?" అంది శ్రీమతి.

"ఇప్పుడుగాక మరెప్పుడు తొందరపడాలి? నువ్వేం భయపడకమ్మా! అసలు సంగతేమిటో తెలుసుకొని వస్తాను" అంటూ వెళ్ళిపోయాడు ప్రకాశం.

రాజమ్మ బాధగా కళ్ళు మూసుకొంది.

ఆడపిల్లను గుండెల మీద కుంపటితో పోల్చాడో మహానుభావుడు. ఇంకా నయం గుండెల్లోని కుంపటనలేదు. నిజానికి ఆడపిల్ల

అందరికీ బరువే! ఆ బరువు దించుకోవడం కోసం పడరానిపాట్లు పడతారు. దించుకోలేక పోతే క్రుంగిపోతారు. తనకోసం తనవాళ్ళలా బాధపడుతూ వుంటే చూస్తూ భరించడానికి ఆ అమ్మాయి యంత్రం గాదు. 'ఊరినుంచీ నిరాశతో తిరిగొచ్చే అన్నయ్య ముఖం తానెలా చూడగలదు? ఒద్దు తండ్రీ ఒద్దు! అంత సాహసం తనకు లేదు. ఈ సమస్యకు పరిష్కారం తానే చూడాలి' దృఢ నిశ్చయంతో పైకిలేచి వీధివైపు నడచింది శ్రీమతి.

ఎదురుగా కొట్లో కనిపించాడు నరహరి.

రమ్మంటూ సైగ చేసింది.

అతడు దగ్గరికొచ్చి ఏమిటన్నట్టుగా చూశాడు.

శ్రీమతి నవ్వడానికి ప్రయత్నించింది. "ఈ పూళ్ళో నాకేమీ తోచడం లేదు" అంది.

నరహరికేమీ అర్థం గాలేదు. అయోమయంగా చూశాడు.

"ఎక్కడి కయినా వెళ్ళాలని వుంది. మదరాసు వెడదాం వస్తావూ?"

నరహరి ఆనందంగా తల వూపాడు.

"రాత్రి పదకొండు గంటలకు రెడీగా వుంటావుగదూ?"

అతను సరేనన్నాడు.

సాయంకాలం ఏడుగంటలకంతా శ్రీమతి వంటపని పూర్తి చేసింది. ఎనిమిది గంటల ప్రాంతంలో బలవంతంగా కూర్చోబెట్టి తల్లిచేత చారన్నం తినిపించింది. మానసికంగా అలసిపోయిన రాజమ్మను పదిగంటలకు నిద్ర కరుణించింది!

ఊరు మాటు మణిగిపోయినప్పటినుంచీ వీధి గడపలో కూర్చుని ఎదురుచూడసాగింది శ్రీమతి.

ఇంట్లో చీకటిగా వుంది.

అయినా వీధి దీపం వెలుతురు మసక మసకగా పడుతోంది.

పక్కింటి గడియారం పదకొండు గంటలు కొట్టింది. ఉలిక్కిపడి తాను సర్దుకున్న



"ఎందుకురా అన్ని పేపర్‌యారోస్?"

"ఈ రోజు మా క్లాసుకు ఓ కొత్త మాస్టారు వస్తున్నారమ్మా!!"

సామాన్లు తనికీ చేసుకొంది శ్రీమతి.

కాలం బరువుగా గడచిపోతోంది.

శ్రీమతి ఎదురు చూస్తూనే వుంది.

పక్కింటి గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

ఒంటి గంటయ్యింది.

నిశ్శబ్దంగా వున్న కాలసముద్రంలో పడి గంటలనే గులకరాళ్ళు బుడుంగున మునిగి పోతున్నాయి!

నరహరి జాడ కనిపించలేదు.

తెల్లవారుజామున శ్రీమతి తనకు తెలియకుండానే అక్కడే వీధి గడపను తలగడగా చేసుకొని నిద్రలోకి జారిపోయింది.

ఉదయం వీధిలో కొళాయి దగ్గర బిందెల చప్పుళ్ళు, సూటిగా ముఖంపైకి వచ్చి పడుతున్న సూర్యకిరణాలు శ్రీమతిని నిద్రలేపాయి.

నిద్ర లేచిన రెండు మూడు నిముషాల తరువాత శ్రీమతికి జరిగినదంతా అర్థమైంది.

"కొళాయి దగ్గర అప్పుడే జనం పెరిగి పోతున్నారే తల్లీ! వెళ్ళి నీళ్ళపని చూడు. అయినా అదేం పొయ్యేకాలమే! గడప దగ్గర పడకయినా లేకుండా పడుకొన్నావు? తల పట్టుకోదూ?" అంటూ కర్తవ్యాన్ని బోధించింది రాజమ్మ.

కంగారును కప్పిపుచ్చుకోవడం కోసం ప్రయత్నం చేస్తూ బిందెను అందుకొని వీధి

లోకి నడచింది శ్రీమతి.

'ప్రతి విషయంలోనూ తాను అనుకొన్న దానికీ జరిగేదానికి పొంతన కుదరడమే లేదు. లేకపోతే ఆ నరహరి వస్తానని మాటిచ్చి తీరా రాకనే పోవాలా? ఈ రాత్రి ఆయనగారికంత తొందర పనేమొచ్చిందో. .' మనసులో విసుక్కుంటూ బిందెను కొళాయి దగ్గర పెట్టింది ఆమె.

"విన్నావుటే శ్రీమతీ! " అంటూ వుదయం వార్తలను తెలియజేయడం కోసం పలకరించింది పక్కింటావిడ.

ఏమిటన్నట్టుగా చూసింది శ్రీమతి.

"సోడాకొట్లో వుండేవాడే నరహరి "

శ్రీమతి వులిక్కిపడి ఆమెకేసి చూసింది. ఆవిడ చెప్పుకుపోసాగింది—"నువ్వూ చూసే వుంటావులే నాకు వాడ్ని చూసినప్పుడే అనుమానం వచ్చింది. వాడికి లేని వ్యసనం లేదు. అన్నీ చెడుసావాసాలే! వాడనుకొన్నంతపని చేయనే చేశాడు "

"ఇంతకూ ఏం చేశాడో చెప్పు .. " విసుక్కుంది శ్రీమతి.

"ఎక్కడో దొంగతనం చేశాడట. అసలు వాడు పాత కేడీనేనని చెప్పారు మావారు. ఎక్కడో ఏదో దొంగపని చేసి తప్పించుకొని యిక్కడికి వచ్చాడట! నిన్నరాత్రి పోలీసులు పట్టుకెళ్ళి కమ్ముల్లో పెట్టారుట."

'ఇటువంటివాడితోనా తానువెళ్ళాలనుకొంది' శ్రీమతి భయంతో వులిక్కిపడింది. అలా జరగనందుకు సంతోషించింది.

ఇంట్లో యాంత్రికంగా పనులు చేసుకపోతూనే వున్నా ఆమె మనసు ఆలోచిస్తూనే వుంది. 'కుక్కతోక పట్టుకొని తాను గోదావరీదాలనుకొంది. మట్టి గుర్రాన్ని నమ్మాలనుకొంది. ఎంతలో ఎంత గండం గడిచిపోయింది? ఈ ప్రపంచంలో ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మగూడదో అర్థం గావడం లేదు. ఇక ఇలా గాదు. ఈ ప్రపంచంలో తా నొంటరిగా పోరాడాల్సిందే!' అని నిశ్చయించుకుంది.

ఇల్లంతా వెదికి డబ్బులు ప్రోగుచేసుకుంది. రాత్రికి ఒంటరిగానే యిల్లు వదలిపెట్టి వెళ్ళిపోవాలన్న నిర్ణయాని కొచ్చింది.

మునుపటి రోజులాగాక రాజమ్మ పైకిలేచి యింటి పనులలో కూతురికిసహాయపడసాగింది.

మధ్యాహ్నం తల్లికి అన్నంపెట్టి తానూ భోంచేసింది శ్రీమతి.

పడకపైన వాలిపోవడ మొక్కటే ఆమెకు తెలుసు. రాత్రి చాలా సేపటివరకూ నిద్రపోకుండా మేలుకునే వుండడంవల్ల నిద్రలోకి జారిపోయింది.

సాయంకాలం నాలుగు గంటలయ్యింది.

అనుకున్నదానికంటే ముందుగా వచ్చేసినట్టున్నాడు ప్రకాశం. మగత నిద్రలోవున్న శ్రీమతి అతడి మాటలు విని వులిక్కిపడి పైకి లేచింది.

"శ్రీపతి బలేవాడు లేమ్మా! వారం రోజులుగా దగ్గుతూ వుండడంతో అనుమానమొచ్చిందట! అతగాడు సిగరెట్లు కాలుస్తాడులే! తనకేదో రోగమొచ్చిందని అనుకున్నాడు. డాక్టరెవడో అతడికి తగినవాడే దొరికాడు. వీలయినంత ఎక్కువగా డబ్బు గుంజడం కోసం ఎక్స్‌రేలూ, బ్లడ్ టెస్టూ అంటూ కంగారు పెట్టేశాడట! శ్రీపతి తనకేదో పెద్ద జబ్బొచ్చేసిందని నిర్ణయించుకొని తనవల్ల మరో అమ్మాయి జీవితం పాడైపోతుందని భావించుకొని, యింటికలా వుత్తరం రాసాడట! తీరా నేను వెళ్ళి కోపంతో కేకలేసేసరికి జరిగినదంతా చెప్పాడు. డాక్టరు చివరకు ఆ లక్షణాలేమీ లేవని తేల్చి చెప్పేశాడట. ప్రస్తుతం ఆరోగ్యంగా గుండులా వున్నానని నమ్మకం కలిగింది ఆయనగారికి. అందువల్ల పెళ్ళి ఆగడమన్న ప్రసక్తే లేదు. అన్నట్టు చెప్పడం మరిచాను-ముహూర్తం చీర ఏ రంగులో కొనాలో చెల్లెల్నడిగి రాయమన్నారట శ్రీపతి తండ్రిగారు "

ఊహించని విషయాన్ని విన్నందువల్ల శ్రీమతి కాస్సేపు స్థాణువులా వుండిపోయింది.

క్రమక్రమంగా ఆమె ముఖంలో వెలుగు చోటు చేసుకొంది. 

# కన్నీరు నిండిన పన్నీరు బుడ్డి



ఆ సాయంత్రం నేను ఆఫీసునుంచీ వచ్చే సరికి ఇంట్లో బుజ్జిగాణ్ణి ఎత్తుకొని కనిపించారు మామగారు. కులాసాకబుర్లు అయ్యాక

"మా చిన్నమ్మాయి పెళ్ళి తలపెట్టుకున్నాం బాబూ ముహూర్తానికి ఎక్కువ వ్యవధిలేదు. వర్షాలు. శ్రావణంలో కాకుండా కార్తీకంలో చేద్దా

## అన్నపూర్ణ

మని మేమనుకున్నా అవతల వాళ్ళ తొందరను బట్టి సరే అనక తప్పలేదు. మీ అత్తగారు వంటరిది. పెద్దమ్మాయిని కూడా తీసుకువెళ్తే దానికి చేదోడు వాదోడుగా వుంటుంది. ఈ రాత్రిబండికే మీనాని తీసుకువెళ్దామనుకుంటున్నాను బాబూ " అంటూ అసలు విషయం బయటపెట్టారు. మరోవిధంగా మాట్లాడటానికి అది సమయం కాదని "సరే, అలాగే కానీయండి మామగారూ" అననేశాను నన్ను కూడా పెళ్ళికి నాలుగురోజులు ముందస్తుగా రమ్మని మరీమరీ చెప్పి రాత్రిబండికే కూతుర్ని తీసుకువెళ్ళారాయన.

మీనాకి యిలా అనుకోకుండా ప్రయాణం తగలటం నాకు ఓ విధంగా సంతోషంగానే వుంది.. కారణం ఈ మధ్యే ఓ పత్రికవాళ్ళు పోటీ నిర్వహిస్తున్నట్లు ప్రకటించటం, సామాన్య రచయితగా నేనూ ఓ మంచి కథ రాసి ఆ పోటీలో పాల్గొనాలని నిర్ణయించేసుకోవటం జరిగింది.

"మాటకు ప్రాణము, సత్యము, చీటికి ప్రాణంబు వ్రాలు " అన్నట్టు వాటికి అవి ఎంత ముఖ్యమో కథకూ వస్తువనేది అంత ముఖ్యం. దానికోసం తెగతిప్పలుపడిపోతున్నానీ మధ్య!

చిన్నప్పుడు వస ఎక్కువ పోసినట్టున్నారు మీనాకు — ప్రొద్దస్తమానూ కబుర్లతో నా మూడ్సన్నిటినీ చెదరగొట్టేస్తుంది పైగా మా బుజ్జిగాడొకడు. సంగీత విద్వాంసుడిలా నిరంతర రాగాలాపనలో వుంటాడు.

అసలు మీనా పుట్టింటికి వెళ్ళిన సందర్భాలలోనే నేను కొన్ని ఘనకార్యాలు సాధించిన మాట నిజం. ఆమె తన అన్నయ్య పెళ్ళికి వెళ్ళినప్పుడు నేను తీరుబాటుగా కూర్చొని రాసిన నవల 'అందలం మీద అమ్మాయి' అచ్చుభాగ్యానికి నోచుకొని పదుగురిని విశేషంగా ఆకర్షించింది కూడా. తర్వాత అచ్చయిన నా రెండోనవల 'పిరికివాడి ప్రణయం' రాసిందీ మీనాక్షి నా దగ్గిర లేనప్పుడే. అప్పుడామె పురిటికని పుట్టింట్లో వుంది . ఇపుడు నేను పోటీకి సంబంధించి ఓ మాంచి కథ రాయాలనుకుంటూండగానే మా మరదలి పెళ్ళి నిర్ణయమవటం నాకు అనుకోని అదృష్టంగా తోచింది.

ఎంతైనా మీనాలేని లోటు లోటే... నేను ఎన్నిసార్లు కాఫీ త్రాగేదీ, ఎప్పుడు తిండి తినేది ఆమెకు తెలుసు. సమయం కనిపెట్టి నేను అడక్కుండానే అన్నీ అమర్చిపెట్టేది ఇక ఆమె తిరిగి వచ్చేవరకు ఆహారపానీయాల విషయంలో నాకు అవస్థలు తప్పవు.

ఆదివారమేకదా అని ఆలస్యంగా నిద్ర లేవటం జరిగింది మర్నాడు.

నిత్యకృత్యాలు తీర్చుకోవటానికని బయటికి వచ్చేసరికి బావిపళ్ళెంలో ముగ్గురు ఆడంగులు ముచ్చటలాడకొంటూ గుడ్డలు నుసుముకుంటున్నారు. ఆలస్యంగా లేవటం ఎంత పొరబాటైందో అప్పుడే తెలిసివచ్చింది ఉదయం ఏడుగంటలలోపే ఏ మగాడు బావిదగ్గిర స్నానం చేసినా ఆ టయం దాటిందంటే ఒకరొకరే ఆడవాళ్ళు పోగయితారక్కడ.

ఆశ్రమంలా ఆవరణలో చుట్టూ ఇళ్ళు వున్నాయి. కేవలం అద్దెలకోసమే అన్నట్లు చతురస్రాకారంలో నాలాగు లోగిళ్ళు కట్టాడు అత్యాశాపరుడైన మా యింటి యజమాని. అందరికీ ఉమ్మడి ఆస్తిగా నాలుగు ఇళ్ళ మధ్యన ఆ బావి. బిజీ సెంటర్ లా ఎప్పుడూ యెవరో ఒకరు చేదవేసి తీస్తూనేవుంటారు.

మీనా వుంటే నేను ఎప్పుడు లేచినా వాటర్ సమస్య వుండేది కాదు ఇప్పుడు బావిదగ్గిరేమో ఆడవాళ్లున్నారు. వాళ్ళముందుకు వెళ్ళేదెలా? వెళ్ళకపోతే నా స్నానమెలా? ఇంట్లోంచి బయటపడటమెలా?

దిక్కుతోచక లోపలికి వచ్చి కుర్చీలో కూలబడ్డాను.

నా దీనావస్థను గమనించినట్లుంది. "ఇవిగోండి నీళ్ళు స్నానం కానివ్వండి" అంటూ అమృత వాళ్ళ బాల్చిలో నీళ్ళు తెచ్చి మా గుమ్మంలో పెట్టింది.

అమృతది నిజంగా అమృత హృదయమే అనిపించింది. అయినా పైకి, "అరె, మీకెందుకండీ శ్రమ? నేనే ఏదో తిప్పలు పడేవాణ్ణి కదా?" అనన్నాను.

యిందులో శ్రమ ఏముందిలెండి . అయినా మీరు ఆ బావిదగ్గిర కూర్చున్నవాళ్ళతో పెట్టు కొంటే ప్రొద్దుగూకుతుంది" అంటూ నవ్వింది.

నవ్వినప్పుడే చూడాలి అమృత అందాన్ని. గులాబీల్లాంటి పెదవులు విచ్చుకొని ముత్యాల్లాంటి పలువరుస బయటపడుతుంది.

మా ప్రక్కవాటాలో వుండే రంగనాధం చెల్లెలే అమృత ఏదో కొద్దిగా చదువుకొంది. తల్లిదండ్రిలేరు చాలీ చాలని జీతంలో చెల్లెలి పెళ్ళి చేయలేకపోతున్నాడు రంగనాధం.

"సరె ముందు స్నానం కానీయండి" అని తిరిగి తనే చెప్పి వెళ్ళింది అమృత.

ఆలాగే కానిచ్చి డ్రస్సయ్యాను.

"బాల్చీ ఇవ్వండి . కావాలి" తిరిగి వచ్చి నావైపు అదోమారి చూస్తూ అడిగింది.

అమృతకు మీనాకు తగని స్నేహం నేను ఆఫీసుకు వెళ్ళి తిరిగి వచ్చేవరకు మీనాను అంటిపెట్టుకొనే వుంటుంది అమృత. నేను ఉన్నప్పుడూ విడియపడక వచ్చి లోపల కూర్చొని ఏదో ఒకటి మాట్లాడుతూనే వుంటుంది. మధ్యమధ్య నా వైపు అదోమాదిరి చూస్తూంటుంది.

అవి ఏ మగవాడూ తట్టుకోలేని చూపులు.

ఉప్పుకారం తినే మామూలు వ్యక్తిగా ఆమె ఆ ర్తిచూపులకు ఆవేశపడతాను. మంచి చెడు విచక్షణా జ్ఞానంవున్న ఓ చిన్నరచయితగా ఆ చూపుల వెనక ద్యోతకమయ్యే ఆశలు ఆకాంక్షలను అర్థంచేసుకొని జాలిపడతాను.

నిజంగా ఇది ఆదర్శాలలోకం, ఆడంబరాల లోకం. ఎదటివాణ్ణి పరుగులు తీయమనడమే కాని తాను ముందుకు ఒక్క అడుగు కూడు వేసేదిలేదు. అందుకే అందాలరాసి అమృత పెళ్ళి ఓ పెద్ద సమస్య అయిపోయింది వాళ్ళ వాళ్ళకు.

"ఇదుగోండి" అంటూ బాల్చీ అక్కడపెట్టి నా ముఖం ప్రక్కకు తిప్పేసుకున్నాను.

అమృత ఏదో పెద్ద పొరపాటు చేసినట్లు ఫీలవుతూ వెళ్ళటం నిలువుటద్దంలో స్పష్టంగా కనిపించింది.

# జోల

కలవారి కోడలు కలికి మీనాక్షి
కథ రాయుచున్నది కలము చేపట్టి
అప్పుడే వచ్చాడు ఆమె పెద్దన్న
కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీళ్ళ నింపె.
"ఏడవకు చెల్లెలా! ఏడవకు, ఏడవకు,
ఎవ్వరేమన్నారు? ఎవరు తిట్టారమ్మ!"
"కథలు నవలలు రాయ కాలమే చాలక
రాత్రనక పగలనక నే చచ్చుచుంటి;
వంట చెయ్యాలంటు అత్తయ్య పోరు,
వడ్డించ రమ్మంటు అటు మామగారు,
నీళ్లోసి తలదువ్వమని పిల్లవాళ్ళు—
నేను భరియించలే నన్న ఈ నరకం!"
"ఏడవకు చెల్లెలా, ఏడవకు, ఏడవకు,
ఏడిస్తె నీ కనుల ప్లాటులే రాలేను!
బావగారికి నీదు బాధలను చెప్పేవా?
నీ కథలు చదివేసి నిను చేసుకున్నారు"
"చెప్పేను, చెప్పినా పెడచెవిని పెట్టేరు
పాఠకుల జోకొట్టి నిద్రపుచ్చేందుకు
నీలాంటి ఆడోళ్ళు చాలమందున్నారు
ఏడ్చే పాపాయికి జోలొకటి పాడంటూ
ఎకసెక్కమాడేరు, ఎగతాళి చేసేరు
నేను భరియించలే నన్న ఈ నరకం!"

(గమనిక: ఇది ఎవరినీ ప్రత్యేకించి కించపరచే ఉద్దేశ్యంతో రాయలేదు. వ్యంగ్యంకోసం రాసినది.

—రచయిత)

—ఎస్. ఎస్. నాయకర్

"అప్పుడే బాల్చీ తెచ్చేశావ్, ఆయన స్నానం చేశారా?" అమృత వదినగారు గోముగా అడుగుతోంది.

"చేశారు వదినా" సన్నగా సమాధానం చెప్పి ఊరుకుంది అమృత.. మరి మాటలు వినిపించలేదు.

ఎంత పేదరికంలో మగ్గుతున్నా రంగనాధం ఇంట్లోంచి మాట బయటికిరాదు. అసలు వాళ్ళు ఒకళ్ళనొకళ్ళు మాట అనుకున్నట్లు నేను వినలేదు ఇంతవరకు.

తర్వాత తలుపుకు తాళం విగించి బయలు దేరాను. హోటల్లో కాఫీ టిఫిన్‌లు ముగించి ఓ స్నేహితుడు కనిపిస్తే అతడితో కాసేపు కాలక్షేపం చేసి తిరిగి యింటికి వచ్చేశాను.

కాలం వృధాచెయ్యటం ఇష్టంలేక క్లిప్ ప్యాడ్ అందుకొని కుర్చీలో కూర్చున్నాను ఏదో రాద్దామని.

ఓ గంట గడిచిపోయింది. ఈ వ్యవధిలో కాగితాలమీద శ్రీకారం మాత్రమే చుట్టగలిగాను.

ఆ తర్వాత అనుకోకుండా ఓ ఐడియా వచ్చింది. మొదలుపెట్టి ఓ పేరా పూర్తిచేశాను. ఎత్తుగడ బాగుందనిపించింది నా మట్టుకు నాకే. ఈ కధకు ఏదో ఒక బహుమతి రావచ్చన్న ధైర్యం కూడా కలగటం మొదలుపెట్టింది ఆ వెంట.

ఏదో విధంగా కధను ఈవేళే పూర్తిచేసి ఫెయిర్ కూడా తయారుచేయాలని తిరిగి రాయటం ఆరంభించాను.

అంతలో అమృత వచ్చి మా మొత్తలో నిలబడటం కనిపించటంతో కలం ఆగి పోయింది.

"నేను వచ్చి మిమ్మల్ని 'డిస్టర్బ్' చేసినట్లున్నాను?" అంది నొచ్చుకున్నట్లు.

"అలాంటిదేం లేదులే తిరిగే కాలు, తిట్టే నోరు ఊరుకోనట్లే-రాసేవాడి చెయ్యి కూడా అంతే" అన్నాను పైకి జోక్‌గా-లోలోపల మాత్రం నా పోటీకధకు ఆదిలోనే హంసపాదా అని బాధగా వుంది.

నా జోక్‌కు సన్నగా నవ్వి, "మళ్ళీ ఏదో కొత్తకథ రాస్తున్నారల్లే వుందే?" అంది.

నేను రచనలు చేస్తానని అమృతకు తెలుసు. నా అభిమాన పాఠకులలో ఆమె కూడా ఒకతె.

అందమైన అమృత అడిగేసరికి అబద్ధం చెప్ప బుద్ధికాక "అవును అమృతా పోటీకి కథ పంపాలనుకుంటున్నాను" అని చెప్పాను.

"ఓ! అయితే తప్పకుండా ఫస్ట్ ప్రైజ్ మీకే వస్తుంది రాయండి " అని తాను వచ్చిన పనేమిటో చెప్పకుండానే వెళ్ళిపోయింది అమృత.

* * *

బయట జనం హడావిడి, ఏడుపులు పెడ బొబ్బలు వినిపించి ఉలిక్కిపడిలేచాను. నేను లేచేసరికి నా దుప్పటిమీంచీ ఏదో రాయి టక్కున క్రింద పడ్డట్టై-ఏమిటా అని చూశాను. ఆ రాతికి ఓ కాగితం చుట్టబడివుంది ఎవరు రాశారా అని ఆత్రంగా దాన్ని విప్పాను.

"రామకృష్ణగార్కి,

నా అభిమాన రచయిత కావడంవల్లనేనేమో మీరంటే నాకు అదోరకమైన యిది దాన్నే ఆకర్షణ అనుకోవచ్చు. ప్రేమ అనుకోవచ్చు. లేదా గౌరవం అనుకోవచ్చు అందుకే అందర్నీ విడిచి మీ ఒక్కరికే నా ఆఖరిమాట చెప్పుకుంటున్నాను.

మీరు తెల్లవారి లేచేసరికి ఓ దుర్వార్త వింటారు. అదే . పక్కవాటా కాపురస్తుడు రంగనాధం చెల్లెలు అమృత బలవంతానా చని పోయింది అని. దీనిమీద రకరకాల వ్యాఖ్యానాలు ఆ పిల్లకు ఏం తెగులు వచ్చింది, పెళ్ళవటం కొంచెం ఆలస్యం అయితే మాత్రం?——అన్న వదినలు పల్లెత్తు మాటనరు. ఎంతో అపురూపంగా చూసుకుంటారు కద—— మరి ఏం పోయేకాలం వచ్చిందనీ అర్థంతరంగా చచ్చిందలా? —— ఇలా వుంటయ్ అందరి మాటలూ. దగ్గిర దగ్గిర మీ అభిప్రాయాలూ అలాగే వుండొచ్చు.

కానీ, ఎవరెలా భావించుకున్నా నా అభిమాన పాత్రులు మీరు మాత్రం నన్ను అపార్థం చేసుకోకూడదు....అయినా మీకు తప్ప మరెవరికి చెప్పుకుంటాను నా గుండె మంటల్ని?

మాది సంస్కారవంతుల కుటుంబం. ఆ 'సంస్కారం' అన్న అందమైన మాట వెనక

దాగివున్న మేకవన్నె పులులు మా అన్న వదినలు. మా యింట్లో పల్లెత్తు మాటకూడా బయటికి రాదు. ఒక్క పొరపొచ్చమూ మా కుటుంబ సభ్యులమధ్య ఉండదన్నది చుట్టు పక్కల అందరి అభిప్రాయం ... నిజానికి మా యింట్లో వాళ్ళమధ్యవున్న వ్యత్యాసాలు మరేయింట్లోనూ కనపడవు. ఆశ్చర్య పోతున్నారా! మా తండ్రి తాతాలకాలం నుంచీ కూడా రివాజుగా వస్తున్నదిదే. ఇంట్లో గొంతులు పిసుక్కొని చంపుకొంటున్నా మాట బయటికి రాకపోవటం మా కుటుంబ సభ్యుల ప్రత్యేకత.

మా అమ్మ నాన్న బ్రతికినంతకాలం నేను హాయిగానే వున్నాను. వాళ్ళు ఒకరి తర్వాత ఒకరు గతించటంతో నా కష్టజీవితం ఆరంభ మైంది.

తనకు పిల్లాజల్లాలేరు. నేను ఒక్కగానొక్క చెల్లెల్ని. అంతోయింతో బాగానే సంపాదిస్తు న్నాడు. స్థోమత్తు వుండి కూడా నన్ను చదివించటానికి ఇష్టపడకపోయాడు అన్నయ్య. కారణం-ఆడపిల్ల బయటి గడప తొక్కితే ఎన్నో అనర్థాలు వస్తయ్యట! ... కొంతవరకునైనా చదువుకొంటే భవిష్యత్తులో నా కాళ్ళమీద నేను నిలబడగలుగుతాను. వేలకువేలు పోసి (కట్నం) పెళ్లిచేసే బాధ్యత తప్పుతుంది అన్నయ్యకు. ఇలా ఆలోచించి చదువును గురించి పట్టుబట్టాను. పర్యవసానం-ఒకనాడు రాత్రి ఓ సీసా తెచ్చి నాకు చూపించాడు అన్నయ్య. అది విషమన్నాడు. నీకు చదువు కావాలో అన్నయ్య కావాలో తేల్చుకోమన్నాడు. 'మీతోపాటే నేనూనండీ' అంటూ అతడికి వంత పాట పాడింది వదిన నా కారణంగా ఇద్దరు నిండుప్రాణాలు తీసుకోవటం నాకు యిష్టంలేక

పోయింది. నిర్ణయాన్ని మార్చుకున్నానని అప్పుడే చెప్పేశాను ఈ విషయం బయట ఎవరికీ తెలియదు. 'కాలేజీలో చేరతానన్నావ్? ఏమైంది అమృతా?' అని పరిచయస్తులడిగితే 'అన్నయ్యా వదిన చదువుకోమనే అన్నారు. కానీ నాకే యిష్టంలేదు' అని అబద్ధం చెప్పాను.

మా అన్నయ్యా వదినల మనఃప్రవృత్తి తెలియచెప్పటంకోసం పైసంగతి ఉదహరించాను . అలా ప్రతి చిన్న సంఘటను గురించీ చెప్పి మిమ్మల్ని విసిగించలేను.

ఇక మీరు పక్కవాటాలోకి వచ్చిన తర్వాత నాకెంతో ఆనందమనిపించింది. మీనాక్షి అక్కయ్యగారి కలుపుగోలుతనం, మీ మంచి తనం నన్నెంతగానో ఆకర్షించాయి. పైగా మీరు రచయిత. మంచి కాలక్షేపం అనుకున్నాను.

మీ యింటికి వచ్చి కాస్సేపు తీరుబడిగా కూర్చున్న మొదటిరోజు 'సిగ్గు ఎగ్గు లేకుండా ఏమిటీ పెత్తనాలు? అవతల మగతనున్నాడు. అక్కడ ఇక ఇకలు పక పకలూనా? మా పరువేం నిలిపేట్లు లేవు. నువ్వు పొర్తిగా తెగించిపోతున్నావ్' అంటూ నెత్తిన ఓ మొట్టికాయ వేసింది వదిన. రాత్రికి వచ్చి తిట్టరాని తిట్లు తిట్టాడు అన్నయ్యా వదిన మాటలమీద.

నేను చేసిన నేరమేమిటి? ప్రక్క వాటాలో కాసేపు కులాసాగా కబుర్లు చెప్పుకొని, సంతోషంగా కాలం గడిపి వచ్చినంత మాత్రానికే వీళ్ళ పరువుకు భంగం కలుగుతుందా?—ఆడపిల్లనై పుట్టినంత మాత్రాన ఒకరింటికి వెళ్ళే హక్కు, ఎదటివారితో మాట్లాడే స్వేచ్ఛ పోగొట్టుకున్నట్లేనా? వీల్లేదు వాళ్ళెన్ని తిట్టినా, కొట్టినా ఆత్మను పూర్తిగా చంపుకొని బ్రతకలేను. నా మనసు ఆవేళే ప్రప్రథమంగా ఎదురు తిరిగింది.

ఆ మర్నాడు అవేమీ పట్టించుకోనట్లే మీ యింటికి వచ్చాను మరల. అక్కయ్యగారితో పాటే మీతోనూ మాట్లాడటం ఎక్కువచేశాను. ఇందువల్ల వాళ్ళకు కక్ష ఎక్కువై నాకు శిక్ష పెరిగింది. దెబ్బలు కొట్టటంతోపాటు తిండి పెట్టటం కూడా మానివేశారు.

అక్కయ్యగారికంటే మీరంటే నాకు ఎక్కువ ఇష్టం. కారణం మీరు ఓ అభ్యుదయ రచయిత. అందమైనవారు. భార్యను పల్లెత్తు మాట అనకుండా మీరు చూసుకునే విధానం నన్ను మరింత ఆకర్షిస్తూంటుంది. కలలుగనే కన్నె పిల్లగా నేను మీవంటి వ్యక్తినే భర్తగా కోరుకుంటాను. ఒక్కోప్పుడు నా వూహాలోకంలో మీరే నా భర్త. అలాంటి తలపు వచ్చినపుడు నేనెంతో పరవశించిపోతుంటాను.

నిన్న ఉదయం మీకు బాల్చీతో నీళ్ళు తెచ్చివ్వటం నేను చేసిన పెద్ద నేరం. పైకి ఆ పట్టింపు లేనట్లు వదిన కొంచెం పెద్దగా మాటాడ్డం మీకు వినిపించే వుంటుంది. కానీ రాత్రి అన్నయ్యా వచ్చాక ఉన్నవి లేనివి కల్పించి చెప్పింది. తిరుగేముంది? దాంతో రౌద్రమూర్తి అయ్యాడు. అతడిలో కసి ఎక్కువయింది. గరిటె ఎర్రగా కాల్చాడు కుంపట్లో. వదిన నన్ను గట్టిగా పట్టుకొంది, అన్నయ్యా నా తొడలమీద వాతలు పెటాడు పైకి ఎవరికీ కనిపించకుండా.

దాంతో నాకిక బ్రతుకు మీద పూర్తిగా విరక్తి కలిగింది. అయినా బ్రతికివుండి యీ






రాక్షస ప్రవృత్తుల మధ్య మసలుతూ నేనేం సాధించగలను? మా అన్నయ్యా వదినలు ఇలా చేశారని సిగ్గువిడచి ఎవరికి చెప్పుకొనేది? వీళ్ళను వదిలి మరెవరి పంచకు చేరేది?

నిన్న నా వింత గాధ చెప్పాలనే మీ యింటికి వచ్చాను. నన్ను మీ పంచకు చేర్చు కోరాదూ అని అడిగివేద్దామనుకున్నాను .. అప్పుడు మీరేదో రాసుకుంటున్నారు. ఏమిటీ పిచ్చి ఆలోచన అని మళ్ళీ నాలో నాకే అని పించి వెనక్కు తిరిగి వెళ్ళిపోయాను. అయినా మీరు వివాహితులు. నావల్ల మీ పచ్చని సంసారం ఏమైపోతుందోనన్నదే నా వెను కంజ.

మీరు కథరాసి ఏదో పత్రిక పోటీకి పంపా లనుకుంటున్నారుకదూ? నా కాధే రాసి పంపండి. ప్రయిజు తప్పకుండా వస్తుంది.

పెరటి బావిలో తేలియాడే అమృత నిర్జీవ ప్రతిమనే మీరిక చూస్తే ''

ఆ ఉత్తరం నన్ను వివశుడ్ని చేసింది. ఆ వెంటనే ఆశ్చర్యమూ కలిగింది.

నిజంగా అమృతది ఎంత దయనీయ గాధ! ప్రక్కవాటాలో వున్న మాకే ఈ సంగతులన్నీ తెలియవంటే! దీనికంతా ఆ రంగనాథం, అతడి భార్యలో వున్న చాతుర్యమే కారణం. పైగా అమృత చాలావరకు కష్టాలకు గురి కావడానికి, ఆఖరికి ఈ వేళ ఆత్మహత్య చేసుకోవడానికి కారణం—నేను, నా భార్యే!!

ఎంత దారుణం జరిగిపోయింది? మళ్ళీ ఆ లావణ్యమూర్తి అమృత కనిపించదు. కన్నీటి పర్యంతమై కడసారిగా ఆమెను చూసి రావటానికి వెళ్ళాను.

నిజంగా కన్నీరు నిండిన పన్నీరుబుడ్డి అమృత. ఆమె గుండె లోతులు సామాన్యంగా ఎవరికీ అంతుబట్టవు.

తన కథ రాసి పత్రిక పోటీకి పంపటం అమృత అభిమతం. ఆ ప్రకారమే ప్రయత్నించి ఆమె మీద నాకు గల గౌరవాన్ని రుజువు చేసుకోవటానికి ఉపక్రమించాను.



# మహిళాజ్యోతి

అది 1931 మార్చినెల. కరాచీలో కాంగ్రెసు మహాసభ జరిగింది. 'గాంధీ ఇర్విన్ ఒడంబడిక'ను ఈ సభలోనే ఆమోదించడమయింది. సర్దార్ వల్లభాయి పటేల్ మహాసభకు అధ్యక్షులు. ఆ సభలో జవహర్‌లాల్ నెహ్రూ ఫండమెంటల్ రైట్సు-అంటే ప్రాథమిక హక్కులపై ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టి ఆమోదింపజేశారు. ఈ తీర్మానమే, మనకు స్వాతంత్ర్యము వచ్చి, భారతదేశ రాజ్యాంగాన్ని రచించినపుడు, అందులో చాలవరకు పొందుపరచబడింది. ఆ తీర్మాన ముఖ్యవిషయాలలో "స్త్రీ పురుష భేదాలు, జాతిమత వ్యత్యాసాలు లేకుండా పౌరులంతా శాసనాల పరిత్రాన్ని ఒకే విధంగా పొందాలి అనీ "వయస్సు వచ్చిన ప్రతివారికి వోటింగు హక్కు ఉండాలి" అనీ చేర్చబడిన అంశాలు గమనించదగ్గవి. దీనివలన స్త్రీజాతికి పురుషులతో పాటు సమాన గౌరవమివ్వాలనే సంకల్పము నెహ్రూ దృష్టిలో ఎంత ప్రధానంగా నాటుకొనిపోయివుందో మన కర్థమవుతుంది.

ఏదో ఒక్కనాడు మెరుపుతీగె మాదిరి వచ్చిన ఆలోచనకాక, కొన్ని సంవత్సరాల నుండి తన ఆలోచనలోనూ, అనుభవములోనూ జీర్ణించుకొనియున్న కోరిక ఇది.

1905 నుండి 1912 వరకు నెహ్రూ ఇంగ్లాండులో చదువుకొన్నాడు. 1905-1906 సంవత్సరాలలో ఇండియాలో జరుగుతూవున్న తిలక్ ఉద్యమం-దాని వార్తలు ఇంగ్లాండులో చదువుతూ మనదేశ సమస్యలపై వుత్సాహం చూపేవాడు. 1910లో ఐర్లండులో తను ఉన్నప్పుడు, అక్కడి స్త్రీల స్వాతంత్రోద్యమం చూచి ప్రభావితుడయ్యాడు.

అనీబిసెంటు అంటే నెహ్రూకి, అతని తండ్రికి విశేషగౌరం. ఆమె సూచనమీదనే ఐర్లాండు వాసస్థుడయిన ప్రొఫెసరు ఫెర్డినాండు బ్రూక్సు అనునతడు నెహ్రూకి ఇంట్లో పాఠాలు చెప్పేవాడు. వీరి పాఠాల ప్రభావం ఊరకనే పోలేదు. దివ్యజ్ఞానసిద్ధాంతాల పైన, స్త్రీ జనోద్ధరణపట్ల దృష్టి బాగా మళ్ళింది. 1917లో భారతీయులకు ఆంగ్లేయులు చేస్తూవున్న అన్యాయాలప తిరుగుబాటు చేసినందులకు అనీబిసెంటుని అరెస్టు చేశారు. ఈ సంఘటన నెహ్రూకి సహించరాని కోపం కలిగించింది.

తానే జైలులో వుండగా స్త్రీ ఖైదీలను చూచి నెహ్రూ బాధపడ్డాడు. "వీరంతా గౌరవ కుటుంబాలకు చెందినవారే. స్వరాజ్యము అంటే అందరూ సామాన్యంగా కోరే స్వరాజ్యమే కాకుండా, ఇంటా బయటా పురుషులతో సమానంగా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు వస్తాయి కదా అని ఆ స్త్రీలు ఉద్యమంలోకి వురికారు. ఈ రెండు కోర్కెలలో దేశస్వరాజ్యానికై బాహాటంగా ఎలుగెత్తి చాటగలిగినా, స్త్రీ స్వేచ్ఛకు సంబంధించిన రెండవ కోర్కె గురించి లోలోనే బాధపడుతూ, రాజకీయ రంగంలోనికి నడుము బిగించి వచ్చారు కదా" అని నెహ్రూ భావించాడు.

"స్త్రీలు స్వేచ్ఛ పొందితేనేగాని ఏ జాతి అయినా, ఏ దేశం అయినా అభివృద్ధి పొందలేదని" కమల్‌పాషా అనునతడు టర్కీస్త్రీల వలననే స్వాతంత్ర్యము సాధించగలిగాడని

ఉపద్రష్ట శారదామూర్తి

కృష్ణ సమర్పించు జి వి ఆర్ పిక్చర్స్

తప్పక చూడండి!

# శభాష్ గోపి



ఫ్యూజి కలర్

నిర్మాత
జి.వి. రాఘవయ్య చౌదరి

దర్శకత్వం
మానికొండ మధుసూదనరావు

స్క్రీన్ ప్లే
జి హనుమంతరావు

నిర్వహణ
జి ఆదిశేషగిరిరావు B.Sc.



శ్రీ ఫిలింస్

VEELAY

నవభారత్ ఫిలింస్ నైజాం శ్రీ పరశురామ ఫిలింస్ కర్ణాటక యునైటెడ్ కంబైన్స్



మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ కళాసాగర్ నుంచి ఉత్తమ చలనచిత్ర కథారచయిత్రిగా బహుమతి నందుకొంటున్న వాసిరెడ్డి సీతాదేవి. బహుమతి అందిస్తున్నది డా॥ భానుమతి. కళాసాగర్ టి. వి. కె. శాస్త్రి చిత్రంలో ఉన్నారు

అజ్మల్‌ఖాన్ చెప్పేవారు. ఇక్కడ మన జాతీయోద్యమంలో విదేశవస్త్ర బహిష్కరణ, కల్లు సారాలు దుకాణాలవద్ద పికెటింగువంటి కార్యక్రమములలో పురుషులకంటే స్త్రీలే ఎక్కువగా పాల్గొనేవారు. ఆ దృశ్యాలు, వార్తలు నెహ్రూకి ఎంతో తృప్తిని, ఆనందాన్ని కలిగించేవి. తన భార్య అయిన కమలకూ, తనకూ వయసులో 10 సం॥ల తేడా. భావాలలో కూడా తేడా. వారి దాంపత్యపు తొలిదినాలలో ఉద్దేశాలు సరిపడక, తరుచు వారిద్దరు కీచులాడుకొనేవారు. కాని రానురాను భర్త ఉద్దేశాలతో ఏకీభవించిన కమల స్వాతంత్ర్యోద్యమంలో స్వచ్ఛందంగా పాల్గొని, చివరకు జైలుశిక్షను అనుభవించినా స్వరాజ్యం-స్త్రీస్వేచ్ఛలపట్ల ఆమె తీసుకొనిన చొరవకు నెహ్రూ ఆనందించాడు. ఉద్యమంలో తిరుగుతూ ఉన్నందున, తన భార్యకు రోగాన్ని దగ్గరుండి బాగుచేయించలేకపోయాడు. ఈ సన్నివేశాలు నెహ్రూని కదల్చివేసి, స్త్రీజాతిపై అతనికి గల మక్కువను ఎక్కువచేసాయి డెహ్రాడూన్ జెయిలులో వుండగా 1934 జూనులో ఆరంభించి 1935 ఫిబ్రవరి నాటికి నెహ్రూ తన ఆత్మకథను వ్రాసినాడు. అందులోకి కొన్ని భాగాలు మాత్రమే 1936లో స్విజర్లాండ శానిటోరియంలో బాధపడుతున్న కమలకు చివరి రోజులలో వినిపించగలిగాడు. కాని ఆమె చనిపోగానే "అయ్యో! పూర్తిగా ఆమెకు వినిపించనైనా లేకపోయానే" అని బాధపడి "ఆమెకే ఆ పుస్తకాన్ని అంకితమిచ్చి" అటువంటి ఉద్గ్రంథముతోపాటు కమల పేరుని కూడా శాశ్వతము చేయగలిగాడు.

స్త్రీల నుద్దేశించి నెహ్రూ ఎన్నో హితవులను బోధించేవాడు. "ఇంటిలోని తగవులు బయటవారు ఎనకుండా చేసుకోవాలి. ఇంటిని స్వర్గతుల్యంగా వుంచుకోవాలి అంటే పిన్న-పెద్ద

అందరితోనూ కలిసి కట్టుగా వుండా"లనేవాడు. కుటుంబ శాంతికై మనము పాటించదగు నియమాన్ని ఎంత చక్కగా వివరించాడో చూడండి. ఇదేకాదు, ఒకసారి స్త్రీ సభలో "ప్రకృతి సిద్ధంగా మొగానికి అందం వస్తుంది. కాని హృదయానికి మాత్రం మనము చేసుకుంటే గాని అందం రాదు. ఈ రెండిటిలో హృదయ సౌందర్యమే ఘన"మైనదని ఉద్బోధించాడు. ఇంకొక విచిత్రం ఏమిటంటే—తరచుగా ఆడవాళ్ళు ఒట్లు వేసుకొనడం చూచి "చీటికీ మాటికీ ఒట్లు వేసుకొనడం ధూర్తుల లక్షణం" అని హెచ్చరించాడు. ప్రతి స్త్రీకూడ, తనకు తానుగా అంతస్థులో పెరిగి-స్వేచ్ఛగా బ్రతికి, పురుషునితో సమాన బాధ్యతలు, హక్కులూ కూడ అనుభవించి, స్వదేశ ప్రగతికి సారధ్యం వహించాలని నెహ్రూకి ఆకాంక్ష.

ఒకరు చెయ్యాలని చెప్పడమే కాకుండా, తన ఆధీనంలో వున్న కుమార్తె ఇందిరకు అన్నివిధాల ఉత్తమ భారతనారిగా శిక్షణ నిచ్చాడు. అది 1928 నాటి సంగతి. అప్పటికింకా ఇందిరకు 12 ఏండ్లే. అయితే ఆమెకు భూమి పుట్టుక గురించి, ఇతర విచిత్రాలగురించి ఎంతో ప్రపంచ జ్ఞానం కలిగేటట్లు, చాల తేలిక భాషలో కొన్ని లేఖలు వ్రాశాడు. ఈ లేఖలు పిల్లలు చదువుతే ప్రపంచమంతా ఏక కుటుంబమనే భావన కలుగుతుందని నెహ్రూ ఆశ. ఇందిర కాపురానికి వెళ్ళి ఇద్దరు కుమారుల తల్లి అయిన తర్వాత చిన్నతనములోనే ఆమె భర్త ఫిరోజ్‌గాంధి గుండెపోటువలన మరణించాడు. ఇక తన కుమార్తెను, మనుమలను దగ్గరనే పెట్టుకొని, వచ్చిన పుట్టెడు దుఃఖాన్ని తనే లోలోన మింగుతూ వీళ్ళని పెంచాడు. తనతో దేశవిదేశాలకు, మహాసభలకు కుమార్తె ఇందిరను తీసుకొని వెళ్తూ వున్నందున, ఆమెకు అఖండమైన ప్రజ్ఞ వచ్చింది. తండ్రి తర్వాత తనుకూడ భారతదేశ ప్రధానిగా పని చేయగలిగిందంటే ఆమెకు నెహ్రూ ఇచ్చిన శిక్షణ, అవకాశాలే కారణము.

"స్త్రీలు అబలలని అన్యాయంగా పురుషులంటారు. పురుషుడు స్త్రీని తన స్నేహితురాలిగా భావించాలి. మానవజాతి ఎన్నో పాపాలను చేసింది. కాని వాటిలో స్త్రీజాతిని దుర్వినియోగం చేయడం వంటి మహాపాపం వేరొకటి లేదు." అని గాంధీజీ అనేవారు. ఆ భావననే నెహ్రూ సమయం వచ్చినప్పుడల్లా గట్టిగా చెప్పేవాడు

నెహ్రూ సిద్ధాంతం కొన్నిటిలో కొంతవరకు గాంధీ సిద్ధాంతాలకు భిన్నమైనవి. నెహ్రూకి మనము చనిపోయిన తరువాత ఏమి అవుతామో అక్కరలేదు. దైనందిన జీవితములో స్త్రీలకు పురుషులకు ఎదురయే నిత్య సమస్యలు, వాటి పరిష్కారము పట్లనే ఎక్కువ ఆసక్తి వుండేది. సోవియట్ రష్యాలోని ఉద్యమము, దాని ఫలితాలు ఇతనిని ఎక్కువగా ప్రభావితము చేసాయని చెప్పాలి. ఇదే మన దేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తరువాత నెహ్రూ ఊహించిన పంచవర్ష ప్రణాళికలకు ప్రాతిపదిక. నాటినుండి నేటివరకు పంచవర్షప్రణాళికలలో, సమాజ వికాస కార్యక్రమాలలో స్త్రీజాతి ఉద్ధరణకు ప్రత్యేకమైన స్థానమిచ్చి, ఎన్నో నిర్మాణ కార్యక్రమాలు నడపబడుతూ వున్నాయి. ఈనాడు స్త్రీజాతిపట్ల ఎక్కడ ఏకొద్ది వికాసము కన్పడినా, పురుషులతో పాటు సమానంగా స్త్రీలు స్వేచ్ఛగా బ్రతకగలిగినా, పరిపాలనా యంత్రాంగంలో స్త్రీలు ఉన్నతపదవుల నలంకరించినా ఈ ప్రగతికి, ఈ మహాసౌధ నిర్మాణానికీ, శ్రీచక్రస్థాపన చేసిన మహనీయుడే నెహ్రూ. కనుక భారత స్త్రీజాతి పండిత జవహర్‌లాల్ నెహ్రూకి సర్వదా కృతజ్ఞతతో నుండగలదని, అతని సేవకు ఋణపడియున్నదని చెప్పక తప్పదు. భావి చరిత్రకారులు ఇదే విషయాన్ని వివరిస్తారనికూడ మా స్త్రీజాతి నమ్ముతూ వున్నది. □

# సినిమా

## అందమైన అనుభవం!

బాలచందర్ కళకు భాషాభేదాలు లేవని నిరూపించిన దర్శకుడు. ఎన్నో చక్కని తమిళ చిత్రాలకు దర్శకత్వం వహించి, అప్పటికి ఫార్ములా సంకెళ్ళతో మ్రగ్గుతున్న తమిళ చిత్రరంగానికి మార్పు చూపించి సినిమాకు దర్శకప్రాధాన్యత ఎంతటిదో నిరూపించిన వ్యక్తి. తెలుగులో కూడా బాలచందర్ దర్శకత్వంలో తయారై అద్భుత విజయం సాధించిన 'మరో చరిత్ర' ద్వారా ఒక తమిళ యువకునికి, ఒక తెలుగు యువతికి మధ్యగల ప్రేమకు చిరంజీవత్వం కల్పించి చక్కని దృశ్యకావ్యం చూపించాడీ దర్శకుడు తెలుగు ప్రేక్షకులకు. ఇప్పుడు కె. బాలచందర్ కమల్ హాసన్, రజనీకాంత్, జయప్రదలతో 'అందమైన అనుభవం' అందిస్తున్నారు. అధికభాగం సింగపూర్‌లో చిత్రీకరించబడ్డ ఈ చిత్రానికి మాటలు గణేష్‌పాత్రో, పాటలు: ఆత్రేయ, సంగీతం యం. ఎస్. విశ్వనాథన్, ఛాయ: బి. యస్. లోకనాథ్.

## నైట్‌క్లబ్‌లో జయమాలినితో శోభన్‌బాబు!

చిత్రనిర్మాణంలో తలనొప్పి రకరకాలుగా వుంటుంది. ఇటీవల డి. రామానాయుడు సమర్పిస్తున్న వెంకటేష్ ఎంటర్‌ప్రైజెస్ వారి 'ఎంకి-నాయుడు బావ' సినిమాస్కోప్ వర్ణ చిత్రానికిగాను నైట్‌క్లబ్‌లో జయమాలినితో శోభన్‌బాబు నృత్యం చేస్తున్న దృశ్యాన్ని చిత్రీకరిస్తున్నారు. పదినిమిషాలకోకసారి ఎలక్ట్రిసిటీ ఫెయిల్యూర్, మళ్ళీ మరో పదినిమిషాల పని ఇలా సాగుతోంది షూటింగ్. ఎన్నో చిత్రాలు

'అందమైన అనుభవం'లో ఒక దృశ్యం





'కేడి నెం. 1' లో రామారావు

నిర్మించిన అనుభవశాలి గనుకనే నిబ్బరంగా జరుగుతున్న దాన్ని 'పార్ట్ ఆఫ్ ది ఫిల్మ్ మేకింగ్ గేమ్'గా తీసుకొని, ఆ చిత్ర విశేషాలను కులాసాగా మాట్లాడుతూ పత్రికా ప్రతినిధులకు వివరించారు ఆ చిత్రాన్ని సమర్పిస్తున్న రామానాయుడు. రామానాయుడు నిర్మించే చిత్రాల్లో ఆయన 'కనిపించే' ఆచారం వుంది. ఆ విషయమై అడగ్గా 'ఎంకి-నాయుడు బావ'లో తానెలా కన్పించానో చెప్పారు. ఎలా కన్పించారంటే కొంచెం సస్పెన్స్....త్వరలో రాబోయే ఎంకి-నాయుడు బావ మీరు చూసే వరకు. ఈ చిత్రంలో శోభన్‌బాబు, వాణిశ్రీ, నాయకా నాయికలుగా నటిస్తున్నారు. దర్శకుడు బోయిన సుబ్బారావు.

## కమలమ్మ కమతం

పూర్తిగ్రామీణ వాతావరణం, అంతేగాక పూర్తిగా గ్రామీణులే అయిన వ్యక్తులమధ్య కథ [కొన్ని చిత్రాలు అలా కాదు. పూర్తి గ్రామీణ వాతావరణంలోనే పూర్తి నగరవాసుల వాసనలతో వుంటాయి మరి!] 'కమలమ్మ కమతం' చిత్రంలో అంతర్భాగాలు. 'కొత్తరకం' చిత్రాలకు రచనలు చేస్తున్న సి. యస్. రావు కథకు ప్రత్యగాత్మ దర్శకత్వంలో వర్ణచిత్ర రూపం కల్పిస్తున్నది ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్ అధిపతి అనుమోలు వెంకటసుబ్బారావు. కృష్ణంరాజు, జయంతి పల్లవి, గిరిబాబు, అల్లు రామలింగయ్య, వంకాయల, జయభాస్కర్, విజయలలిత, జయమాలిని తారాగణం.

## ప్రేమ లవ్ కాదు!

'ప్రేమచేసిన పెళ్ళి' విజయనిర్మల దర్శకత్వంలో తయారైన చిత్రం. గౌరీశ్వరీ ఆర్ట్స్ నిర్మించిన వర్ణచిత్రం యిది. చిత్రంపేరు కొంచెం కన్‌ఫ్యూజింగ్‌గా వుంది. 'ప్రేమ చేసిన పెళ్ళిలో ప్రేమ 'లవ్' కాదు' అన్నారు రాఘవరావ్, ఆ చిత్ర నిర్మాణ సారథులలో ఒకరు. ఈ చిత్రంలో 'ప్రేమ' అనే పాపవల్ల జరిగిన పెళ్ళి అన్నది వివరణ. చంద్రమోహన్ జరీనావహాబ్, రంగనాథ్. జయలక్ష్మి, నాగభూషణం, పండరీబాయి, గుమ్మడి, కాంతారావు, కృష్ణకుమారి, బేబీదుర్గ, పి. జె. శర్మ మొదలయిన వారు నటిస్తున్నారు.

## ఇద్దరూ అసాధ్యులే!

శ్రీ సారథీ స్టూడియోస్ వారు కృష్ణ, రజనీకాంత్‌లతో 'అన్నదమ్ముల సవాల్' చిత్రాన్ని నిర్మించి అద్భుత విజయం సాధించారు. ఇప్పుడు యిదే నటులిద్దరూ నటిస్తున్న ఆ నిర్మాతల చిత్రం ('ఇద్దరూ అసాధ్యులే')లో చిత్రీకరించబడ్డ పాటల దృశ్యాలు ఇటీవల మద్రాసులోని పత్రికావిలేఖరులకు చూపించారు. సాహసం, సెంటిమెంట్, శృంగారం సమ

వాళ్ళలో మెళవించి, అధిక ధనవ్యయంతో రంగుల హరివిల్లుగా రూపొందించబడుతున్న ఈ చిత్రానికి యాక్షన్ చిత్రాలకు ఏస్ డైరెక్టర్‌గా పేరొందిన కె. యస్. ఆర్. దాస్ దర్శకత్వం వహిస్తున్నారు.

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఫిలిం అవార్డ్స్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏటేటా ఉత్తమ చిత్రాలకు అందిస్తున్న అవార్డ్స్ 1977 సంవత్సరానికిగాను ప్రకటించబడ్డాయి. ఉత్తమ చిత్రంగా 'చిలకమ్మ చెప్పింది', ద్వితీయ ఉత్తమచిత్రంగా 'తరంమారింది', తృతీయ ఉత్తమచిత్రంగా 'ఒక ఊరికథ' బహుమతులు పొందాయి. చలన చిత్ర కథారచనలో ప్రథమబహుమతి 'ఇదెక్కడి న్యాయం' (బి.వి.యస్. అచ్యుతవల్లి) ద్వితీయ బహుమతి తరం మారింది (మాదిరెడ్డి సులోచన)లకు లభించాయి. ఉత్తమ నటుడుగా కృష్ణంరాజు (అమరదీపం) ఉత్తమ నటిగా లక్ష్మి (పంతులమ్మ) ఉత్తమ బాలనటిగా బేబి రాణి (పంతులమ్మ) ఎన్నికయారు. ఉత్తమ ఛాయాగ్రహకుడుగా విన్సెంట్, ఉత్తమ స్క్రీన్‌ప్లేకి ఈరంకి శర్మ (చిలకమ్మ చెప్పింది). ఉత్తమ పాటల రచయితగా వేటూరి సుందరరామమూర్తి (మానసవీణా మధుగీతం— పంతులమ్మ) ఉత్తమ గాయకుడిగా రమేష్ నాయుడు (తల్లి గోదావరికి ఆటుపోటులుంటే— చిలరకొట్టు చిట్టెమ్మ) ఉత్తమ గాయనిగా సుశీల (ఏ తల్లి నిను కన్నదో—దాన వీర శూర కర్ణ). ఉత్తమ సంగీత దర్శకుడిగా రాజన్ నాగేంద్ర (పంతులమ్మ). ఈ బహుమతులను ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధానన్యాయమూర్తి ఆవుల సాంబశివరావు అధ్యక్షతన రాష్ట్రప్రభుత్వం ఏర్పాటుచేసిన కమిటీ సిఫార్సు చేసింది. ఉత్తమచిత్రాల ఎన్నికలో సాంకేతికపరమైన కొన్ని నిబంధనలను సరిగా పట్టించుకోకపోవడం విచారకరమని కొంతమంది చిత్ర పరిశ్రమలోని వ్యక్తులు అభిప్రాయపడుతున్నారు. ఇతర భాషలలో ముందు నిర్మించబడి ఆ భాషలో అవార్డులు గెలుచుకొన్న చిత్రాలు తెలుగులో పునర్నిర్మించినా అవార్డ్స్ పరిశీలనకు పంపరాదన్న నిబంధన ముఖ్యంగా పాటించబడటం లేదన్నది విమర్శ.

'రామబాణం'లో కృష్ణంరాజు, జమున



## ఒక ఊరి కథకు ఎవార్డుల పరంపర!

ప్రఖ్యాత బెంగాలీ దర్శకుడు మృణాళ్ సేన్ దర్శకత్వంలో చంద్రోదయా ఆర్ట్ ఫిలింస్ వారు నిర్మించిన వర్ణ చిత్రం తయారై చాలా కాలమయినా ఇంకా తెలుగు ప్రేక్షకుల ముందుకు రాలేదు. ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వంచే వినోదపు పన్ను మినహాయింపు పొంది త్వరలో విడుదల కాబోతున్న ఈ చిత్రం విడుదలకు ముందే ఒకటికి మించి అవార్డులు గెలుచుకొని సంచలనం కలిగించింది. కేంద్ర ప్రభుత్వంచే ఉత్తమ ప్రాంతీయ చిత్రంగా (తెలుగు) బహుమతి, కార్లోమయివరీలో ప్రత్యేక ప్రశంసా బహుమతి పొందిన ఈ చిత్రం ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వంచే అవార్డ్ గెలుచుకొంది. తను నటించిన ప్రథమ చిత్రంతోనే (చోమనదుడి కన్నడ) కేంద్ర ప్రభుత్వంచే ఉత్తమ నటుడి అవార్డు పొందిన వాసుదేవరావు, నారాయణ రావు, మమతా శంకర్ మున్నగువారు నటించిన ఈ చిత్రానికి ఏల్చూరి విజయరాఘవరావ్ సంగీతం: కె. కె. మహాజన్ ఛాయ సమకూర్చారు. ఎ. పరంధామ రెడ్డి ఈ చిత్రాన్ని నిర్మించారు.



'పట్నం పిల్ల'లో కమలహాసన్

'శివకేశవులు'లో మురళీమోహన్, జయమాలిని





'ఇద్దరూ అసాధ్యులే'లో గీత, కృష్ణ

నిమజ్జనం!

"ఊరుమ్మడి బ్రతుకులు" చిత్రంద్వారా జీవితానికి అతిదగ్గరగా, సహజత్వాన్ని కాపాడుతూ కొత్తరకం చిత్రాన్ని తెలుగు ప్రేక్షకులకు పరిచయం చేసి ప్రసిద్ధుడయిన దర్శకుడు బి. ఎస్. నారాయణ, ఇప్పుడు వాణిజ్య సూత్రాలకు కట్టుబడక జీవితానికి అతి దగ్గరగా సహజత్వానికి అద్దంపడుతూ రెడ్‌రాజ్ ఫిలింస్ పతాకంపై నిర్మించబడుతున్న 'నిమజ్జనం' చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. నాయకానాయికలుగా బోస్‌బాబు, శారద నటిస్తున్నారు. మంజరీ ఎస్



'కోరికలే గుర్రాలైతే' లో మురళీమోహన్, ప్రభ



'తాయారమ్మ-బంగారయ్య'లో మాధవి

ఈశ్వరన్ మళయాళ కథ ఆధారంగా నిర్మిస్తున్న ఈ చిత్రానికి బొల్లిముంత శివరామకృష్ణ సంభాషణలు సమకూర్చారు.

## శ్రీ భాస్కర చిత్రవారి చిత్రం!

బి.ఎ. సుబ్బారావు దర్శకత్వంలో ఎన్.టి. రామారావు, జగ్గయ్య, గుమ్మడి. పద్మనాభం, మిక్కిలినేని, రమణమూర్తి, నూతన ప్రసాద్, వాణిశ్రీ, ఛాయాదేవి పుష్పలతలతో శ్రీ భాస్కర చిత్ర నిర్మిస్తున్న వర్ణచిత్రం పూర్తి కావచ్చింది. మాటలు: గొల్లపూడి; ఛాయా గ్రహణం: ఎం.ఎ. రహిమాన్, నిర్మాణ నిర్వహణ: ఏ.బి.ఎల్. ప్రసాద్; నిర్మాత: ఎ. పుండరీకాక్షయ్య.

## కాక్ టెయిల్

నటుడు కొమ్మినేని శేషగిరిరావు దర్శకుడై తొలి చిత్రం దేవతలారా దీవించండి చిత్రంతో విజయం సాధించిన తర్వాత ఆయన దర్శకత్వంలో సింహగర్జన విడుదలయింది. ఇప్పుడు తాయారమ్మ-బంగారయ్య చిత్రం తయారై విడుదలకు సిద్ధంగా వుంది. మధ్యలో ఈ దర్శకుని చేతిలో "కరాటే కమల" చిత్రం రూపొందింది. ఇప్పుడు ఆనందలక్ష్మి ఆర్ట్ మూవీస్ వారు నిర్మిస్తున్న చిత్రం "లక్ష్మీపూజ"కు దర్శకత్వం చేపట్టారు కొమ్మినేని. సాంఘిక, జానపద, పౌరాణికాల చిత్రమైన కలయికతో రూపొందిన ఈ చిత్ర కథకు మాటలు భారవి సమకూర్చగా పాటలు వేటూరి రచిస్తున్నారు. నరసింహరాజు, చంద్రకళ, జయమాలిని, మిక్కిలినేని, బేబి రోహిణి, పండరీబాయి, జయవిజయ్, జయవాణి, ముక్కామల, కె.కె. శర్మ, బాలకృష్ణ మొదలగువారు నటిస్తున్నారీ చిత్రంలో. నిర్మాత పింజల ఆనందరావు.

## సొమ్మొకడిది-సోకొకడిది

కమల్‌హాసన్ ద్విపాత్రాభినయం విశేషాకర్షణగా తయారయిన 'సొమ్మొకడిది-సోకొకడిది' చిత్రంలో జయసుధ, రోజారమణి నాయికలుగా నటిస్తున్నారు. జయ, పండరీబాయి, ప్రభాకరరెడ్డి, కాంతారావు, సారథి, రావికొండలరావు, లతో పాటు రచయిత సి.యస్. రావుకూడా ఈ చిత్రంలో నటిస్తున్నారు. సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో ఎస్.వి.యస్. ఫిలింస్ నిర్మించిన ఈ చిత్రానికి బాలుమహేంద్ర ఛాయాగ్రహణం, జంధ్యాల మాటలు, రాజన్ నాగేంద్ర సంగీతం సమకూర్చారు.

—యస్వీనారాయణ

